సీ. ఉభయ పార్శ్వంబుల నిభఘటలేలొకో చనుదేవు సమదాళి సమితి మొరయ. విరా. 1-86

2. ఇహపరములు.

వ. ...అశుభ నిరాసనంబును, శుభాధానంబును నొనర్చుచుఁ బ్రజలం బాలించు భూపతి యుభయలోకసిద్ధులం బొందు. శాం. తి. 2-285

**ఉమ** సం. వి. అ స్త్రీ.

పార్వతి.

(1. ఉ ఇత్యనేన సంబోధ్య మా ఇత్యనేన తపసో మాత్రా నిషిద్ధత్వా దుమా ఉ-ఓబిడ్డా. మా-వలదు. అని యిట్లు తల్లిచేఁ దపస్సువలన నిషేధింపఁబడెను గనుక ఉమ 2 అపతీ త్వ్యమా రక్షించునట్టిది. అవ రక్షణే)

తే. ఉమయు నగ్నియు గంగయు నుండ నన్న, గారవంబున నధికునిఁ గాఁ దలఁచి, చక్రనాపాలి కేతెంచు నాకొక్క వీఁడు, సంభృత స్నేహభక్తి ప్రసన్నుఁడగుచు. శల్య. 2-179; అను. 4-895

**ఉమాపతి** సం. వి. ఇ. పుం.

శివుఁడు.

వ. శంకరుండు రుద్రుండు శివుండు స్థాణుం డుమాపతియను పేళ్ళఁ బరఁగు. శాంతి. 8-120

**ఉమియు** దే. అ. క్రి.

1. నిష్ఠీవనముచేయు, ఉమ్మివేయు.

వ. వాని నెవ్వరుగా నటి గి యజ్ఞసపతి యతని పజ్జన చనం జన నతండు మరలిచూచి పైఁ ధూళి ల్లియు నుమిసియు వేదుఱు చంపెఁబు శాసింప. ఆశ్వ. 1-47; అను. 4-118; అర. 4-31

2. గ్రక్కు.

సీ. ఉగ్రవిషానలం బుమియుచున్న మహీంద్రుఁ గడగి నేఁ డెవ్వండు గాలఁదన్నె. అగ. 6—315

**ఉముక; ఉముకలు** దే. వి. ఊఁక.

తుమము, ధాన్యశూకి, వడపై పొట్టు.

ఆ. ఉముక దినుచు నిట్టులుండి నీ తొల్లింటి, లీలఁ దలఁచి యుమ్మలింతొ లేదొ, యున్నరూపు సెప్పవన్న గార్ధభరూప ధారణైక నిపుణ దానవేంద్ర. శాంతి. 4-391

ఉ. గాడిదరూపు దాల్చి యుముకల్ దినుచుండఁగఁ జూచి యుల్ల సం,బాడెదు శక్ర. శాంతి. 4-396

**ఉమ్మడి** దే. అవ్య.
ఒకే కాలము, యుగపదర్థకము, 'ఒక్క' శబ్దపూర్వకముగానే దీనికి తిక్కనగారి ప్రయోగము. నన్నయ ప్రయోగము కానరాదు.

ఒక్క యుమ్మడి. ద్రోణ 2-92; ద్రోణ. 1-132

చూ. ఒక్కుమ్మడి, ఒక్కయుమ్మడి.

**ఉమ్మలము** దే. వి.
సంతాపము, దుఃఖము.

అ. ఇంత తలర నేల యెమ్మెయి నైనను, గొమ్మ నలవరించి కూర్చు టరుదె, యుమ్మలంబు నిక్కి యూఱటతోడ నీ, వేగు మనలవలవ దింక సిచట. విరా. 2-80

క. కనకమయ యూపమొప్పఁగ, నమాన విధమున నీవు యాగం బొనరిం,చిన యొప్పును నిప్పటి నీ, యునికియునుం జూచి నాకు నుమ్మలమయ్యెన్. శాంతి 4-390

**ఉమ్మలించు** దే. అ. క్రి. (ఉమ్మలము + ఇంచు)
1. తపించు, దుఃఖించు, శోకించు

ఉ. అక్కట యేమి వేడ్కపడి యానెడు నాసవ మర్థిఁదేరఁగా, నొక్క నికృష్టుఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో,సెక్కఁగఁ జేసి నిన్ను నతిహీన విధాననియుక్తఁ జేతఁగా, నిక్కమ యుమ్మలించి తిది నెయ్యము కల్మియె సఖి. విరా. 2-98

తే. చనిన నయ్యోలనాఁగయు సంభ్రమంబు, దెచ్చికొని చూ నెఱుంగని తెఱఁగు దాల్చి, శాత్యమున నుమ్మలించి పాంచాలితోడ, నెఱుఁగు వేఁటోక భంగిగా నిట్లు లనియె. విరా. 3-156

2. విచారపడు, దీనత్వము నొందు.

వ. తీమ్మల గాంచి రట్లు సముచిత ప్రకారంబునం గని యతనిం బరివే

ష్టి చి యాసీనులై రప్పు డచ్యుతుం డమ్మహాత్ము నాలోకించి యున్మలించుచు నతనితోడ. శాంతి. 2-99

"శ్లో. కించిద్దీనమనా భీష్మమితి హోవాచ కేశవః" సం. భా. శాంతి. 50-12

3. విచారించు, ఆలోచించు, తలంచు.

వ. విరూపాక్షుండు విశాలాక్షుండను నామంబున నావిర్భవించి యా గ్రంథం బధిమించి దాని నభ్యసించుటకు మర్త్యుల కాయుర్వృద్ధులు సాలవనియు మ్మలించి యమ్మహనీయ తంత్రంబు సంక్షేప రూపంబుగ బది వేలధ్యాయంబుల వైశాలాక్షంబను నిర్మించె. శాంతి. 2-203

**ఉమ్మలిక; ఉమ్మలికము** దే. వి.

1. ఇమ్మహిరెల్లను నీమది, యుమ్మలికకుఁ జాల నొచ్చె నుర్వీవర. ఉద్యో. 1-107

చ. ...ఉమ్మలికయు నుబ్బు నాదుమది మందునకైనను లేదు కేశవా. శాంతి 4-395

క. మనుమట్ట నెఱిఁగి శ్రాద్ధంబునకుం గైకొనుట మేలు భూసురునిం గైకొని యరసి కాఁడనిన వానిని యుమ్మలికంబు సెఱచు ధార్మికుడైనన్. అను. 8-182

2. కష్టము, ఇడుమ, బాధ.

సీ. నలుని పిలుపించఁ గానల కేఁగి దమయంతి మనుజులు పడని యుమ్మలిక పడదె విరా. 2-284

వ. ఇవ్విధంబునఁ గృష్ణునితోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ బ్రవ్విక్రొని శోకంబు వెల్లిగొన. ఉద్యో. 1-181

**ఉమ్మలికించు** దే. అ. క్రి. ఉమ్మలించు (ఉమ్మలిక + ఇంచు)

చ. ...భీష్ముఁ డటఁ గని వారికిట్లను సుగలార కౌఁగిలి నాత్మఁ గలంచి యకాండ మేఁకలోమనిచిన వాఁడఁ బ్రాణముల నుమ్మలికింపకుఁడించుకేనియున్. భీష్మ. 3-15

సీ. క్షత్ర ధర్మంబునఁ గైకొంటి మేదిని, యుమ్మలికింపక లెమ్ము వత్స అశ్వ. 1-6

**ఉయ్యాల** దే. వి.

ఉయ్యెల.

సీ ఓహారిసాహరి నుయ్యాల చేరుగా వెనుకొంచుఁ దెరలుచుఁ జెంగుఁ నెడలు. విరా. 8-164

**ఉయ్యాలచేరు** దే. వి.

ఉయ్యెలకుఁ గట్టిన త్రాఁడు, ఉయ్యెలత్రాఁడు.

సీ. ఓహారిసాహరి నుయ్యాల చేరుగా వెనుకొంచుఁ దెరలుచుఁ జెంగ, నెడలు. విరా. 8-164.

**ఉయ్యెల** దే. వి.

ఉయ్యాల.

చ. నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గళాగళకారిదైన యుయ్యెల యును బోలె నూఁగడక యెంతయుఁ బ్రొద్దు విశ్రిశాత్ముఁడై. అర. 2-78.

చ. ...సమీరణుఁడన్ సఖుఁ డూఁచు చుండగా, నులియుచు మొల్ల గుత్తులను నుయ్యెల లొప్పఁగ నెక్కి యూఁగె దుమ్మెల దళిసీ కులంబు. అర. 4-188

**ఉరగకేతనుఁడు** సం. వి. అ. పుం.

సర్పము ధ్వజ చిహ్నముగాఁ గలవాఁడు, దుర్యోధనుఁడు.

వ వీరలలో నురగకేతనుండు లేఁడు. విరా. 4-250

**ఉరగనివాసము** సం. వి. అ. పుం.

పాతాళలోకము.

ఏ. ఉరగనివాసంబుల ననుకరించు తలంబులును. విరా. 8-238

**ఉరగము** సం. వి. అ. పుం.

1. ఱొమ్ముతోఁ బ్రాకునది, సర్పము,

మ. మహోరగంబులం బెట్టియలం బెట్టి కట్టుచందంబున బంధించి విరా. 1-178

2. దుర్యోధనుని ధ్వజచిహ్నము.

సీ. ...ఉద్దీప్యమాన మహోరగంబు కేతనంబుల నొప్పు ..రారాజు
సకు. ద్రోణ. 3-288.

3. ఒక పర్వతము.

సీ. ప్రాక్పయోనిధి పొంతఁ బర్వతం బొక్కటి, ఘనశృంగ కబళితా
కాశ మగుచు, నురగ నామంబున నొప్పు. అను 1—220.

**ఉరగుఁడు** సం. వి. అ. పుం.

నాగజాతివాఁడు

క. సురలును నసురులు యక్షులు, నురగులు గంధర్వులును.

**ఉరము** సం. వి. స్. న.

రొమ్ము, వక్షము.

సీ. ప్రథమా దిఁ దోఁతెంచు భానుబింబమునా నురమ్మునఁ గౌస్తుభ
రత్న మొప్ప. విరా. 1-12; శాంతి 5-589

**ఉరలంబాఱు** దే. అ. క్రి.

విడిపోవు, చెదరు.

మ. ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళ శ్రేణి కంధరముల్
మ్రొగ్గఁబడన్ దిశావలయముత్కంపంబుగా నిబిడం,బురలంబాఱఁగ
భీష్ముపైఁ గవిసె భీష్మ- 3-262

**ఉరలించు** దే. స. క్రి.

ఉరఁజేయు, ప్రవహింపఁజేయు.

వ. తలలు చిదుము చు నంగశకలంబులు రాల్చుచు, నెత్తురు లురలించుచు
దండలుసెక్కుచు. ద్రోణ. 2-18; ద్రోణ 1-308, శల్య. 1-211

**ఉరలు; ఉరులు** దే. అ. క్రి.

(ఉరాలు ఉరులు పదములు వివక్షణలేకుండ ముద్రింపఁబడి యున్నవి.
కొన్ని ప్రతులలో 'ఉరలు' చోట్ల 'ఉరులు' - 'ఉరుబు' చోట్ల
'ఉరఁ' గలదు. ... కలిసియు యర్థమీయఁబడినది. నన్నయ

భారతమున 'ఉరలు' లేదు. తిక్కన భారతమునందే యీ యస్త్ర వ్యస్త ముద్రణము.)

1. స్రవించు, కాఱు.

వ. కరిహాయతతిఁ జెల్లుగ నస్రు లురులఁ జొచ్చెను భీష్మ 1-9

వ. దమయంతి వానినెఱి గి తన పుత్రులఁ గ్లిరంగ్రముల బాంధవులం బ్రత్యేకంబ యడిగి యశ్రుజలంబు లురుల నేడ్చుచున్నఁ జూచి. అర. 2-145; భా, 2-289

2. దొర్లు, జాఱిపడు.

ఆ. పొడిచి పలువురేయఁ బొడువ బ్రేయఁగ భగ, త్తుంటి రక్తధార లొప్పెఁ, జెలువు రెట్టిగాఁగ శేపుఁ సెంగలులు, లున్న చాచల మున నురలునట్లు. భీష్మ, 3-146

క. డెందము గలంగఁ గన్నీ, రానంద మెుగ బుమిలఁ గన్గొ నునగాలన్. మౌస 196

3. పడు, రాలు.

క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, నిప్పు లురలు చూపులడర నిశితాస్త్రములం, గప్పె గురుని. ద్రోణ. 1-156

వ. మత్స్యయంత్రం బర్జునుం డస్త్రమునను దురల చేసె. ఆది. 8-15; ఆది 7-132

4. కూలు, విఱిగిపడు.

వ. బాహుకుండు విని వీని నెన్ని కాని నిశ్చయింప నేరని తనరథంబు నిలిపి యా వృక్షం బాఘణంబ యురులం ద్రోచి యగ్గలికలంగల యాకులుం బండులు నెన్నిన బుహుగ్గుండు చెప్పినయన్నియయుడు. అడి. 2-174

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షం బురులం ద్రోచి. అర. 3-816

క. గిరిగుహాంతర మురలన్. అర. 3-817

(గిరిగుహామ ఖములకున్ — అని ఆనందవారి ప్రతి)

**ఉరవడి** దే. వి. (ఉరవు+వడి) ఉరవణి

1. మిక్కిలి వేగము.

సీ. ఉరవడి నేఁలు దెరలఁ ద్రైఁ దోఁతెంచు ధూళి వెల్లువరిసఁ దూలిపోక. విరా. 4-62

క. మొనసి చను దెంచు దుర్యోధన సేనా సముదయంబుఁ దఱియ సురవడిం, జననిమ్ము మనరథము నా, సునిశిత బాణముల సమయ జూచెద దీనన్. శల్య. 1-346

2. శౌర్యము, పరాక్రమము.

క. తరవు వెసఁ జెఱికికొని నీ, వురవడిమైఁ గవిసితేని యుభయబలము న,చ్చెరువందుచుఁ జూచి వృకో,దరుఁడపగుట యెఱుఁగకున్నె తద్విధమేలా? విరా. 3-206

క. కురబలముఁ దొడరి గెలువఁగ, సురగణములకైన నరిది శూరోత్తము నీ, వురవడి గెలిచితి శాత్రవ,పృథగణంబును బాహుబలముఁ దొగడం గనదే. ద్రోణ. 5-7; భీష్మ. 2-313

3. విజృంభణము.

వ. భయసంభరితంబగు ననిసంకులంబున సామజవాజిరథంబుల యురవడిక నోసరింపని కాల్బలంబులు. భీష్మ. 1-267

క. గదయును ధృష్టద్యుమ్నుని, యురవడి గద నిలువరించి యుద్ధతి మెఱుంగుచున్, శరపంచకమున నొంచెను. శల్య 1-218

**ఉరవడించు** దే. అ. క్రి. (ఉరవణించు)

1. విజృంభించు, రేగు.

సీ. కనిమూఁకగిన పూరి గడఁగి జీవులమీఁద నుగ్రగనఁ గవియునట్లుర వడించి. ఉద్యో. 2-139

2. పరాక్రమించు.

వ. సాత్యకియు ధృష్టద్యుమ్నుండును గేకయు పంచకంబును విరాటుండును నని కౌరవకులం బలగడచి యురవడించిన. భీష్మ. 1-280

3. వేగముగాఁ బరువెత్తు.

సీ. ... అచ్యుతుఁ జూచి రథ్యమ్ములు మేనుల నలుఁగుచుండ,గీ.

నురవడింపవు వీరల సరకు గొనక, వీని నిప్పుడ యమ్ములు విడిచి తడవు, మనుడు. ద్రోణ 3-151

4. లంఘించు. దూకు.

వ. కరుకమూరు లమ్మారులిం జుట్టుముట్టి విశిఖంబులు నిగిడించినం గోపించి దుర్మదుసితేరి కురవడించి తురంగంబులం బొరివుచ్చి సారథి జదిపిన. ద్రోణ. 5-68

**ఉరవణి** దే. వి.

ఉరవడి.

వ. అమ్మోహారం బా సూతనందను మొన యురవడి సరకుగొనక మరొ నియె. కర్ణ. 2-149

**ఉరవణించు** దే. అ. క్రి.

1. పరాక్రమించు.

వ. సౌబలుండు వేత్రోక్క విల్లెత్తి యతెలపి నురవణించి పాండవ రథికులం గలంచె. కర్ణ. 1-151

చ. ... సంగరంబున, న్విదిత విక్రమై నురవణించుటయున్ నృప ధర్మమల్. శాంతి. 2-224

శ్లో నిత్యోద్యుక్తో దస్యువధే రణే కుర్యాత్పరాక్రమమ్ సం. భా. శా ౦. 60-10

2. కవియు, దుముకు.

వ ప్రాణ బులు మీకింత సేయ్యెనే యని పలికినను నిలువక పైపయి వారు రవణించిన. ఆశ్వ. 4-48

**ఉరవు** దే. వి. ఉలవు

ఉచితము, అర్హము, తగినది.

క. అ ఘా మర్త్యుల జీవసు, మనిత్యమని యెఱిగి సుఖము నవ్వుడు దుఃఖము యవుడు ధర్మ మేమఱకునికియ యొజ్జ నిక్కమవ నుర వూహింపన్. శాంతి. 5-489; శాం. ౦. 4-43; శాం. ౦. 2-381

**ఉరస్థ్సలము** సం. వి. అ. న.

వక్షః పీఠి

వ. గంధమాదనంబున నేను దపంబు సేయుచుండ నకాలంబునఁ గాలాంతకుండు దక్షునియజ్ఞంబున కలిగిన నిజ భీతిం బఱతెంచి నాయురస్థలంబునొందిన మదీయకేశంబులు ముంజనిభంబులగుటం జేసి ముంజకేశుండను పేరుగలిగె. శాంతి. 6-441

**ఉరస్సు** సం. వి. స్. న.

రొమ్ము

క. తమలోన మాటలాడెడు, సమయంబున నొక్కరుఁడు విశాలో రస్కుం, డమితబలుఁడు. విరా. 2-5

**ఉరి** దే. వి.

1 వాగుర, ఉచ్చు, పశులను మృగములను పట్టుకొను రజ్జువిశేషము.

తే. ద్రౌపదీ రూపమను నుఱఁ దగిలి తనదు, హృదయమను మృగ మత్తటి నుదిలకొనుచుఁ, గాముఁడను బల్లిదపువేఁటకానిచేతిఁ, బడుట కెంతయు నాసింహబలుఁడు దలరి. విరా. 2-24

క. వల యురి యోగము గాలము, గలిగికదా మృగముఁ బక్షి, గజము ఝషము గృషులు వట్టుదు రట్టుల తజ్జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. శాంతి. 4-181

ఆ. యోగబలము లేక యొకతంగి యోగి బల్, ద్రోవలేని మీను సేవలేని, మృగము వలయు నురియుఁ దెగిపోవ నుఱకంగ, లేని యట్లు భవము లోన నడఁగ. శాంతి. 5-573; శాంతి. 8-208

2. కంఠపాశము, చనిపోవుటకై గొంతుసకు వేసికొనెడి ఉచ్చు.

గీ. వానిఁ దెగఁజూడవై తేని వాయుపుత్ర, నీవు గనుగొన నురినైన నీరనైన, నగ్నినై న విషంబుననైన నేను, మేనుదొఱఁగుదు. విరా. 2-229

**ఉరిపోయు** దే. అ. క్రి.

ఉచ్చు తగిలించు.

సీ. ఉభయ పార్శ్వంబుల మరిపోసినట్లవి ద్రేలిచచ్చిన. శాంతి. 4-40

**ఉరియాట** దే. వి. (√ఉరియాడు) ఉరియాడుట

సందేహము, శంక.

తే. ...ఇట్లు...మీరు సెప్పంగ నురియాట మేలె. శాంతి. 1-275

శ్లో. న తే ఖిశంకే వచనమ్ య్స్రిపిషి తపోధన,
అపరోక్షోహితే ధర్మః సర్వధర్మవిదాంవర.
సం. భా. శాంతి. 33-10

**ఉరియాడు** దే. అ. క్రి.

**1.** కళవళపడు, కలంతఁజెందు.

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబు నుత్తలంబుడిపి కొని. విరా. 1-161

వ. ఇట్లభినందించియున్న యన్నరేంద్రుం దమ్ము ప్రశంసించి మనం బురి యాడునోయని శంకించి యతనితో మఱియు నిట్లను నివ్విధం బాచరించుటకు విచారంబు వలపదు. కర్ణ 1-267

**2.** పరితపించు.

వ. పాండవులం బరిమార్చుపని నేఁడచేయక మఱిచేసిన నారాజు నిర్గత ప్రాణుండైన నాకెలసం బెవ్వరి కెక్కుడుఁ జక్కటితోడి బవరంబున నబ్బలుమగల గెలువరాదని యిట్లురియాడు నాచిత్తంబు చింతా పరంపర వాయ నీపతి విశేష్టితంబు లోచనగోచరంబయ్యె

సౌప్తి 1-24

**8,** తొట్రుపడు, చలించు.

ఆ. అన్నరేంద్రు పాటి యల్లన తనకరాబ్జమునఁ గీలుకొల్పి బవుళ భావ్యకలిత వనముఁ దగుచు గళమున నెయఁ గుడి యూఁపఁగి చి యమ్మురాంతకుండు. శల్య 2-361

**4.** డోలాయమానమగు, సందేహించు, ఎనుకముందాడు.

క. సతి దనపతి వచనంబులు, మతిఁదోఁపుల దె.ఫమాను మాన వెలఁచు నయ్యతిథి సమపు సేయక త్రోచు తలం పలపఁయుచుఁ బోయఁ జూచుం దలఁకన్.

తే. ఇట్టు లురియాడు చిత్తంబు నెట్టకేని, వాఁడుచెప్పిన ధర్మంబులునుఁ గొరంగ, నూలుకొల్పి నిర్ణయమునఁ గీలుకొన్న, లజ్జ ప్రేఁగుఁ బోలె ప్రాలంగ మోము.

అను. 1-71,72; విరా. 2-102; ఉద్యో. 8-193

నిన్ను నేమందుఁ బార్థ. ద్రోణ. 5-358

శ్లో. వపన్ ప్రణే క్షారమివ క్షతానాం శత్రుకర్శన।
విదీర్యతే మే హృదయం త్వయా వాక్శల్యపీడితమ్
సం. భా. ద్రోణ. 198-15

ఉరు దే. అ. క్రి. ఉఱు

1. మేలగు, శ్రేష్ఠమగు, అధికమగు.

ప. ఈ లోకము యురుఁ గొందఱ, కాలోకము కొంద ఱపు నిహంబును బరమున్, మేలగుఁ గొందఱ కధిపా,యే లోకము లేమ వినవె యిలఁ గొందఱకున్. భార. 4-174

(ఉరున్ - మేలనిపించును అని భావము)

2. తగు.

క. అన్నలుఁ దమ్ములు గలుగుట, యున్నతుఁజేయు నృపునకెం తయుఱ పిళ్లయినన్, మన్ననయు నీగియును సం,పన్నంబులు గాఁగ వారిఁ బాటించుటురున్. కాంచి. 3-306

క. రసకర్మజ్ఞు డుదారము, పసిండి సేతకుఁ బ్రయత్నపరుఁడై శుద్ధి,త్వ సమగ్రము సేయు క్రియ, న్విసువక పరిశుద్ధి జీవునికిఁ జేయుటు రున్. కాంచి. 5-417

ఉరులఁద్రోచు; ఉరులంద్రోచు దే. స. క్రి.

విఱిగిపడునట్లు పడవైచు.

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షంబు లురులం ద్రోచి యే కాయన పథంబున కడ్డంబు శయనించి. భార. 8-816

ఉరులంబడు; ఉరులఁబడు దే. అ. క్రి.

ఉచ్చులోఁ జిక్కుకొను, వలలో దగుల్కొను.

తే. దాయ లొడ్డిన మాయజూదంపుటురులఁ, బడి కులంబున కాతఁ డిప్పాటు దెచ్చె. విరా. 2-225

ఉరులంబఱతెంచు; ఉరులఁబఱతెంచు దే. అ. క్రి.

పైకి దుముకు, డీకొను.

వ. ధూమ్రాక్షుండు రోషతామ్రాక్షుం డగుచు నతి నిబిడ బలాహ
కానీక భీకరంబై కాఱుకొనుచున్న నిశాచర చక్రంబుతో నురులం
బఱతెంచినం జలించి బలీముఖ బలంబులు దుర్బలంబులై తొలం
గిన ఆర. 7-85

శ్లో. అభిదుద్రావ ధూమ్రాక్షో వేగేన మహాతా కపీన్
తస్య మేఘోపమం సైన్యమాగత ద్భీమనిస్వనమ్
దృష్ట్వైవ సహసా దీర్ణా రణే వానరపుంగవాః

సం. భా. ఆర 285, 5, 6

**ఉరులనేయు** దే. స. క్రి.

ఛేదించు, పడఁగొట్టు.

వ. మత్స్యయంత్రం బగ్గుమని ధరిత్రిమీఁదికి నురుల నేసె. ఆది. 3-15

**ఉరులు** దే. అ. క్రి.

చూ. ఉగలు.

**ఉరువు**[1] దే. స. క్రి.

మాను, విడుచు, త్యజించు.

ఆ. శరము నతఁడు గానంగఁ బోలు వే,దార్థ చింతనమున నమ్మి
ధునము,నందుఁ బూర్వ మురివి యపరంబు చేపట్టి, నిలువ వలయు
నధిక నిష్ఠ నలిగి. శాంతి. 6-144

గీ. ఊర్చి పొందువు వచ్చి పేవురివి నంటు,దంతయును బుచ్చి పాదు
లగా నమరఁగట్టి. శాంతి. 3-499

చ అన విని సంశయం బురివి యమ్ముని తో వరణీతనూజుఁ డిట్లను.
శాంతి. 6-821; ఆర. 8-162

**ఉరువు**[2] సం. విశే. (ఉ. ఉ. ర్వీ. ఉ.)

1 మిక్కిలియైనది, అధికము.

మ ...అతుర్వరుతేజుండు వరించుఁగాక యభిమన్యుం డి సరోజాననన్.
విరా. 5-368

**ఉర్వర** సం. వి. ఆ స్త్రీ.

భూమి.

క. దారిద్ర్యముచే, గుందుచు, నేరిని నడుగంగ బోవ కంతయుఁ గృశ
తం, గూరిన విప్రున కుర్వర, వారని దయ సిగి ఫలను వాగ్గో
చరమే. అను. 2-85 ; అశ్వ. 4-5

**ఉర్వశీకృత్తికాయోగసిద్ధకీర్తి**

కృత్తికా నక్షత్రముగల దినమున లేదా కృత్తికా నక్షత్రమతోఁజేరిన పూర్ణిమ (కార్తిక పూర్ణిమ) యందు ఉర్వశియను తీర్థమున స్నానము చేసిన ఏ ఫలితము వచ్చునో ఆ ఫలితము వచ్చునని పేర్వడసినది. లౌహిత్య మను పుణ్యజలాశయమున కిది విశేషణము. చూ. 1) ఊర్వశి 2వ యర్థము 2) ఊర్వశీ తీర్థము, ఉర్వశి, ఊర్వశి యనునవి రెండు నొకటే. ఈ లౌహిత్యమను తీర్థము గంగానది సమీపమునందుండునేమో యనిపించు చున్నది.

ఉర్వశి యని గంగకు పేరు.

శ్లో॥ తథా భాగీరథీ గంగా ఉర్వశీ చాభవత్పురా,
దుహితృత్వం గతా రాజ్ఞః పుత్రత్వ మనమత్ర నా
సం. భా. ద్రోణ. 60-6

కృత్తికా నక్షత్రమున గంగయందు స్నానము చేసిన ఏ ఫలితము గలుగునో అట్టి ఫలితము నిచ్చునదియని యైనను చెప్పుకొనవచ్చును.

సీ. ...ఉర్వశీ కృత్తికా యోగసిద్ధకీర్తి,యైన లౌహిత్యంబునందు
సుస్నాతుఁడై, పుండరీకాధ్వరమున ఫలంబుఁబొందు.

శ్లో. ఉర్వశీం కృత్తికా యోగే గత్వా చైవ సమాహితం,
లౌహిత్యే విధివత్స్నాత్వా పుండరీక ఫలంలభేత్.
సం. భా. అను 25-15

**ఉర్వి** సం. వి. ఈ. స్త్రీ.

భూమి, నేల.

వ. ...లిమముపర్వో నుర్విం దోడ్తోన్. విరా. 2-821

ఒకప్పుడు భూమి అరాజకత్వము వలనఁ గలిగిన దోషములచేఁ బుట్టిన దురితాధిక్యము పీడింపఁగాఁ బాతాళ లోకమునకుఁ బోయెను. అప్పుడు కాశ్యపుఁడు తన యూరువును గ్రుచ్చి దానితో భూమిఁ బైకెత్తెను. అధికారణ బుగా భూమి యుర్వియని ప్రసిద్ధికెక్కెను. శాంతి. 2-89, 90

ఉరుత్వాదుర్వీ- ఘనమైనది గాన ఉర్వీ: ఊర్ణూయతే పర్వతై రిత్యుర్వీ ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే పర్వములచేతఁ గప్పబడునదిగాన ఉర్వీ- అమ.

**ఉర్వీమృత్తిక** సం. వి. ఆ. స్త్రీ.

నేలమట్టి.

తే. శుక్రమగు నుర్వీమృత్తిక సురుచిరంపుఁ, బ్రతిమ గావించుకొని యందుఁ బరము నావహించి పూజావిశేష ము లెల్లఁ జేసి, నీవు దొలఁ దొలఁ గొలిచితి నిష్ఠతోడ. ద్రోణ. 5-416

**ఉర్వీజము** సం. వి. అ. పుం.

వృక్షము.

సమీపోర్వీజముల్ ప్రాఁకియుం విరా. 3-27

**ఉర్వీతలము** సం. వి. అ. పుం. న.

భూప్రదేశము.

వ. సర్వాంగసంగతోర్వీతలంబగు దండప్రణామం బాచరించి. విరా. 4-149

**ఉర్వీధరము** సం. వి. అ. పుం.

భూమిని ధరించునది, పర్వతము, కొండ.

సీ. ఉర్వీధరంబుల నొప్పెడి తావులఁ, జలముల కాంతికి మను మెఱుఁగు పెట్టి. ఉద్యో. 2-118

**ఉర్వీభృత్తు** సం. వి. త్. పుం.

1. కొండ.

శా. ...సర్వోర్వీభృద్ఘన గండశైలములతో నూహింపఁ దుర్లక్ష్యములై. అర. 5-276

2. రాజు.

**ఉర్వీరసము** సం. వి. అ. పుం.

జలము, నీరు.

వ (సూర్యుఁడు) ఉత్తరాయణగతుండై యుర్వీరసంబు పరిగ్రహించి దక్షిణాయనగతిం బర్జన్యరూపుండై యోషధులం బడసి. అర. 1-89

**ఉర్వీరుహము** సం. వి. అ. పుం.

భూమియందు మొలచునది, చెట్టు.

క. ఉర్వీరుహా నివహముతోఁ బర్వతములు వెఱికి. ఆది. 4.7

**ఉఱఁడు** ఉఱు ధాతువునకు వ్యతిరేకార్థక మహదర్థక ఏకవచన రూపము.

చూ. ఉఱు².

**ఉఱక** ఉఱు ధాతువునకు వ్యతిరేక క్త్వార్థకరూపము.

1. చూ. ఉఱు².

అవ్య.

2. అవలీలగ, సునాయాసముగ.

చ. ఉఱక యురంబు బాహువులు నొక్కొక యమ్మున నొవ్వనేసి నీ వెఱఁగి యెఱింగి నన్ దొడరి తెక్కుడఁ బోవఁగ వచ్చునంచు. [ద్రోణ. 2-90

తే. పద్మనాభుని నొప్పించి పార్థు నొకటి, గొలఁగగా నూఱుశరముల నుఱక నొంచె. శల్య. 2-881

3. నిర్భయముగా.

సీ. ...రారాజు ద్రోణతనయుండుఁ బుట్టిన తలచుట్లు నల్లని, యవి సూతపుత్రు శిరోంబరంబు, పచ్చనియది కుంభసంభవ కృపాచార్య యుష్ణీషములు వెల్లలుఱక నీవు, దెమ్మి తవట్టును. విరా. 5-210

4. పలుకక, మాటాడక.

క. వెఱచఱవ నింతకంటెం, దఱచుగ బాణంబులేసి తడయక పగఱం జెఱుతునని యిసుము చల్లుచు, నుఱక ధనంజయుఁడు రణజయో న్నతుఁ డరిగెన్. సభా. 2-306

5. వ్యర్థముగా, ప్రయోజనము లేకుండ, నిష్కారణముగా.

ఆ. నీవు సూచుచుండ నీ యిష్టుఁ డిమ్మణిమంతుఁ డిపుడు దనదు మదము పేర్మి, నన్ను నుఱక యుమిసె నా మీఁద నిట్టి యుద్ధముఁ గీల్గు నొక్క మనుజు చేత. అర. 4-31

**ఊఱదె** ఉఱు ధాతువునకు వ్యతిరేక అహామదర్థ కైకవచన రూపము.

తగదే - చూ. ఉఱు[1].

**ఊఱవు** విణ.

1. ఉచితము, యుక్తము.

ఆ. అంత తోడ సెల్ల యాపదలును దీఱు, వంశ మధిక గౌరవంబు
నొందుఁ, గూడి మనట గలుగుఁ గురు పాండవులకు ని, త్తెఱఁగు
సూడ మీకు న ఊఱవు కాదె. ఉద్యో. 3-380

2. తగవు, హితము

తే. శక్రుకైనైన నరవంగఁ జాలువాఁడ, నుఱవు సెప్పుదు రథికునే
నుఱఁగ నిను, గృష్ణసారథ్య ఘనుఁడగు క్రీడి గెలువఁ, దలఁచు
నీకేను గడవుట దగు రథంబు. కర్ణ. 1-314

3. అధికము

క. పొడువఁగ వ్రేయఁగ నతఁడుం, గడునుఱవగు నేర్పు కడిమి కలి
మిం దనపై, బడకుండఁ గృపాణమ్మునఁ, గడు చిత్రపుగతుల
నడిసెఁ గైదువు లెల్లన్ భీష్మ. 3-96

క. ఊఱఁగు నారూపంటలు గోతిఖుల పాడియును దఱచగుం బురు
ముంబుం, దెఱపల చుట్టము లయ్యెద, రెఱచియు భుజియింతు రర్థి
నెల్ల జనంబుల్. అర. 4-295

చ. ...నిన్ను ఊఱవుగ నేను వేఁడుకొన యుక్తుఁడఁగాక మొఱంగి
నన్ను నవక్రఊఱవడి నీవు వేఁడుటిది గర్జమె నర్థి దైత్య చెప్పుమా
అర. 7-366

**ఊటికిపోవు** దే. అ క్రి.

దుముకు, క్రిందికి దూఁకు.

ఆ. ఆయుధమ్ము తెరిగి [illegible] మగాదా, గండమెత్తికొని యుదగ్ర
వృత్తి, [illegible] దేవాలయము దరుణ [illegible] ట్లవని కఊటి
పోయి [illegible] వ్రేసె. విరా. 3-217

**ఊటిది** దే. విణ.

సాటి, సమానము.

సీ. చంద్రదత్త వ్యాఘ్రదత్తులు, వినుము సేనవిదుండను నృపాలుం
డు రథోత్తముండు మారుతపుత్రు నెనయశం, డొక్కరుండును
వారి యఱిదిలావు. ఉద్యో. 4-266

**ఉఱు**[1] దే. అ. క్రి.

1. తగు, ఒప్పు, ఉచితమగు.

చ. ...నీ,యఱు కడకేగి తోడుపడు మొల్లకు నెవ్వరినేని.
ఉద్యో. 4-179

క. కులమునకు నఖిల లోకంబులకు నపాయంబు సేయు పురుషాధము
ని,మ్ముల దూషించి జగంబును, గులమును రక్షించు టుఱదె
కువలయనాథా. ఆది. 5-111

క. నరవర సరసాన్నంబులుం, బరిమళ గంధ వస్త్రములును బరమశయన
వి,స్తరములుం గలాధినత, నగుం డొసంగం బాయు వాని నమ్మ
మియ్యంగ యఱున్. శాంతి. 1-214

క. శివలింగ స్థాపనముం బ్రతిష్ఠనములం బరమహితము పొందెడు
గరుణన్, ధవళాక్షిచేసితిం దత్ప్రవిమల లింగమున నన్ను భావించు
టుఱున్. అను. 5-272

ఉ. ...ఒక నక్కనిచ్చి సింహమున్నల విల్చికొ లఱుదే.
సభా. 2-151; అను. 1-18; అను. 1-24; అను. 5-364

2. ఇష్టమగు.

క. తెఱపిగొని నీవు పొచ్చినం, బిఱుగనె చొచ్చెదము రిపులు పెల్లగిం
నం,గలమును మాకిది యొనయు, నుఱుట్టెవగంబు దీని నానం
గుము పుత్రా. ద్రో. 2-7

3. సరిపోలు, పోల్చు.

క. బకళులు సూచిన యదివా,రికిం బెట్టగనములుటయునుఁ బ్రీతిం దనవం,
తికిం దెచ్చిన చుట్టలు వే ఱొత భంగిం గుఱువం గుక్కపు మఱు విప
థుక్తిన్. అను. 4-111

**ఉఱుకు** దే. అ. క్రి.

1. దుముకు.

క. ఎఱిఁగి పిఱుసనిన వెనఁబై, కుఱుకుదు సాళువము గాకినొడిసిన భంగిన్. విరా. 2-282

క. మఱియు నొకవిల్లు గొనున, త్తెఱపిన విరథు డగఁ జేయ ధృతిఁగర వాలం,బుఱకకొని విభుఁడు నేలకు,మఱికి యతనిమీఁదఁ దఱచె నుగ్రాకృతియై. భీష్మ 8-27

సీ. ధనము లుత్కృష్టంబులను ధనంజయ మాటపాటిఁగొనుము సోపానభంగి, నున్నది మార్గంబు యోగసమారోహణమునకు దానన నడచికాక, వడి నుర్కి నడ నీకు వచ్చునే ధనసంగ్రహంబు భోగార్థకృతంబు దుష్ట,మగుటయుఁగలదు యజ్ఞార్థ్యతంబైన నదియ నిచ్చెన బ్రహ్మపదమునంద. శాంతి. 1-144.

సీ. నాగనాగతోఁదాఁకి పగులంగ నరదంబుఁ, బఱపియాతేరిపై కుఱుకువారు. విరా. 8-189; విరా. 4-218

2. పరుగెత్తు.

తే. ద్యూతమున గెల్పునెపమున నుఱికి పుణ్య,కాంతఁ గలవట్టికొని సభాభ్యంతరమున, కీడ్చి వలువలొలుచుటయు నెఱిఁగి సుతులఁ, జంపెని భీముఁ జంపఁ దల పనగునె. స్త్రీ. 1-146

3. తప్పించుకొనిపోవు, బయటపడు.

ఆ. యోగబలము లేని యొక భంగి యోగి బల్, ద్రోవ్పులేని మీను నేపులేని, మృగమువలయు నురియుఁదెగపోవ పఱుంగ, లేని యట్లు భవములోన నడఁగు. శాంతి 5-578

4. పైపడు.

క. అరయుదవుగాని యిమ్మో,హరమునకును డాపవించి గురగ మఁ బోని. మన్మరవడి నవనిక యుఱికేవ, నరుమగ నెన్క గి నె రద్దబైనన్. విరా. 4-246

శ్లో తస్యమూర్ధి ప్ర పతిష్యామి తఃపతే పరాజితా।

సం. భా. విరా 68-18

**ఉఱుము** అ. క్రి.

గర్జించు.

క. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు, వఱలఁగ నలుగడలఁ బడ
నవారిత వృష్టుల్. ఆది. 8-270

క. మెఱుమ ధనుర్దండము, గుణ మఱుముఁగ విశిఖతతి దొగుఁగ
నొక్కటఁ దఱచై, పఱవ రుధిరంపుఁ గాలువ, లఱిమిఱి ఘన
భుజుఁడు ద్రోణుఁ డడరె నరేంద్రా. ద్రోణ. 1-294

వ. మహాంబుదంబు చందంబునఁ జనలం దోఁచి మెఱుముచు నుఱు
ముచు. ద్రోణ. 5-225

చ. ఉఱుముచు నెల్లెడం బిడుగు లుగ్రగతింబడ ఘోరమూర్తియై.
ద్రోణ. 1-89

వి.

1. మేఘధ్వని, గర్జనము.

క. మొగిలులు లేకయ నుఱుములు, గగనమ్మునఁ బుట్టె. భీష్మ. 1-9

2. పిడుగుపాటు రవము.

క. ఒకమఱి కిరీటి గద్దించి, రిపు నుఱుముచుఁ బోయిరేని రెండవ మాఱున,
యెక్కెక్కమున కేగ్గఁగ లక్షె, రొప్పిల్లు గురు రాజుపేర యోధుల
లోనస్. విరా. 5-55

**ఉలి** దే. విశే. (ఇది వ్యుత్పత్తియందే కనఁబడుచున్నది)

అల్పము, చిన్నది. చూ. ఉలిగాలు.

**ఉలికిపడు** దే. అ. క్రి. (√ఉలుకు)

(అకస్మాత్తుగాఁ గలిగిన భయాదులచే) కంపించు, అదరిపడు, త్రుళ్లిపడు.

వ. ఏను సహస్రసహాయుండను ముని ముఖ్యుండ నా సహాధ్యాయుండు
ఖగముఖుం డను మునిముఖ్యుం డగ్నిహోత్ర గృహంబున నున్న
నే నపహాసార్థంబు తృణమయ సర్పంబు నతనిపై వైచిన నతం డులికి
పడి నా కలిగి నీవు నిర్వీర్యంబైన యురగంబవగుమని శాపంబిచ్చిన.
(అదరిపడి అని వావిళ్ల వారి పాఠము.) ఆది. 1-156

**ఉలిగాలువ** దే. వి.

సన్నకాలువ, చిన్నకాలువ.

క. గురుఁడను జలనిధి గడచితి, నారులును నలవంగ నాకు నులిగాలువ లీ, నరపతుల సరకుగొనని నీ, వరదము సుననిమ్ము నేఁటి యని కలయకు మీ. ద్రోణ. 4-68

**ఉలియు** దే. అ. క్రి.

మ్రోయు, ధ్వనించు, అఱచు (పశు పక్ష్యాదులు) కూయు, ధ్వని సేయు.

చ. పిడుగుల పిండు బిట్టులియు చెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తిన్. విరా. 4-171

సీ. తమతమ నియమిత స్థానంబులం దోలి నుండిరి దోఁగన నులిసె ఖేచరులు. ఆది. 6-7

చ. అలుగుల మంది యందుల మృగావలియుల్ విహంగంబులున్ భయాకులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీఁకులున్నవ యట్టులై యులియక యున్నచో నడఁగియుండఁ. అర. 1-801

**ఉలివు** దే. వి.

1. శబ్దము, మ్రోఁత, కలకలము.

ఆ. వారు సంభ్రమించి వడిఁ గోలతవియఁ గాంచుచు నులివుమిగులఁ గూడఁ బాఱి, నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నాకలకల మెఱింగి కీచక ప్రజంబు. విరా. 3-4

వ. కృతవర్మ సాత్యకు లొక్కరథంబునను దుర్యోధనాది చతుష్టయం బొక్క రథంబునను బాగ్య్వంబుల రాఁ బౌరులకుఁ గన్నులపండు వగుచు రాజమందిర ద్వారంబు చేర నరుగు నప్పటి యులివునకుఁ గొలువు వారెల్ల నత్యుత్సుకులై యెదురుచూడ గధోత్తమంబు నవతరించి యరవిందనాభుండు. ఉద్యో. 3-247

వ. అట్టి యవసరంబున బోరన మ్రోయు జనుల యులివును వాద్యత నాదంబును వారించి. ఆది. 7-168; ద్రోణ. 5-173

2. ఉత్సాహము.

క. మొ మునఁ గయ్యపువేడుక, నిగరొత్త ముదాత్తమూర్తిఁ దెలు వొందు గురు, దగు రాజులు గొలువులును, బొగడి నులివు మిగుల

ప్రమదపూర్ణ హృదయులై. ద్రోణ. 1-55

3. చలనము.

ఉ. ఆ నినదంబు సాంద్రముగ నాకసమంతయు నిండఁ బర్వుడున్,
మానసముల్ గలంగి యభిమానము ధైర్యముఁ దూల విద్విష,
త్సేన నితాంత నిశ్చలతఁ జిత్రసమర్పిత మూర్తిగో యనం,గా
నులివేది యుండియును గ్రమ్మఱఁ దేఱిరవంబు మానఁగాన్.
ద్రోణ. 1-239

(ఉలివు + పడు = చలనము వదలు)

శ్లో. తేన ఘోషేణ సంత్రస్తా సంశప్తక వరూథినీ,
నిశ్చేష్టావస్థితా సంఖ్యే హ్యశ్మసారమయీ యథా.
సం. భా. ద్రోణ. 18-9

ఉలివేదు దే. అ. క్రి.

చలనము లేకుండు-
చూ. ఉలివు. ద్రోణ. 1-239

ఉలుకు; ఉల్కు దే. అ. క్రి.

1. భయపడు, బెదరు.

తే. ...కరంబున నుసరు మప్పళించి యమ్మరో రక్కసయంచు నుల్ల
ములుకువారలై పురజనంబులు దలఁకి. విరా. 3-86

చ. ధగద్ధగం,ను గరువంపుఁ బల్కుల విధంబునకున్ మదిలోన నుల్కు-
చున్. ఉద్యో. 1-290

క. అలయుచుఁ బులుగుల చెలుఁగుల, కులుకుచు నుగ్రాతపమున
కోపక వృక్షం,బుల నీడల నిలుచుచు నెలుఁగులఁ బులులం జూచి
భయమును గొని వగచుచున్. అర. 2-84

2. ఉడుకు, అసూయపడు.

క. జనులకు వోడఁజాటగు విధ,మున నడచుచు లోకనింద్యముల నుడు
గుచు మీఁదని తొయ్యని కలిమి కులుకక, మనుజులతోఁ బొందిఁ
బొసఁగి మనుటొప్పు నృపా. ఉద్యో. 3-31

వి.

భయము.

క. ఉలుకును వెక్కసపాటును, దలకొను నెమ్మనము తోడ ధాత్రీ రమణుం, డలఘుభుజ విపుల వక్షస్స్థల రేఖాకాంతిఁ బరవశత్వముఁ గొంటెన్. విరా. 1-218

తే. ఉలివు విని యుల్లమునఁ గడు నులుకుపుట్టి. అను. 4-818

**ఉలుము** దే. వి.

కుష్ఠరోగము.

ఆ. ఉలుము గొన్నవాఁడు దొలుమేన నాఘాత, బంధనముల నొరుల ప్రస్కందనము, సెఱచినాఁడు. అను. 5-100

**ఉలూకము** సం. వి. అ. పుం.

1. గుడ్లగూబ.

తే. అచటి బయలెల్లఁదానయై యక్కజంపుఁ, జంగిమును ఘోరమైన నిస్వనముఁ జండ,గతియు భూతవితాన భీకరముగా నులూక మొకటి వచ్చె భూలోకనాథ. సౌప్తి. 1-16; శాం. తి. 8-210

2. ఒక దేశము.

యుధిష్ఠిరుఁడు రాజసూయము చేయుటకు అర్జునుఁడు ఉత్తర దిగ్విజయంబు సేయనేగి జయించిన దేశము. దీనికా కాలమున రాజు బృహంతుఁడు.

వ. మఱియు నులూక దేశాధిపతియగు బృహంతునిఁ బరాజితుం జేసి. సభా 1-285

**ఉలూకుఁడు** సం. వి. అ. పుం.

1. శకుని కొడుకు.

ఇతనిఁ జంపుట నకుల సహదేవుల వంతుగ ధర్మరాజు నిశ్చయించెను. ఉద్యో. 2-230

ఈతఁడు కృష్ణుని మీఁదఁ బార్థునిమీఁద బాణములు ప్రయోగించెను. ద్రోణ. 5-188

ఈతఁడు పర్వత ప్రతిముఁడు. ఈతనితో యుయుత్సుఁడు పోరాడెను. కర్ణ. 1-141 మొ. 147 వఱకు

ఈతఁడు నకుల సహదేవుల నెదిరించి పోరాడెను. సహదేవుఁడు ఈతని తండ్రియగు శకుని సమక్షములోనే యితని శిరస్సు ఖండించెను.

శల్య 1-886

2. ఇతనిని దుర్యోధనుఁడు పాండవులం గని వాసుదేవ సన్నిధిని పాంచాల విరాట ప్రముఖులు వినఁబలుకుమని పరుసని మాటలు గఱపి పుచ్చిన నతఁడును వెళ్లి యటులనే యక్షరము టీఱువోకుండ మాటలాడెను. ఇతఁడు శకుని పుత్రుఁడా మఱొకఁడా నిర్ణయించుటకు సాధ్యము గాకున్నను అర్జునుఁ డితనిని "కితవసుతా" (ఉద్యో. 4-206) అని సంబోధించుట చేతను సం భా. ఉద్యో. 159-6 లో "ఉలూక గచ్ఛ కైతవ్య" యని యుండుట చేతను, ఇతఁడు కితవపుత్రుఁడని తేలుచున్నది. 'కితవుఁడు' అను పేరుగల వ్యక్తి భారతమున గానరాఁడు. కితవుఁడు అన వంచకుఁడు, మోసగాఁడు జూదరి యను నర్థములు గలవు. ఈ లక్షణములన్నియు శకునియందుఁ గలవు గాన ఇతనిని 'కితవసుతా' యని అర్జునుఁడు వ్యాఖ్యానించి యుండవచ్చును. దానింబట్టి ఈ రాయబారిగాఁ బోయినవాఁడు శకుని కొడుకే. శకుని కొడుకు గాకున్న నింత ధైర్యముగాఁ గృష్ణ పాండవ సమక్షంబున మాటలాడువాఁ డొకఁ డుండఁడు.

ఉద్యో. 4-187 మొ. 210 వ.

**ఉలూచి** పం. వి. ఈ. (స్త్రీ).

ఉలూపి - అర్జునుని భార్య - నాగకన్యక ఇరావంతుని తల్లి. ఈ యులూచి కథ మహాభారతమునందు ఆదిపర్వమునం దొక చోటను అశ్వమేధ పర్వమునం దొకచోటను గన్పించుచున్నది. రెండు చోటుల, చెప్పఁబడిన వారొక్కరే యయినను ఆంధ్ర భారతమున ఆదిపర్వ కథయందు ఉలూచి యనియు అశ్వమేధ పర్వత కథయందు ఉలూపి యనియుఁ గలదు... ఆదిపర్వ కథయందు ఉలూపి శబ్దము లేదు. అశ్వమేధ పర్వ కథయందు ఉలూచి శబ్దము లేదు. సంస్కృత భారతమునందు రెండు తావుల ఉలూపి శబ్దమే యున్నది.

ఈమె యైరావత కులసంభవుండైన కౌరవ్యుని కూఁతురు. తీర్థ యాత్రలకై వచ్చిన అర్జునుని నాగలోకమునకుఁ దీసికొనిపోయి వివాహము

చేసికొనెను. సద్యోగర్భమున ఇరావంతుఁడను కుమారుఁడు జన్మించెను. చూ. చరిత్ర. ఆది. 8-124 మొ. 184 వఱకు.

బభ్రువాహనుని ప్రేరేపించి అర్జునునితో యుద్ధము చేయించెను. కుమారునిచే హతుఁడైన నర్జునుని సంజీవని మణిచే బ్రదికించెను. అశ్వమేధ కాలమున హస్తిపురము చేరెను.

చూ. అశ్వ. 4-58 మొ. 95 వఱకు.

పాండవుల మహాప్రస్థాన సమయమున ఈమె జనకుని కడకు భుజంగ లోకమునకుఁ బోయెను. మహా. 1-28

**ఉలూపి** సం. వి. ఈ. స్త్రీ.

చూ. ఉలూచి.

**ఉల్క** సం. వి. అ. స్త్రీ.

1. ఆకాశము నుండి రేఖాకారముగాఁ బడు తేజఃపుంజము - (ఇది అగ్న్యుత్పాదములలో నొకటి)

తే. అడరి కురువేనపై గ్రద్ద లాడఁబొచ్చెఁ, బడుచునున్నవి యుల్క లిక్కడ. భీష్మ. 8-864

2. మంటలేని నిప్పు కణిక. (ఉల్కాస్యాన్నిర్గత జ్వాలా - అమరము)

వ. ఆ సంయమి చతురునిచే సర్వాయతన సన్నిరుద్ధంబై యాత్మ మూర్ధంబు ఛేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంత దవ్వరిగి యంత నంతర్హితంబయ్యె. అను. 5-468

**ఉల్కము** ఉల్క

(ఉల్కా శబ్దము 'అ' కారాంతముగాఁ గానరాదు. ఆనందవారి ప్రతిలో 'ఉల్కము' పాఠముగను 'ఉల్కికలు' పాఠాంతరముగను ఈయఁబడినది. మిగిలిన ప్రతులలో 'ఉల్కికలు' పాఠము. ఉల్కము పాఠాంతరము. చూ. ఉల్కిక.

**ఉల్కిక** సం. వి. అ. స్త్రీ.

ఉల్క.

ఆ. రత్నకేతనములు రాజిత శేఖరంబులును రుచిరమండికలును బార్థు, బాణనిహతిఁ దునిసిపడుఁ గౌరవుల చేటు దెలుప దుల్లు నుల్కికలును బోలె. విరా. 5-50. చూ. ఉల్క. ఉల్కము.

**ఉల్కాపాతము** సం. వి. అ. పుం,

ఆకాశము నుండి రేఖాకారమగు కాంతిపుంజము పడుట

వ. ఆ సమయంబున మనదెస నుల్కాపాత శర్కరా వర్షాదులగు నుత్పాతంబులు గలిగె. శల్య. 1-337

**ఉల్కు** దే. అ. క్రి.

చూ. ఉలుకు.

**ఉల్ల** దే. సర్వ.

నాతిదూరము నాతిసమీపము గాని దానిని తెల్పును. ('ఈ' యని యర్థము )

తే. వా సఖుండు విరూపాక్ష నామధేయుఁ, డతని పురము మధువ్రజ మడయు మూఁడు, యోజనము లిచ్చటికి దాని కల్ల తెరువు, వట్టి వే చని యాద్రై శ్య భర్త గమను. శాంతి. 3-486

శ్లో గచ్ఛ సౌమ్య పథానేన కృతకృత్యో భవిష్యసి.

సం భా. శాంతి. 170-14

తే. ఉల్ల కాంచన రథముపై నున్నవాఁడు, ఘనుఁడు హేమం కరుండు త్రిగర్తపతిఁడు, మఱియు నినుఁ జూచుచున్నాఁడు మగువ వాఁడె, దీప్తభుజుఁడు కళింగధాత్రీపరుండు అర. 6-158

శ్లో. అసౌ తు యస్త్వామ్ కాంచనాంగే రథే హుతో౽గ్నిశ్చయనే యథైవ, త్రిగర్తరాజః కమలాయతాక్షః క్షేమంకరో నామ సపమ వీరః సం భా. అర 264-7 (వావిళ్ల)

తే. ఉల్ల పద్మాకరము పొంత నుండి నిన్ను, మెచ్చి కనుఁగొనుచున్న యన్నీలిశాఖుఁ, డశ్లాఘ యిక్ష్వాకు వంశోద్భవుండు, సుబల భూపతి పుత్రుండు సుభగుఁ డతఁడు. అర. 6-151

శ్లో. అసౌ తు యః పుష్కరిణీ సమీపే. సం భా. అర. 264-8.

('ఒవర' అను పాఠాంతరము యుక్తముగాఁ గన్పింపదు) (వావిళ్ల)

వ. అయ్యుర్వరగపల్లకు వచ్చునంతకు నుల్లవనంబున నిలిచెన.

శాంతి. 6-583

**ఉల్లంఘించు** సం. స. క్రి.

నిరసించు. త్రోసిపుచ్చు, మీఱు, జవదాటు.

వ. నీవిట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రులందఱుం గూడం బాటి తమలో నిశ్చయించిన తెఱంగు నీశాసనం బుల్లంఘించంగల వారు పాండుసంభవులకు నేమిగాను నీకుండువారు ... అనుటం జేసి. ఉద్యో. 3-285.

వ. నీకు విజయంబుగోరి హితంబుపదేశించు నీ గోవిందు వాక్యం బుల్లంఘింపక. ద్రోణ. 5-311

వ. ఇంత ప్రమాదంబు నీవు గలిమిం దెలిసితి మేంరయ్యే మాతులాని యాజ్ఞ యుల్లంఘింప కర్ణ. 2-214

**ఉల్లతెరువు** దే. వి.

ఈదారి. చూ. ఉల్ల.

**ఉల్లము** దే. వి.

1. హృదయము.

వ. అద్దివ్య వచనామృతంబు నా యుల్లంబున వెల్లిగొనినం బునఃపునః ప్రణామంబు లాచరించి. హరా. 1-19

2. ఇచ్ఛ. అభిలాష,

ఉ. చిత్తము మెచ్చి నావలనం జిక్కంగ వెండియు నాలుగాంగి యచ్చొత్తినయట్లు నాకుం దన యుల్లము దెల్లము సేయుచున్కిదా, నత్తఱిం గ్రొత్తకాన్పగుట నడ్డము వచ్చిన సిగ్గుపెంపు నమ్మత్తల మందఁజేయుటకునో తలపోసి యెఱుంగనయ్యెడున్. విరా. 2-4

**ఉల్లల** దే. వి.

ఉడుకుట (పరితపించుట) యందలి ధ్వని కనుకరణము

సీ. విప్రులు పట్టరా వెఱనొచ్చి యొదిగెడు, గవయంబు దాకునం గర్ణ భీతి, నుల్లనుడుకుచు నుండుదు. కర్ణ. 8-83

క. ధనము గలవాఁడు మృత్యు వ,దనమున నున్నట్లు భయము దన చిత్తమునం, దనుకఁగ నుల్లల నుడుకును, విను శిఖ చోరాది ముఖ్య విషయాపదకున్. శాంతి. 4-38

**ఉల్లలనుడుకు** దే. అ. క్రి.

మిక్కిలి పరితపించు (పరితాపముచే) తుకతుక మఱఁగిపోవు

చూ. ఉల్లల.

**ఉల్లలత్** సం. శత్ర.

చలించుచున్న, ఎగురుచున్న (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)

క. లలితాచ్ఛస్ఫటిక శిలాకలితములపైఁ జాఱు విమలశరనిర్ఝరిణీ జలపూరములను తారోల్లల దుడుహారాలి సజ్జ్యంబగుదానిన్. ఆర 8-283; ఆర. 4-188

**ఉల్లవనము**

ఈ ఉపవనము.

వ. అయ్యుర్వరగ వల్లభు వచ్చునంతకు నుల్లవనంబున నిలిచెగ. శాం. 6-568

శ్లో. అనేన సత్యయేన నావాం సాధ్వి సంప్రాప్తవానిహ, ప్రతీక్షన్నాగమం దేవి వత్సామ్యస్మిన్ మహావనే. సం. భా. శాంతి. 357-10

**ఉల్లసత్** సం. శత్ర. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)

ఉల్లసించుచున్న, ప్రకాశించుచున్న.

శా. ...సాంద్రకుసుమ శ్రేణీ విలాసోల్లసద్రక్తాశోక తరువ్రజంబుల క్రియన్ రంజిల్లి యొప్పెంగడన్. విరా. 5-38; విరా. 5-279

**ఉల్లసనము** సం. వి. అ. న.

1. ప్రకాశము, వెలుఁగు.

ఉ. అప్పుడు శంఖుఁ దెంతయుఁ బ్రియంబునఁ బెండ్లికిఁ బోవునట్లు మో, మొప్పఁగ నస్త్రశస్త్రముల యుల్లసనంబున శత్రునేత్రముల్, గప్పఁగ. విరా. 8—176

2. వికాసము, స్ఫుటత.

మహాస్రగ్ధర :- వసురుద్రాదిత్య గంధర్వ గరుడ భుజగ ప్రాతముల్ వైభవం బుల్లసనం బొంపొంగ సిద్ధులన్యముల ముదము లుప్పతిల్లంగ సాధ్యుల్, హసిత స్వాంతంబులం బెల్లలమిగొనఁగ నకార్యదరోత్కృష్టముల్. స్వర్గా. 1-84

3. విహారము, విహరణము.

క. అఱచినఁ బఱచిన ప్రేళులు, గఱచిన నతఁ డించుకయును గరుణిం
పక యం,దఱ నుఱుముసేసె గుఁపుల,కుఱికి యుఱికి ఖడ్గదారు
ణోల్లసనములన్. శా ప్తి. 3-7; మాస. 57

4 సంతోషము.

చ. ... సముదిరితోల్లసన కందళిత ప్రహసద్దయాలతా, సుమహ
దుపాశ్రయ ప్రమదశోభిత విశ్వజగన్మధుప్రతా. ఉద్యో. 4-426

**ఉల్లసమాట** వి. (√ఉల్లసమాడు)

ఉల్లసమాడుట, పరిహాసము చేయుట.

క. అని తను నుల్లసమాటకుఁ, గినిసి యునతనూజుఁ డేమ క్రీడి నిచట
మా,ర్కొను వీఁకఁ గన్నులారం, గనుఁగొనుమీ నిలిచి యనుచుఁ
గవిసెం జెలుచన్. విరా. 5-182

**ఉల్లసమాడు** సం. అ. క్రి.

1. ఎత్తిపొడుచు, పరిహసించు, మర్మము దూఱనాడు.

సీ. ఈ యొద్దు భేదింప నే మెవ్వరము నేర, మర్జునుండుఁచు నీవు నచ్యు
తుండుఁ, బ్రద్యుమ్నుఁడును దక్కఁ బార్థుండు మనల ను,ల్లస
మాడకుండ నీలావు మెఱసి, భేదించి మాకెల్లఁ బ్రియమొనర్పు
కుమార. ద్రోణ. 2-5

2. అపహసించు, గేలిసేయు.

సీ. తమ్మిఱేకుల నుల్లసమ్మాడు తన మృదు,కర యుగ్మమునను శంక
రుని నేత్ర -ఆ- యుగ్మమల్లమూసి. అను. 4-419; కల్య. 2-215

**ఉల్లసము** దే. వి.

ఎత్తిపొడుపు, పరిహాసము, ఎత్తిపొడుపు మాట. సోల్లుంఠన వాక్యము.

క. పరదోషము సెప్పఁగ నే,ర్తురుగా కాత్మీయమైన దోషంబు మదిం,
బరికింపఁగ నధములు నే,ర్తురె తలఁపక యంటి పలుకతో నుండ
కుమీ. కర్ణ. 2-112, '18

వ. అని యుల్లసంబాడి మఱియును.

ఉ. గాడిద రూపుదాల్చి యుముకల్ దినుచుండఁగఁ జూచి యుల్లసం,

బాడెదు శక్రశాంతి సమయం బగుటన్ విను మింకఁ గొన్ని నీ,
వాడిన నాదు చిత్తమున నల్క యొకింతయుఁ బుట్టద.
కల్య. 2-215

**ఉల్లనములాడు** దే. అ. క్రి.

ఉల్లసమాడు.

తే. బాసలై వీరరథికులు బలసి యెలమి, నొండొరుల గరువంబుగ
నుల్లసంబు, లాడుచును జేరి వడతేర నత్యుదార,గతి శిఖండియు
నడచిరి కౌరవేంద్ర. భీష్మ, 1-112

**ఉల్లసితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశించినది.

ఆ. ఆర్చి పెలుచ నట్టహాసంబు సేసిన, నలిగి యతఁడు ఖల్లములఁ
దదీయ, భూరికంకటంబు పొలుపఱ నఱకి యు,ల్లసిత మకుట కుండ
లములు డుల్చె. కర్ణ. 3-388

2. గర్వించినది.

వ. సౌభద్రుండు రౌద్రరసోల్లసితమూర్తియై. ద్రోణ. 2-18

3 ఉద్రిక్తమైనది. రేకెత్తినది.

క రాగ పరిలిప్తమానస,యోగఁబున నింద్రియంబు లుల్లసితములై,
భోగులగుట యుడిపిన నప,రాగత సంసార దుర్విరామము సేయున్
శాంతి. 4-296

మ. మదిఁ గారుణ్యము సేసి విప్రవరుఁ డీ మంత్రంబు నాకిచ్చె నే,నిదియే
చందమొ చూతునంచు సొకనాఁ డిచ్చన్ బుతుస్నాతయై, సుదతీ
రత్నము పూర్వ(?)లైలనటిమై శోభిల్లు తిగ్మాంశుఁ జూచి దళత్సం
కజ భంగి నుల్లసితమై చిత్తంబు రాగిల్లఁగన్. అర. 7-324

4. ప్రసిద్ధము, ప్రఖ్యాతము.

క. విమతమగు లోకరేచన,మున నన్ను విరించుఁడంద్రు బుధమత
రవియం, దనుపాధిక విద్యాస్థితి, మునికిం గపిలాభిదాన ముల్లసిత
మగున్. శాంతి. 6-488

**ఉల్లసితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశించినవాఁడు, గర్వించినవాఁడు.

ఉ. తెల్లని జోడు వెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్య భూవల్లభు నగ్రనందనుఁడు వైరిమదాపహ విక్రమ ప్రకారోల్లసితుండు వన్యబల ముద్ధతిఁగొల్చు మృగేంద్రరేఖ శోభిల్లు చనుండ శంఖుఁడు విభావణ శంఖనినాద మొప్పఁగన్. విరా. 3-148

4. సంతోషించినవాఁడు.

ఉ. గాండివము క్త బాణమునఁ గర్ణుఁడు గూలుటయుం దలంకి శల్యుం డరదంబు దోలుటయు నొక్క మొగిన్ భవదీయసేన లోంగొండ కలంగి పాఱుటయు నుల్లసితుండయి చూచి వాయు పుత్రుండు మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చెనన్. కర్ణ. 3-374

3. ఉత్సహించినవాఁడు. శల్య 2-262

**ఉల్లసిలు; ఉల్లసిల్లు** సం. అ. క్రి.

1. సంతోషించు.

ఉ అంబుజముల్ సముద్యదరుణాంశునిఁ గన్న విధంబున్ విశా, లంబున నుల్లసిల్లి జనచారు విలోచనముల్ నిజోజ్జ్వలాంగంబున కర్థిమై నభిముఖంబులుగాఁ జనుదెంచి దైవయోగంబున భూ విభుండు దురగంబులఁ దేరఁగఁ బంచి చూడఁగన్. విరా. 1-256

తే. ...ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు, వదయ నొడఁబడఁ డయ్యింద్ర పదవియైన, నుచితగతి నెందవడసిన నుల్లసిల్లు. ఉద్యో. 1-11

2. ఒప్పు, ప్రకాశించు.

ఆ. తనదు బాలబింబమును వమేయప్రభాపటలం బదిం గగన భాగ మగుచు, నుల్లసిల్లి జగముతెల్లను విలసిల్లఁ, బూర్వశిఖరి మీఁదఁ బొడిచె నినుఁడు. ఉద్యో. 2-114

తే. ఇట్లయిదును నుల్లసిలుట, ననఘ భూతంబు పంచభూతాత్మకంబు. శాంతి. 4-83

చ ...మనోజ్ఞ సితచ్ఛవి నుల్లసిల్లు నుంగరతురగోత్తమంబు దవు దవ్వులఁ గాంచిరి చారులోచనల్. అను. 1-188

3. స్ఫుటమగు, వ్యక్తమగు.

చ. అదియును గాక కోలపులినైనను గారెనుపోతునైన నున్మదకరి నైన నుగ్రమృగనాథుని నైనను గిట్టిముట్టి పెట్టిదముగఁ గాలఁ గేలను గడిఁదిమగంటివి యుల్లసిల్లఁ బుట్టుదు నడఁగంగ. విరా. 1-88

4. విజృంభించు, చెలరేఁగు.

తే. అడఁగిఁ బొదువుచు నలుక యంతంత కగ్గలించి యాయముల్ నొంచి దోర్లీల నెఱపి, యుల్లసిల్లిన ప్రుక్కకొండొరుల రౌద్ర, వృత్తి నొంచు చోఁదొరుఁను వెక్కసముగ. విరా. 2-347

5. దిక్కులఁ గాన బాణంబులు, పిక్కటిలఁగ నుల్లసిల్లి భీష్ముఁడు నరు తే, రక్కడ డించి ద్రుపదవిభుఁ, దుక్కఱఁ తత్సేన మీఁద నురవడి గవిసెన్. భీష్మ. 1-292

6. కలుగు, పుట్టు.

చ. మనుజవరేణ్య నావలని మన్ననఁ బుట్టదొకాదె శత్రు మర్దన మొన రించి మత్స్యనగరంబున కుత్సవ ముల్లసిల్ల నీ, చనుటయ నాకుఁ దేటమును బెంపయు నీ గరిమంబుగాక. విరా. 3-225

సీ. ఉద్భట క్రోధ సముద్రేకములఁ జూడ్కు,లం దుల్లసిల్లెడు నరుణ రుచులు. శల్య. 2-255

7. ఉండు, నిలుచు.

వ. మునివారును వెడలి భీష్ముం దగ్రభాగంబున నుల్లసిల్ల నీ కుమారు లమ్మహాత్ముఁ బరివేష్టింప. భీష్మ. [illegible]—315

8. [illegible]

ఆ. ఆదిదేవుఁడగు మహాదేవు మీఁద నెవ్వాని మనసు భక్తివైభవమున, నుల్లసిల్లు వాని నెల్లకార్యముల దగ్గఱవు నూవె గ్రహవికార కృతులు అర. 5-267

9. పెంపొందు, వర్ధిల్లు.

వ. అట్టియెడఁ దక్షుకు నపత్యంబై తపోదయుఁడగు నైరావతుండు పెనిచి యుపలాలింప నుల్లసిల్లిన యశ్వసేనాభిధానుం డగు నాగ

కుమారుండు సర్పముఖ శరాకారంబు గైకొని తనయొద్దనుండ.
కర్ణ. 3-816

తే. ఒక్కఁ డుజ్జ్వల తేజోమయుండు దోఁచి, జరయు మరణంబు లేక
యసురల సురల నోర్వఁజాలిన బలముతో నుల్లసిల్లు మని వరం
బిచ్చె నిచ్చిన నధికశక్తి. అను. 1-851

**ఉల్లాసనము** సం. విణ. (అ. ఆ. అ.)
ఉల్లసింపఁజేయునది.

వ. మిత్రోల్లాసనంబును బ్రిగుణమణిజాంబూనదమయంబును జన
ప్రస్తుతి పాత్రంబును హస్తికక్ష్యాత్మకంబును నగు నతని కేత
నంబు గనకపుంఖ ప్రభా భాసితంబైన భల్లంబునఁ బడనేసిన.
కర్ణ. 3-357

(మిత్రోల్లాసనము = మిత్రులకు సంతోషము గలిగించునది)

క. శ్రీ సంక్రామణ నిపుణ, విలాసకటాక్ష విస్ఫూర్తిలంపట చిత్తో,
ల్లాసన రక్షా వేద, వ్యాసవచో విభవలక్ష్య హరిహరనాథా.
శాంతి. 1-1

**ఉల్లాసము** సం. వి. అ. పుం.

1. ప్రకాశము.

క. హ్రీంకార మయమనోజ్ఞా, లంకా రోల్లాస నిత్యలాలిత్యకరున్.
విరా. 1-82

2. ఆహ్లాదము, సంతోషము.

క. కైవేసి తుదన విశారో, ల్లాసంబున మేనువొంగ లముగతి మత్కం,
ఠాసవపాన విధాన, వ్యాసంగ తరంగితాంతరంగుం డగుచున్.
విరా. 2-329

వ. చూచి తన్నప్పుడు గ్రమ్మఱ జన్మించిన వానిఁగాఁ దలంచి యాప
దలకుం బాసి సంపదలకు భాజనంబైతినని యాజడిల్లి యుల్లా
సంబున మరలె నిట్లు కర్ణ సాగరంబు గడవనీదిఁ పాండునందనులు
పరమానందంబు నొందిరి. కర్ణ. 3-896

3. వికాసము, స్ఫుటత.

వ. అనన విని సంక్రోధహాసోల్లాస వికృతాననుండై మత్స్య మహీవా

ఘుండు. విరా. 5-258

4. ఉత్సాహము.

క. తమ తమ యొద్ది బలంబులు, క్రమ విరళములైన దొరలు గాండివిపై నుగ్రముగఁ దఱుముటయు నాతఁడు, సమరోల్లాసమున దివ్యశరతత్పరుఁడై, విరా. 5-65

5. విజృంభణము.

ఉ. ... వాని విశర ప్రతతిం దొరఁగించి ద్రోణునుల్లాసము మాన్చి కౌరవ బలంబులు నెత్తురు వెల్లిఁ దేలఁగాఁ, జేసినఁ గర్ణ కర్ణమముఁ జేకొనవే యనుచున్ భయంబునన్. ద్రోణ. 1-382

వ. అనని వధంబునకై పాంచాల పతిని వేలిమిం బుట్టినవాఁడగుట నప్పార్షతుండు దత్సమయ జనితోత్సాహ రోష విశేషాయత్త చిత్తుండగుచు నమ్మహీసురవరు మీఁదం గవిసి యేసిన నతని నొల్లని యుల్లంబునం బరుని యుల్లాసంబు సహింపలేని తేజంబునం బురికొని యతండు వేగం దొడంగిన దివ్యాస్త్రంబులు ప్రవిభాసింపక యుండ. ద్రోణ 5-321

6. లాఘవము

శా. వ్యాఘాతోద్భవము సూచి నన్నపదుగా నూహించెదో భీమ మద్బాహాచండిమ సాగరమ్ముద్దమగదా దండంబు ద్రుప్యద్భవద్దేహోల్లాసము నెట్టు డీకొనుం దే నీవు నీ చూడుమీ, యాహా పుట్టెను లాఁతి చూపులకు పోపోపుట్టు మీ వారికిన్. శల్య. 2-248

7. విస్ఫురణము.

శా. నిద్రాసక్తునిఁ గొంత మేల్కొనిన వానిన్ సుప్రబుద్ధాత్ముఁడై యుద్రేకంబున శౌర్యసాధనము బాహాల్లాసముం జూపఁ జం, చద్రేఖం దరమైనవానిఁ గను నుత్సాహోగ్రతం దాఁకి యున్నిద్రస్వైర సముద్ధతిన్ దొలయు వానిం దున్మె వేడ్కన్.
సౌప్తి. 1-178

8. వైభవము.

వ. భవదీయపద తొప్పునకును రాజసూయంబు చెల్లిన యుల్లాసంబు

నకు నట్లసహ్యాపడి శాంతి. 3-129.

9. చేష్ట, వ్యాపారము, కర్మము.

క. జాతుఁడు మృతుఁడగుట ధ్రువము, ఘాతోల్లాసము లనిత్యములు విను సద్యః, పాతియగు శరీరంబున, కై తొలఁగుచె ధర్మపథము నార్యుం డడునఘా. శాంతి. 5-519.

10. ఉద్రేకము.

క. నదిరయము వారణేంద్రుఁడు, గుదియించినయట్లపోలెఁ గురువర దైన్యా, స్పదమగు విషయోల్లాసముఁ గుదియించును యోగసిద్ధి గురుహృద్భలుఁడున్. శాంతి. 5-582.

**ఉల్లాసి** సం. విణ. (న్. సీ. న్.)

ఉల్లాసము గలవాఁడు.

మ. నరసింహుం డసురేంద్రుద్రవచ్చు కరణి న్రౌపం బుగ్రంబుగా, సుర మత్యుగ్రగతిఁ జీరి క్రమ్మఱ నధిక మ్ముల్లాసియై దోయిట, స్వైర హారం గొని త్రావు మెచ్చఁ జవిక నన్నెనున్ మొగంబున్ భయంకరరేఖం బొరయంగ జల్లికొను క్ష్మారవ్వుఁ జూచుం బొరిన్.

కర్ణ. 8-214; విరా. 1-7; విరా. 5-168; అను. 1-178

**ఉల్లాసితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉల్లసింపఁ జేయఁబడినది.

క. శ్రీసాంగిత్య విధాయి వికాసోల్లాసిత కటాక్ష కరుణామయ మూర్తి. శ్రీ. 1-1

**ఉల్లి** దే. వి.

ఉల్లిగడ్డ, ఉల్లిపాయ ఇది 1) నీరుల్లి (పలాండువు) 2) వెల్లుల్లి (లశునము) అని రెండు విధములు.

ఆ. మునగయుల్లి యడవిమునగి దుర్మాంసము, లానుగ్ముమ్మ పిలిచనమైన యుప్పుకటియ జీలకఱ్ఱ కరివేము గురుఁజయుంగువ ప్రవర్తనీయకోటి యగుట. అను. 8-189

**ఉల్లికుట్టు** దే. వి. (√ ఉల్లి)

ఎత్తిపొడువు, నొల్లుంతనము.

చ. వినుమరిఁ జంపనుం జెఱుప వేచుట లెస్స ప్రతాప భాషణంబున వెడ నుల్లికుట్టులను బొంకుల వానిఁ గలంగఁ జేసి రేఁచిరఁ దన పూఁపు, దప్పు నెఱ సేయని చందము నమ్మియున్న చాపుప్పును మెఱ యంగఁ బల్కుచుఁ గడున్ మది నమ్మక యుండఁగాఁదగున్.
శాంతి. 3-20

**ఉల్లికుట్టు మాటలు** దే. వి. (√ఉల్లి)
ఎత్తి పొడుపు మాటలు, సోల్లుంఠ వచనములు.

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లికుట్టుమాటలఁ దచ్చిత్తము లుడికించుచుఁ బాండవ, సమితిం గడఁగించు వార చట నెవ్వరొకో — (ఉల్లకుట్టు - ఉల్లము + కుట్టు - అని-శ ర.)
ఉద్యో. 2-242

**ఉల్లిఖితము** సం. విశ. (అ. ఆ. అ.)
రాచుకొనఁబడినది, రాపిడి చేయఁబడినది.

స్రగ్ధర :— లీలం గల్లోల భాగోల్లిఖిత గగనమై. అర. 7-16

**ఉల్లేఖి** సం. విశ. (న్. నీ. న్.)
రాపిడి దేయునట్టిది, తాఁకునట్టిది.

వ. కైలాసశైల విలాసాపహాస భాసుర గగనతలోల్లేఖి శిఖరరమ్య వాతాయనతలంబులను.
ఆది. 7-166

**ఉవిద** వై. వి. (సం. యువతి)

1 స్త్రీ, ఆఁడుది.

వ. ఆ నన్నారాయణుండును మంత్రోక్తి తాపితాంతఃకరణుండగుచు నుచిత వచనంబుల యుక్తిపేశలంబుల నెట్టకేలకు నూరార్చి ద్రోణ. 2-839

2. భార్య.

ఉ. ... యుచితస్థితి, ధర్మమున గృహస్థ ధర్మమ్ము నడుపు, చుండు [illegible] నయ్యువిదతోడ. అను. 1-107

**ఉవ్విళులూరు; ఉవ్విళ్లూరు** దే. అ. క్రి.

1. [illegible], ఆమోదించు, [illegible].

ఉ. పీనుల దియ్యమెక్క మును విన్కిఁ బరస్పర రాగవృత్తి లో,
నూనినఁ జూచు వేడుకల నుప్పెళులూరెడు నెమ్మనంబులు.
విరా. 8-398

చ. పిలిచిన రాజులున్ మునులు ప్రీతి యెలర్ప బరోక్ష్కరంబు
శి,ష్యులుఁ దమతోడరా మనము లుప్పిళు లూరగ యజ్ఞ వర్త
నం,బులు గనుగొంటకై సకల భూవలయంబునఁ గల్గునట్టి
వా,రలు సను దెంచిన. అశ్వ. 4-185

మ. అనినంగేకయ రాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లనున్, విను
నీ రూపము నూచి మా నృపతి యుప్పెళ్లూరు. విరా. 1-321

ఉ. ... ఇక్కడకుఁ దార్చి నేర్పునన్, శయ్యకుఁ దెచ్చెదం గుసుమ
సాయకు పూనికి నేఁడ తీర్చెదన్.

క. అని యుప్పెళ్లూరుచు వెసఁ జని. విరా. 2-245; 246

**ఉప్పెత్తుగొను** దే. స. క్రి. (ఉప్పు + ఎత్తు + కొను)
నిక్షేపముగా చంపు, నశింపఁజేయు.

ఆ. కవల వారుఁ గొడుకు గమియుఁ బాంచాల వర్గంబు వృష్ణి
వరులుఁ గడఁగి రేని, యొక్క మాత్రలోన నుప్పెత్తు గొనరె
దు,ర్యోధనాది శతము నుద్ధవిడిన. ఉద్యో. 1-29

క. అటువది కోటులు గపివరు, లటఁకి జగత్రయము నొకట నుప్పెత్తు
గొనం, దఱిగొన్నయట్లు నడవఁగి, నెఱసి కుముదుఁ డగుడు దెంచె
నృపవరుఁ గనియెన్. అర. 7-86

**ఉశీనరుఁడు** సం. వి. అ. పుం.
ఒకానొక రాజు, అష్టవసువైన ప్రభాసుని భార్యకు ప్రియసఖయైన
జితవతి తండ్రి.

క. మర్త్య లోకంబున నుశీనరపతి కూఁతురు జితవతి యను కోమలి
నా ప్రియసఖి. ఆది. 4-159

**ఉష్ట్రము** సం. వి. అ. పుం.
ఒంటె, లొట్టియ.

సీ. విను తొల్లి యొక యుష్ట్రి మనితరసాధ్యతపంబు సేయఁగ
మెచ్చి బ్రహ్మ వచ్చి యర్థించినది యేమి యనిన—
శాంతి. 3-83; అశ్వ. 3-157

**ఉష్ట్రి** సం. వి. ఈ. స్త్రీ.

ఆఁడు లొట్టియ

క. తురగియు నుష్ట్రియు ఖరియును, గురిసిన దుగ్ధములు నింద్యకోటి
గణితముల్, ధరణీసురాదిజను లప్పొరువునఁ బోయిన నఘంబుఁ
బొందుదు రధిపా. శాంతి. 1-321

**ఉష్ణము** సం. విశే. (అ. ఆ. అ.)

వేడియైనది

చ. దినమునవెల్ల నుష్ణకరదీప్తులు పర్వి రసంబుఁ బీల్చి.
శాంతి. 2-126

**ఉష్ణకరుఁడు** సం. వి. అ. పుం.

సూర్యుఁడు, (వేడియైన కిరణములు గలవాఁడు.)

సీ ... చంద్రముని నుష్ణ, కరుని జక్రంబులుగాఁబెట్టి. కర్ణ. 1-282

**ఉష్ణత్వము** సం. వి. అ. న.

వేడిమి.

ఉ. హిమకరుఁడు శైత్యమును నర్యముఁడు మహాతేజమును హుతా
శనుఁ డుష్ణత్వము విడిచిరేని గుర్వర్థము నాచేకొనిన సద్వ్రతంబు
విడుతునే. ఆది. 4-223

**ఉష్ణినాభుఁడు** సం. వి. అ. పుం.

ఉష్ణపులలో నొకఁడు. చూ. ఉష్ణపులు. అను. 8-192

**ఉష్ణిగంగ** సం. వి. ఆ. స్త్రీ.

ఒక తీర్థప్రదేశము. ఇచట స్థూలశిరసుని ఆశ్రమము గలదు. ఇచ్చట మానసికశౌచము ముఖ్యము ఇందు స్నానముచేసిన వారు కృతార్థులగుదురు. బహుశః ఇది ఉష్ణపు గుండముగల గంగానదీ ప్రదేశమేమో.

**ఉష్ణీషము** సం. వి. అ. పుం. న.

తలపాగ, శిరోవేష్టనము.

క. బలరిపుఁడిచ్చిన కుండలములు నుష్ణీషంబుఁ జిత్తమున భక్తిమెయిం, దలఁప నవి వచ్చె నెంద్రుక లలవడఁగాఁ దాచి ముడిచె నమర దృఢముగన్. విరా. 4-164

**ఉష్ణీషి** సం. వి. న్. పుం.

శివుఁడు.

సీ. చీరవాసుఁని ధన్వి సిద్ధు దండధరు మృగవ్యాధు నుష్ణీషిఁ గనక బాహుఁ, బశుపతి వృషు భూతపతి. ఆశ్వ. 1-62

**ఉష్మపులు** సం. వి. అ. పుం. బహు.

దేవతలలోఁ గొందఱు పితరులుగా నిర్దేశింపఁబడిన వారు.

వీరు- 1. బలుఁడు, 2. ధృతి, 3. విపాప్ముఁడు, 4. పుణ్యకృత్తు, 5. పావనుఁడు, 6. పార్ష్ణి క్షేముఁడు, 7. సమూహుఁడు, 8. దివ్యసానువు 9. వివస్వంతుఁడు, 10 వీర్యవంతుఁడు, 11. హ్రీమంతుఁడు. 12. కీర్తిమంతుఁడు, 13. కృతుఁడు, 14. విద్యుద్వర్చసుఁడు, 15. సోమవర్చసుఁడు, 16. సూర్యశ్రీ, 17. సోమపుఁడు, 18. సూర్యసావిత్రుఁడు, 19. దత్తాత్ముఁడు, 20. పుండరీయకుఁడు, 21. ఉష్ణినాభుఁడు, 22 నభోదుఁడు, 23. విశ్వాయువు, 24. దీప్తి 25. చమూహరుఁడు, 26. సురేశుఁడు, 27. వ్యోమారి, 28. శంకరుఁడు, 29. భవుఁడు, 30. ఈశుఁడు, 31 కర్త, 32, కృతి, 33. దక్షుఁడు, 34 భువనుఁడు, 35. దివ్యకర్మకృత్తు, 36. గణితుఁడు, 37. పంచవీరుఁడు, 38. ఆదిత్యుఁడు, 39. రశ్మిమంతుఁడు, 40. సప్తకృత్తు 41. సోమపూర్వుఁడు, 42. విశ్వకృత్తు, 43. కవి, 44. అనుగోప్త, 45. సుగోప్త, 46. నప్త, 47. ఈశ్వరుఁడు, 48. జితాత్ముఁడు, 49. మునివీర్యుఁడు, 50 దీప్తరోముఁడు, 51. భయంకరుఁడు, 52. అనుకర్ముఁడు, 53. ప్రతీతుఁడు, 54. ప్రదాత, 55. అంశుమంతుఁడు, 56. శైలాభుఁడు, 57. పరమక్రోధి. 58. ధీరోష్ణి, 59. భూపతి, 60. స్రజుఁడు, 61. వజ్రి, 62. వరి. అను. 3-192

ఈ వరుసయందు నిర్ణయసాగర వారి ప్రతికిని నీలకంఠుయు వ్యాఖ్యకును తిక్కనగారి ఆంధ్రీకరణ మనుకూలించినది. వావిళ్ళ వారి ప్రతిలో

శ్లోకములు వెనుక ముందగుట మాత్రమే కన్పించుచున్నది గాని పేర్లలో భేదములేదు. ఈ మాత్రమునకే తిక్కనగారు నిర్ణయసాగర ప్రతిని అను సరించినారనుటకు వీలులేదు.

**ఉష్మము** సం. వి. అ. న్. పుం.

వేసఁగి, గ్రీష్మము.

సీ. ...శత్రుప్రతాపోష్మ సమయంబు,గా మిత్రు బర్హి కేకారవంబు,
తెసఁగంగఁ దోఁతెంచి యింద్రనందన మహోజలధరంబు.
ఆర. 6-186

**ఉసుఱు** దే. వి.

ప్రాణము.

క. ఉసుఱు సచ్చినవారలు వత్తురె. ద్రోణ. 2-185; శల్య. 2-56

**ఉసుఱుగొను** దే. అ. క్రి.

ప్రాణము దీయు. చంపు.

క. ...ఈ, పిన్నాతని ప్రాణంబులు, గొన్నది యిది దీని యుసుఱుగొని
యెద ననియెన్. అను. 1-7; ద్రోణ. 5-135

# ఊ

**ఊఁకించు** దే. అ. క్రి.

ఉంకించు, ఉత్సహించు, పూను.

శా. నీ తోడ్పాటున చేఁ త్రివిష్టపములన్ గెల్వంగ నూఁకింతు.
కర్ణ. 3-130

**ఊఁకువ** దే. వి.

విశ్రాంతి, ఊఱట, తెఱపి, విరామము.

చ. వలవదు రోయఁ బాండవుల వారొక యూఁకువలేని త్రిమ్మటన్,
బలమతి వన్యసత్త్వముల పాల్పడి వచ్చినచోటఁ బూరి యు,న్నొంల
వదె యింత కింకిట మనోముద మస్ఖలితంబుగాఁగ వి,చ్చలవిడి
రాజ్యలక్ష్మిఁ దగు చందమునం గొనియాడు మున్నతిన్.
విరా. 3-95

"ఊఁట" అనునది పాఠము. "ఊఁకువ" యను నది పాఠాంతరము.

**ఊఁకొను** దే. స. క్రి.

1. ఊఁకొట్టు, మనస్సున పెట్టక విను, వినియు విననట్లు విను.

ప. మీరును వారును నొక్కటియై యున్న మీదిక్కు దేవతలకుం దేఱి
చూడరాదనిన నమ్మాటలు వెడవెర యూఁకొని ధృతరాష్ట్రుండు
విదురున కిట్లనియె. ఉద్యో. 2-49

ఉ. రక్కెపమాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ,వొ
క్కటి యైనఁ గాదనగ యూఁకొనుచుండుట యంతకంటె మేలు.
ఉద్యో. 3-94

2. విను, ఆలకించు.

చ. ... కార్య మల్పబు,ద్ధుల వెడమాట లూఁకొనకు దోషము
సేగియు వచ్చు నెమ్మెయిన్. ఉద్యో. 3-381

**ఊఁగు** దే. అ. క్రి.

ఉయ్యేలనూఁగు. చూ. ఊఁచు. అర. 4-188

**ఊఁచముట్టు** దే. క్రి. విశ.

(అరటి పొరలను దూఁట తగులు వఱకు వొలిచినట్లు); నిశ్శేషముగా,
మూలముట్టుగ.

ఆ. ఉద్దవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు. విరా. 3-120

**ఊఁచముట్టుగొను** దే. స. క్రి. (ఊఁచముట్టు + కొను)

నిశ్శేషముగాఁ జంపు, చంపు.

గీ. కొడుక తమ్ములుఁ దోడ్పడఁగడఁగి శత్రు,వరుల గెల్పెదనంటి
వొక్కరుఁడు దక్క, కుంద నీతమ్ముఁ గుఱ్ఱల నూఁచ ముట్టు,గొని
యెనే విధి యేగతిఁ జనుదుఁ జెవుమ. శల్య. 1-28

ఊఁచికొను దే. స. క్రి.

ఊఁగించుకొను, ఊఁగునట్లు చేసికొను.

ఉ శాతనఖాగ్రఖండిత లసన్మదకుంజర కుంభముక్త ము,క్తాలత శైల కందర గుహాంతర సుప్తమృగేంద్ర కేసర, వ్రాతము వేడ్కఁ నూఁచికొన వారక చేరులు గాదె క్రోధ నిర్ఘాత మహోగ్రు భీముఁ జెనకం దలపోయుట నీకు నెమ్మెయిన్. ఆర. 6-176

ఊఁచు దే. స. క్రి. (√ఊగు) ఊఁపు

ఊఁగఁజేయు.

చ గళిత నవీన కంగళ కదంబ కదంబక కేశకిరజో, మిళిత సుగంధి బంధుర సమీరణుఁడన్ సఖుఁ డూఁచుచుండఁగా, నులియుచు మెల్లగుత్తులను మయ్యోల లొప్పఁగ నెక్కి యూఁగె నుల్లల నళినీకులంబు మృదుల ధ్వని గీతము విస్తరించుచున్,
చూ. తలయూఁచు. ఆర. 4-183

ఊఁటు దే. స. క్రి.

పొడుచు.

సీ. చేతి సమ్మెటలను జేరుకోలల నేసి యంకుశంబుల నూఁటి యతి గయమున, వాహనంబులఁ దోలువారును భీష్మ. 3-234

ఊఁదు దే. అ. క్రి.

(దీనికి మూలరూపము తమిలమున 'ఉన్ఱు' - తమిలమున రేఫమునకు 'ఉ' కారోచ్చారణ ముండను గాన 'న' లోపించి 'ఊఱు' అయినది రేఫము లోపించి 'ఊను' అయినది 'ఊఁదు, ఊను' (సమానార్థకములు) చూ. ఊఁదకొను.

ఊఁదుకొను ఊఁదు (స్వార్థమున 'కొను' ప్రత్యయము)

నాటు, గ్రుచ్చు, దిగబడు.

వ. కాలుబలంబుల పీనుంగుపెంటలమీఁద నూఁదుకొనం గూలిన ఘోటకంబులును. ద్రోణ 2-60

(ఇది 'ఊఁదుకొను' అను పాఠమునకు పాఠాంతరము)

ఊఁత దే. వి. (√ఊఁదు)

1. ఆధారము.

క. చనుటయు ద్రౌపది యతనిం, గనియుం గానని విధంబు గైకొని చిత్తం,బున బెదరక తన ముందటి, పని వెరపున నుండె భీము పలుకుల యూఁతన్. విరా. 2-248

2 ప్రాపు, ఆశ్రయము.

వ (ధృతరాష్ట్రుఁడు) దప్పి యెక్కుడు గదిరిన గాంధారి తనువున మేను సేర్చి మూర్ఛిల్లుటయు నార్తి నొంది యక్కుంతీనందనాగ్రజుం డిట్లని పలవించె.

క. కరిదళ సహస్ర బలవి,స్ఫురితుఁడగు విచిత్రవీర్యపుత్త్రుఁ డొకతలో,దరి నూఁతగొనియె విధి, యె,వ్వరి హీనులఁ జేయఁ దకట వజ్రుం డైనన్.

చ. అనిలజుమేని చందమగు నాయసరూపము చూర్ణితంబు చే,సిన బలమాననీయుఁ డొక చేడియ నక్కట యాశ్రయించె. ఆశ్ర. 1-39,40,41

3. అవలంబనము.

చ. అరయఁగ రాజధర్మము సమాశ్రయమై నడపుం ద్రివర్గమున్. గురుతర మోక్ష ధర్మమునకుం దలఁపం దన ప్రాప యూఁత. శాంతి. 2-158. ద్రోణ. 1-368

సీ. అవశమై యొఱఁగిన యంగవల్లిక పొంత,నున్న భూమీరుహం బూఁతగాఁగ, అర. 7-28

4. భావము, తలంపు.

క. ఇది నాయదియను నూఁత, న్మది నెయ్యది పట్టుకొల్పినను దానితమై, తుదిఁ జేటు నొంది దానికి, నది శోకము నావహించు నత్యంతంబున్. శాంతి. 4-18

శ్లో కించిదేవ మమత్వేన యదా భవతి కల్పితమ్
తదేవ పరితాపార్థం సర్వం సంపద్యతే తదా.

సం. భా. శాంతి. 174-44,45

వి. అడుగున వెడల్పుగను పైని సన్నముగను నుండునట్లు రెండు వైపుల మూఁత లేకుండ వెదురు పేళ్లతో అల్లిన మత్స్యగ్రహణ సాధనము.

క. వెరవున నూఁతల నెత్తెలఁగరముల మత్స్యములఁ బట్టి కడుసంతస మగ్గం, బొరయుచుఁ ద్రాళ్లం గ్రువ్వఁగ, గరమూహించి మదిఁ ద్రాప్త కాలజ్ఞుండున్. శాంతి. 3-198

**ఊఁతకోల** దే. వి. (ఊఁత + కోల)

అవలంబముగాఁ బట్టుకొనెడు కఱ్ఱ, అవలంబము.

తే. అంధులకు నూఁతకోలఁగా నరట యొకని, నైన నిలుపక నూర్ధ్వర సదయ వృత్తి, బ్రమింగి తండెవ్వఁడేనియు మీకు నెగ్గు, లాచరింపని వాఁడు లేఁడయ్యెనయ్య. స్త్రీ. 1-170

**ఊఁతగొను** దే. స. క్రి. (ఊఁత + కొను)

ఆశ్రయించు, ఆధారము చేసికొను.

వ. అకపిధ్వజుండు నిజధ్వజవండం బొక్కింత యూఁతగొనిన.
ద్రోణ. 3-96; ద్రోణ. 1-40

**ఊఁదిచెప్పు** దే. స. క్రి.

నొక్కి పలుకు.

క. అతిథి నిమఁ గోరెనేనిని, మతిఁ గించిపడక యోల మానగొనక నీ వతనికిఁ బ్రియంబు సల్పుము. సతికిం బతి పనువుసేయఁజను చెల్లనియున్.

క. అనియూఁది చెప్పి. అను. 1-69,70

క. విను మంత్ర భేదమున వచ్చిన కీడున కనము శాంతిసేయు టరిది గావున మంత్రులతో మంత్రావన నియమం బూఁది చెప్పవలయిం జమ్మిన్. ఆశ్ర. 1-59; శాంతి. 1-188

**ఊఁదిపట్టు** దే. స. క్రి.

పడకుండ గట్టిగా ఆని పట్టుకొను.

చ. కనుఁగొని ఫల్గుణుండు దురగంబుల వాగెలువట్టి యొత్తి తత్తను వులు మాల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృత్తనయుని నూఁదిపట్టి వికృతంబగు రూపము చక్కఁజేసి నెమ్మన

మొకళంగిఁ దేర్చి నరిమంబుగఁ గొఁగిటఁ జేర్చి యిట్లనున్.
విరా. 4-174

**ఊఁదు** దే. స. క్రి.

1. ఆధ్మానము చేయు, అగ్ని ప్రజ్వలనము నున్నగువాని కొఱకు నోటితో గాలి విడుచు, నోటిగాలితో (నిప్పు) రేఁగఁ జేయు.

సీ. అల్లన యూఁదెడు నప్పు డక్కొమ్మవా, తెఱతావి ధైర్యంబుఁ ద్రిప్పుకొలప అను. 1-48

క. పటు విశిఖపంక్తి యత్యు,త్కట రయమున నిగుడఁ జేయఁగా నవ్విధ మూఁ,దుటనైన నుండి దీప్తో,త్కట భంగిఁ గృపానలంబు బలములు వొంగన్. విరా. 5-147

2. గ్రహించు, స్వీకరించు.

సీ. ...నీతులు వారుప,దేశింప వాని నూఁదిన మనంబు, గలిగి వర్తింపుము. ఆశ్వ. 1-56

3 పట్టుకొను.

క. ఉరగపతి తలలపల నురు,తరజవమున నసురులూఁది తత్పుచ్చుము ని,ర్జరపరు లూఁది మహిమ,త్వరమున వడిఁద్రచ్చి త్రచ్చి జవమణి యున్నన్. ఆది. 2-18

ఆ. వినఁగ నిష్టమేని వినుమని ద్రుపదుచే, యూఁది యింటిలోని కొనర నరిగి. ఆది. 7-245

4. ఆశ్రయముగాఁ జేసికొను, ప్రాపుగాఁ జేసికొను, ఆశయించు.

చ. తన భుజశక్తిలేక యొరు దర్పమయూఁది పరాక్రమింప వచ్చిన నది సెల్లునే... ఉద్యో. 4-207

శ్లో. పరవీరం సమాశ్రిత్య యస్సమాహూయతే పరాన్.
సం. భా. ఉద్యో. 182-4

సీ. పొందు నూమలతోడి పగకోర్చి నివ్వని యుత్సాహమూఁది సుయోధనుండు. కర్ణ 1-21

వ. వచ్చి యవ్విటపంబు నూఁది యశ్వాకంబుల వాలోకించి.
శాంతి. 1-12

5. ఆధారముగాఁ గొను.

ఉ. మానుషశక్తి యొల్లఁడు సమంచిత దైవము యూఁదియుండు. ఉద్యో 2-8

చ. మనకు నజాతశత్రుని సమంచిత మార్దవ మూఁది సంధిసే,య
నుచితమైన కాలమిది యాగ్రహముం జొరనీకు చిత్తమున్. శల్య. 1-54

ఉ. ...వన్నుఁ దనయంతటి మానిసిఁ జేసి యుండ నే,నే తగవూఁది
యాకురుకులేశ్వరుఁ డాయుదు ముట్టవచ్చినన్. ఉద్యో. 4-39

6. గట్టిగా అనుకొను.

చ. కనఁగొని ఫల్గునుండు దురగంబుల వాగెలువట్టి యెత్తి త,త్తను
వులు నూల్కొనన్ సివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృ,
త్తనయుని నూఁదిపట్టి వికృతంబగు రూపము చక్కఁ జేసి
విరా. 4-174

7. ప్రమాణముగాఁ గొను.

ఆ. ధర్మమెదలఁ గృపణకర్మంబుఁ గోరి త,గ్గంబు సుద్యోగకల ధర్మ
కారి, యొడమి లేనివాఁడ నడపినుఁగను నహుషోక్తి వినమె
దాని నూఁది వలదె. శాంతి. 1-49

ఉ. ...లోకసం, భావితకీర్తి వయ్యెడు నృపాలక నా పలుకూఁదు
పాటిగాన్. శాంతి. 1-221

చ. సమయము యూఁది పాండవుల శక్తుల చాడ్పున నిందు నాఁడు
బన్నమువడి చన్న దైన్యము. ఉద్యో. 1-244

చ ...సజ్జన మనోజ్ఞవచో మహనీయ నీవు సె,ప్పిన పలుకూఁది యా
క్రతువు ప్రీతి నొనర్చెద సెల్ల తంగులన. అశ్వ. 1-13

8. ఆను, నిలువు, మోపు

తే. ... రాజ్యలోభంబున సఖుల బంధు, జనుల వధియింపఁ దొడగితి
మని రథంబు మీఁద గూర్చుండబడియెఁ జేయూఁది కొనుచు.
భీష్మ. 1-188

వ. ఉత్తరంగున నొక్క యొడ సయిసను గా లూచక లీలోద్యానంబు

గలయం గ్రుమ్మరుచు. విరా. 2-805

9. ఒత్తు. నొక్కు.

చ. పవనతనూజు బాహువులు పాణియుగంబునఁ బట్టి వీఁకమై,నవని
పయిం బడం దిగిచి యంగము జానుల నూఁదినం గడున్, జవమున
దఁడబాడిత భుజంగముభంగి సమ స్థితాంగుఁడై.

విరా. 2-842

క. అని యూఁదఁజెప్పి యొకనాఁడు. అను. 1-68

10. వహించు, పూను.

చ. ఇటు దగునయ్య శూరులకు నెల్లను లోకద యట్లకాదె యే,మిటికి
నలందరన్ మొనలు మేకొని యాయుధజీవనంబు నూఁ,దుటయు
నెఱుంగవే రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్రుఁ డె,క్కటిదివి
చూఱకోల్ ప్రియము కాకిది యప్రియమే తలంపఁగాన్.

ద్రోణ. 2-257

క. ఉక్కఱి సురపతికైనను, ద్రొక్కము నృపధర్మమూఁది మొన
తలఁ బడినన్, మిక్కిలి పేరును సిట దివి, నక్కజముగఁ గెంపుఁ
బడయ నగుట నరేంద్రా. ఉద్యో. 8-860

11. పట్టుదల పట్టు.

మ. గురుపుత్రుండ సురాంతకుప్ విజయునిం గ్రూరాస్త్ర సంతాన
ని,ష్ఠురపాతంబున నొంప నాహరి దదాటోపంబు సైరింప క,న్న
రుతో నౌషధ మూఁది చేసి తెవులున్మర్దింపకున్నం దుది, న్పురమై
యుండదె యే పదంపుము రిపు న్పొంరఁచినై నావుకన్.

కర్ణ. 2-307

12. విశ్వసించు.

ఉ. ఆతనిఁ గానఁ బోము ప్రచురాదరణంబున నీదు కోర్కి సం,
ప్రీతిగఁ దీర్చు నా గుణగరిష్ఠుఁడు నావలు కూఁదుమున్న మో,
దాతిశయంబు నొంది భృగుఁ డా ధరణీసురవర్యుతో మహా,త్మ
తెలివొందె నా మనము తావక పావన వాక్య సంపదన్.

శాంతి. 6-659 శాంతి. 2-369

13. పొందు

క. అగుణంబయ్యును నిమ్మెయిఁ, బ్రగుణతఁ బ్రాపించు నక్షర మహాంకార, స్థగుణంబూఁదిన విడిచిన, దెగు నన్నియు నిర్వికార దీప్తంబు నగున్. శాంతి. 6—15

క. అని పుత్రుం డుపదేశించిన జనకుం డట్లచేసి చెందె సుఖంబున్, మనుజేంద్ర యవ్విధముఁ గని, కొని యూఁదుము సత్యధర్మ కుశలత్వంబున్. శాంతి. 4-31

క. నరనాథ సుఖము దుఃఖముఁ, బరువడి మెయిఁ బొరయుఁగాక పన్నుగ నరునిం, బొరయునె యందొక్కటి యని, పొరసిన వల దూఁద మోదమును ఖేదంబున్. శాంతి 4-12; శాంతి. 2-244

14. అలవఱుచు.

క. క్షరమును నక్షరమును వ, త్వరమును నెఱిఁగితివి శోకభయ మోహాఁడవై, కురువర యానిశ్శ్రేయస, కర ప్రబోధంబు నూఁదు గాథావరశిన్. శాంతి. 6-71

15. అనుభవించు

ఉ. అయ్యుమలాన్మతోడఁ బవనాత్మజుఁ డిట్లను ధర్మపుత్రుని న్నెయ్యపు యుక్తి హేతువుగ నిమ్మెయిఁ జూపెను నీదు పన్నుగం, గయ్యము చేసి భూపతిని కాయములం బరిమార్చెఁ గల్గి నీ, కియ్యెడ లక్ష్మినూఁది చరియింపక యిప్పుడు పాయఁ జాడియే.
అశ్వ. 1-159

శ్లో. ప్రసీద మా గా శార్దూల ప్రాప్తం వసు మహ్య యశస్విని,
శ్రియం యోధిష్ఠిరీం మాత ధృత్వా శాపస్వలార్హసి. మ. అశ్వ. 16-28

16. గ్రుచ్చు, నాటు, దిగఁబడు.

వ. కాలుబలంబులం పిడుగు వెంటలమీఁద నూఁదుకొనం గూలిన ఘోటక బలును. ద్రోణ. 3-60

అ. క్రి.

ఉండు, నిలుచు.

వ. అందు రౌహిణంబను పాదపోత్తమంబు గరుడునిం గని సంభా
వించి శతయోజనాయతంబైన మదీయశాఖపై నుండి యిగ్గజ
కచ్ఛపంబుల భక్షించి పొమ్మనిన గరుడుండు నట్ల చేయుదునని
యమ్మహాశాఖపై నూఁద సమకట్టి యందు. ఆది. 2-71

**ఊఁదుకొను** దే. స. క్రి. (స్వార్థమునందు 'కొను' ప్రత్యయము)

1. గ్రుచ్చుకొను, నాటుకొను, దగఁబడు.

**వ.** కాలుబలంబుల పీనుంగు పెంటలమీఁద నూఁదుకొనం గూలిన
ఘోటకంబులును. ద్రోణ. 2-60

2. పట్టుకొను.

వ. ఇట్లు మూర్ఛిల్లి కొండొక సేపునకుం దెలిసి గాంధారి పరిచారిక
లూఁది కొనిపోవ నప్పుత్రశవంబు కడకుఁ బోయి. స్త్రీ. 2-26

**ఊచు** దే. స. క్రి. ఊడ్చు

దులుచు, రాలుచు.

క. అందంద మెడయుఁ దలయు న,మందాటోపమునఁ బెక్కు
మాఱు లడిచి చా,వుం దెలియఁ జూచి యలరెడు, దెంవముతో
నీఁకలన్నిటిని వెస నూచెన్. శాంతి. 3-498

తే. ఊచి బొండువు ద్రవ్వి. శాంతి. 3-499

('ఊడ్చు' - నకు ఇది పాఠాంతరము)

**ఊట** దే. వి. (√ఊరు)

ఊరిన ద్రవము.

సీ. ... ఎముక యూట, చవిగొని యానుచు. స్త్రీ. 2-9

**ఊటాడు** దే. అ. క్రి.

ఊగాడు, గ్రక్కదలు.

వ. కలఁగెం దోయధి సప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం,చలతం
బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడె విరా. 4-172

**ఊడు** దే. అ. క్రి.

వీడు, వదలు, సడలు.

క. గరుడాస్త్రం బేసిన న,చ్చెరువుగ గరుడములు గవిసి చీరెం జంచు, స్ఫుగణము మెఱయఁగ వెస న,య్యురగాత్మక బంధ మూడ నర్వీనాథా. కర్ణ 2–285

ఆ. ... అతని మౌర్వి యూడనేసె. కర్ణ. 3-298; కర్ణ. 3.348

**ఊడుకొను** దే. అ. క్రి.

1. మూఁగు, కవియు.

క. అరదంబులు మొదలగు ను,ద్ధుర వాహనకోటి డిగ్గి దుర్దాంతగతిం, దురగంబులపై హరిపై, నరుపై నూడుకొనఁబడిరి నలి నార్పుల తోన్. ద్రోణ. 1–260

2. నాటుకొను, గ్రుచ్చుకొను.

వ. మిగిలిన మాతంగంబులు పెనంగిన కనకలిప్త కాండంబు లూడుకొనం, దాటిన పెరగళ్లు వోవు కొండలకై వడి బొలుచునవియు. కర్ణ, 2-227

**ఊడ్చు** దే. స. క్రి. ఊడుచు

1 తొలఁగించు, తీసి వేయు.

వ. అప్పాంగవోత్తమునందు నవ్వుచు మన మనువులు సాలునని పలికి ర్వాభరణంబులు నూడ్చి వల్కలాజినంబులు ధరియించినం మన్నల ద్రౌపదియు నట్ల చేసిరి మహా. 19

వ. అప్పుడు కౌరవులుం దారును దమవారును మైమఱువు లూడ్చి యాయుధంబులు వెట్టి గాంగేయుకడకుం బోయిరి. భీష్మ. 3-419

వ. గో··ఁడుఁబు నెక్కుడించి కంటకఁబూడ్చి నిద్రింపుము సౌప్తి. 1-65

2. విప్పు.

క. ఆయుధము విడిచియుండఁగ, సాయక గురు మీఁదు నూడఁ జంపిన కష్టీపాయుని ధృష్టద్యుమ్నుని, మాయించియకాని తొడిన మఱువే నూడ్చన్. కర్ణ. 2–180

సీ. సమగ కౌతుకిత్రైన యుజాతశత్రుఁ, డొప్పు మిగిలెడు మైమఱు వూడ్చి యాయుధములతోఁ గూడఁ దనయరదమునఁబెట్టి, యిల మడిగి మౌనియై కరంబులు మొగిడ్చి. భీష్మ. 1–152

3. త్యజించు, విడుచు, ఉజ్జగించు.

వ. తోలూడ్చు మహానాగంబునుం బోలెఁ గరవాలంబు దాన యొఱ వెలికి నిగుడుచున్నయది. ఉద్యో. 2-146; శాంతి. 5-252

సీ. సుగతికిఁ జనఁగోరి తగ నుజ్జగించెను, బాణాసనంబును, బాణము లును -తే- తెలివిగలిగి మనుండని పలికి శర శరాసనము లూడ్చి తేరిపై నసఘమూర్తి యొప్పుఁ గూర్చుండి. ద్రోణ 5-322

శా. తానున్ భార్యయు నేఁగుఁ బేరడవికిం దా నొక్కఁడై నం జనున్. శాంతి. 2-282

4. వెలుకు, ఊడఁదీయు.

ఆ. పడుచు లీఁక లూడ్చి పట్టి యాడెడినట్టి, పులుగు చందమయ్యెఁ దలఁప నా యవస్థ. కర్ణ. 1-84

క. ఈ కలన్నిటిని వెస నూడ్చెన్ - తే - ఊడ్చి బొందువు ద్రచ్చి. శాంతి. 3-498; శాంతి. 3-489

ఊనము సం. విణ. (అ. ఆ. అ.)

హీనము, తక్కువైనది, కొఱవడినది.

క. అనవుడు శినిపుంగవుఁ డొక్కింత చింతించి పార్థు [illegible] బోవుట బంటుతనంబున కూనంబుగాదు. ద్రోణ. 3-300

క. నీ వడిగి తేను నిచ్చితి, భూవల్లభ యుబ్బ సత్యమున [illegible] ముగా, దే వరియింపమి. శాంతి. 4-148

ఊను దే. స. క్రి.

1. పొందు.

ఆ. ... ఏమి సంభవించె, నేని దానఁ [illegible] ప్తినూనుట దప్పి, [illegible] వగవ కునికి భవ్యగుణము. శా [illegible] 5-23

తే. మునుల మానసంబులు సంప్రీతి నూన. అను. 4-444

క. ఏనుంగు వడిన నచ్చటి, నేలు [illegible] లుటయు [illegible] వాఁడు దన్నుం, దాన పురికొల్పుకొని వెలుపునది [illegible] నొక్కఁడ నిలిచెన్. విష్ణు. 3-116

సీ. ... ప్రీతి సంతాప మోహాదు, లొదవినఁ దత్తద్గుణోదయ
ములఁ గని యుపేక్షించుచు మనము నూనఁగనిమి కార్యంబు
ధర్మార్థ కామములకు. అను. 5-256

క. తన మదిఁ గదిరిన తమకంబునఁ జిడిముడి పడుచు ద్రుపద
పుత్రిక పై నూనిన వేడ్క దిగువ నొకటియుఁ గనుఁగొన వినలేక
మదనకంపితుడగుచున్ విరా. 2 243; అశ్వ 1-69

5. ఆధారముగాఁ దీసికొను, ప్రమాణముగాఁ దీసికొను.

క. దానము ధర్మము దమ మిజ్యానిష్ఠ యనంగఁ గల్గు సత్క్రియ
లెల్లన్, మానవనాథ యహింసానూనావృతు లంద్రు శ్రుతుల
నూనిన పెద్దల్. అను. 4-268

6. ధరించు, తాల్చు.

మ. అనుచున్ సంయమిశాసనాన వినయాలంకారుఁ డాద్యుండు స్ఫూర్తి, త్రి
నిరూఢంబుగ నూనినట్టి నిజసంస్థితంబు శీఘ్రంబునం గొని
తద్విధిని రాజిచే నతని చూడ్కుల్ వివర్ణత్వంబు నొందఁ, ద
నుదగ్రోద్ధతిఁ ద్రుంచెఁ దద్గళము రక్తంబు ప్రవాహంబుగన్.
మార్క. 1-48

అ. క్రి.

1. కలుగు, పుట్టు.

ఉ. వీనులకుం దియ్యని మెక్కు ముసు విన్కిఁ బరస్పరరాగవృత్తి లో నూ
నినఁ జూచు వేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబులు.
విరా. 5-893

క. తానెంత యాపుఁడైన మహీనాయకు సొమ్ము సామి పెమ్ము
టుగా లో నూనిన భయమునఁ బొరయక, మానినఁ గాకేల
కలుగు మానము బ్రదుకున్. విరా. 1-186

క. ... ఇట్లను హరి చిత్తంబులోన నడలూనంగాన్. ద్రో. 2-256

తే. ... వారలు నాత్మఁ బ్రీతి యూనఁ జలిపిరి పావన స్నానవిధులు
శల్య. 2-171

వ. ఇట్లు పెక్కండ్రు దొక్కపెట్ట పెల్లేసినం గినుక నూనిన నవ్వీరుం డుద్ర
రసంబు నలంకరింప. ద్రో. 3-225

3. స్రవించు.

ఉ. ... వృకోదరార్జునులు బొంగులుగాఁ బెడచేతఁ గన్నునీ, రూనఁగ నొత్తుకొంచుఁ జని యుగ్రవనంబున దుఃఖమగ్నులై.

ఉద్యో. 3–281

4. నాను.

ఆ. మూత్రమునఁ బురీషమున నూనుచును గర్భమునఁ బ్రవర్ధనమ్మునఁ బొంది.

శాంతి. 2–292

5. అనుభవించు.

క. దానికి నొచ్చిన మనముల,తో నడవికిఁ బోయి బహుళ దుఃఖంబుల న,ట్లూని విరాటుపురిం బడఁగాని యిడుమ వడియు వారు గనలర కంటే.

కల్య. 2–366

ఊనుచు; ఊన్చు దే. స. క్రి.

1. చేర్చు, నగలించు.

సీ. నాభి యూరులు జఘనము మెత్తమెత్తన యొత్తి ముదంబున నుల్లమూన్చు.

స్త్రీ. 2–138

2. ఉంచు, మోపు.

క. ఒలసి మనో వాక్కాయంబుల ద్రోహభావ మఖిల భూతముల యెడఁ, గలిమి విను శీల మది మే, లొలయించును దాన నుల్లమూన్పును పుత్రా.

శాంతి 3–147

క. ఘనని మును సాత్త్వికమునను, మానస మూన్పంగ వలయు మహానియమ ధృతిన్.

శాంతి. 4–289

చ. కావునఁ గామ క్రోధము, లావిర్భూతములు గాని యట్లుగఁ దత్సత్త్వావేశంబున నూన్పుము, భావం బివ్విధము విష్ణుపరత గుమారా.

అను. 1–318

ఊరక దే. అవ్య. (యత్నము, కారణము, ఫలము, ప్రతీకారము మున్నగు వాని అభావమును దెలుపును)

1. యత్నము లేక.

ఉ. అక్కజమైన చెల్వమున నాత్మకు బ్రేగయి పొల్చు పొత్తిపైఁ
నెక్కొను చూడ్కిఁ గ్రమ్మఱుపనేరక యూరక నిల్చె
విరా. 2-28

క. కలదో లేదో యని యెడు, తలపోఁతయ కాని నిశ్చితము గాదు
సురాదులకుఁ బునర్జన్మంబున, కలిమియు లేమియును నరులు
గానమి దప్పె.

క. కలదది యూరక కానఁగ, నలవిగాదె శ్రుతివాక్యములందిమి యర్థంబు
లపై, నిలిచిన శ్రద్ధం గ్రమమునఁ, దెలివొందిరిఁ గాక యెట్టి
ధీమంతులకున్. అను. 5-162, 168

2. కారణము లేక, వ్యర్థముగా.

చ. ... భీష్ముపై, కుఱికనఁగాక మాకు నగిమూరతి యిత్తురె మీరు
మేదినిన్. ఉద్యో. 2-142

3. మానక.

ఉ. కౌరవ సేనఁ జూచి వడఁకం దొడఁగెన్ మనతోన మేను నీ,పూరక
పోవుచున్కి యిది యొప్పునె. విరా. 4-55

4. వివరణము చేయక.

క. విను విధికృత్యము లూరక, కనుఁగొనుచును ... ...
సుఖ దుఃఖ నిరూఢిఁ బొందకుండఁగ, వనముం దొలఁగుచు వెరవు
మహనీయమగున్. శాంతి. 4-379

5. ఉపేక్షించి, ఉపేక్షాభావముతో.

తే. గంధర్వులేవురు నన్ను నిట్టు లొంచ, ... ... నూరక యునికి
నూడ, నచ్చెరువు గాదె. విరా. 2-140

ఉ. ... ఇ,చ్చో ననుఁ దన్నఁ గీచకుఁడు జూచియు నూరక యున్కి
పాడియే. విరా. 2-143

ఉ. ... చిత్తములుం గలుషంబు లమ్మహా, వీరుల కీ నృపాలునెడ వీరికి
నూరక యున్కి యర్హమే. విరా. 3-106

క. తన చేసిన మాతసుతుం, దునుమఁడు గాగనుచు నలుకతోడ
రయమునం, జనియెడు ధర్మసుతుం డీ, తని నూరక చూచుచునికి
తగునే మనకున్. ద్రోణ. 5-258

క. మీరును వారును జలమునఁ, బోరెడునెడ నెద్ది యెట్లు వోయిన
నెటి నే, నూరకయుండుదుఁ దోడె, వ్వారికిఁ బో నింత నిక్కువం
బెఱింగిన్. ఉద్యో. 1-83

6. పలుకక, మాటాడక.

క. ఊరక యుండక పలుపుర, తోరవ మెసఁగంగఁ బలుకదొడరుపక
మదిం, జేరువ గల నాగరికులుఁ, దారుఁ గలసి పలుకవలయు ధర
ణీశుకడన్. విరా. 1-127

చ. ... మీఁదు పరికింపక యమ్మెయి నీవు పాండు నందనులకుఁ
జెట్టవై హృదయ తాపము వచ్చినఁ బల్కదొందులన్.

ఉ. ఊరక బవరంబు తెలుగు వినుము ద్రోణ. 4-209, 210

వ. కినియించి గదం దలవగుల ప్రేటువడక యూరక తేరుపై ని
మ్మనవుడు మద్రపతి యతని నవలోకించి
కర్ణ. 2-60, ఆశ్ర. 1-185

చ. ... పురుషోత్తముఁ డింత యొప్పఁ బల్కెనె మఱుమాటలాడ
నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం, దనువరి యెవ్వఁ డంచు
నచలాకృతులై నెటి నూరకుండఁగన్. ఉద్యో. 3-285

7. నిర్భయముగా, నిర్లక్ష్యముగా.

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను వుద్గత ఘర్మజలంబు దాల్చుచున్, దిల్ల
పడంగ నా కిది గడింది విచారము పుట్టె నందుఁ బో,వొల్ల ననంగ
రాదచటి కూరక పోవమరాదు నేర్పు సంధిల్లఁగ దీని గాపికొను
దీమస మెట్టిది యొక్కొ దైవమా. విరా. 2-91

8. ఏమియుఁ జేయక, నిర్వ్యాపారముగా, చేష్టలుడిగి.

వ. ఇట్లుభయ సైనికులు సాంద్ర సంతమసంబునం జేయునది లేక
సంగ్రామంబు దక్కి తమకంబెక్క నొక్కింతసే పూరకున్నంత.
విరా 3-196

క. మొనఁ గలయఁ జూచి యూరక, చను టధిపతి నరసి కానిచటఁ
గానక యాతని పజ్జ నరుగు టెఱుఁగగు, ననుమానము లేదు
క్రోధ మగ్గలము మదిన్. విరా. 4-259

ఆ. తిండిపోతె నీకు ఖండనం బేటికిఁ, గడపఁజేరి మనసు కాంచు దీవు, నోపు కోలఁది మ్రింగి యూరక నీ వింటి, కడన యుండు మింక నడచి పడక. ద్రోణ. 4-239; ద్రోణ. 3-245

9. ప్రతీకారము చేయక.

వ. సమస్త జనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతులరయి యుండియు సత్యంబు పాటించి యూరక పోక చూచి యచ్చెరు పాటుతో నుమ్మలించుచుండిరి. ఉద్యో. 8-82

శా. సారాచార నిరూఢుఁడైన ధనురాచార్యున్ వధింపంగఁ గన్నారం జూచితి వీవుఁ దత్పరిభవం బట్లుండె భగ్నోరుఁడై, రారాజెంతయు దీనవృత్తిఁ జెవులారం బల్కఁగా విన్న వే, నీరే యూరక నిద్రవోదునకటా యిట్లేలంటి వీరోత్తమా సౌప్తి. 1-69

10. మాఱుపలుకక, సమాధానము చెప్పక.

వ. అని ప్రార్థించినం బార్థుని పలుకులకుం బ్రియంబంది ముకుందుం డూరక నరలె. భీష్మ 8-268

క. అనవుడు నీవి ట్లడిగిన, విని యూరక యుండఁదగదు విను మేర్పడు నెల్లను మున్నరూపు చెప్పెద, మనవారల వారివారి మానము లధిపా. ఉద్యో. 4-219

11. కొన్ని పట్ల నిది వాక్యాలంకారముగా నుపయోగింపఁబడును.

క. నారాయణాభిధానులు, వారలు గయ్యంబు సేయువా రొక్కెడ నే, నూరక నిరాయుధ వ్యాపారతమై నుండువాఁడ నర మాప్తుఁడనై. ఉద్యో. 1-74

ఆ. అక్కుమారి చతురయగుట శిఖండి వర్తనమునెడఁ బ్రమాదమున నెఱింగి, యుగ్గడింపనొల్ల కూరక యొఱిఁగని, యదియ పోలె నుండె వాత్మ నొచ్చి. ఉద్యో. 4-374

**ఊరార్చు** దే. స. క్రి.

ఊఱడించు, ఓదార్చు.

క. చని మదనాగ్ని జ్వాలలు, దనుకఁగ నిట్టూర్పు గాడ్పు దందడి

నిగుడం, దను నూరార్పఁగ సఖ దొరఁ, కొనమికి వెనుఁబడుచుఁ
గీచకుం డా సతితోన్. విరా. 2-60

క. వినుము ధనంజయుఁ డప్పుడు, తనుఁ దాఁ దేర్చుకొని యెల్ల తరు
ణుల నూరార్చె నతనిఁ దోడ్కొని హరి జన, కునికడకుం జనియె.
మౌస 104

గీ. బాలుఁ డొక్కండు కొండొకకోల చేతఁ, బట్టికొని యేను రక్కసుఁ
గిట్టి చంపి, చులుకఁగా వత్తు మీ రేడ్వవలవ దనుచుఁ, గలయ
నూరార్చెఁ దన తొక్కఁ బలుకు లొప్ప. ఆది. 6-360

క. ఊరార్చి యిఁక నుచితాచారంబులు నడపుటయ యుచటఁ
గృత్యము. మౌస. 208, అర. 8-160

**ఊరు**[1] దే. వి. జా.

(కొందఱు 'పూర్' శబ్దభవమని యందురు కాని దేశ్యమనుటయే యుక్త
ముగాఁ దోఁచెడిని)

(బహు — ఊళులు. ఊళ్లు, ఊళ్లులు - ఊరులు, ఊర్లు అను రెండు రూప
ములు భారతమునఁ గానరాకున్నవి.)

తే. కరటి ఘటంబు నొక యూరుఁ బురము నొచ్చి, నపుడ యిచ్చెద.
విరా. 4-80

క. అరదములు సవరణలతో, బరపై యొక్కొక్క యూరి
పంపున నరిగెం. భీష్మ. 1-84

తే. పిసికి వగఁబొందు టూరివారి, కొలయు నెడరుల కెల్లఁ దానమ్ము
లికము, గట్టికొని యుండు నట్టులు గాదె వత్స శాంతి. 6-320

(ఊరివారు - గ్రామ ప్రజలు)

క. అయిదూళ్లును మాకిచ్చినఁ జాలునంటివి.
ఉద్యో. 8-11; ఆది 6-267

ఉ. — కా, నంతన యూళు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చు
నొక్కొ. ఉద్యో. 3-101

ఆ. వెలచి కాదె యేనూళ్లు నైనను, దమకుఁ జాలు ననియె ధర్మ
సుతుఁడు. ఉద్యో. 2-219

**ఊరు**[2] దే. అ. క్రి.

లోపల నుండి (ద్రవము) పైకి వచ్చు.

ప. ఎక్కువ దక్కువలు విచారింపక వలవని వెఱపు గట్టికొని ముక్కూరి వగచుచున్న వాఁడవు (ముక్కూరు=ముక్కున నీరుగాఱు). ఉద్యో. 2-222

**ఊరుకాండము** సం. వి. అ. పుం. న.

బోదియవంటి తొడ.

క. తునిపి చిక్కువడి యుప్పు యూరు కాండంబుల వంన మద గజంబులు సొచ్చిన కదలీవనంబులం బోని యెడలును. విరా. 3-236

**ఊరుపు** దే. వి.

శ్వాస. ఊపిరి.

వ. అంతఁ గొంత యూరువు వోయినం జెయునవ్వు నవ్వి కవ్వడి కమల నాభున కిట్లనియె. కర్ణ. 2-280

**ఊరుపువోపు** దే. అ. క్రి.

ఊపిరి పుచ్చుకొనుటకు అవకాశము చిక్కు.

క. అంతఁ గొంత యూరువు వోయినం జెయునవ్వు నవ్వి గవ్వడి కమల నాభున కిట్లనియె. కర్ణ. 2-230

**ఊరుమూలము** సం. వి. అ. న.

తొడ మొదలు రహస్య స్థానము.

తే. ఊరుమూల మేర్పడఁగ నయ్యువిదవలువు, దొలఁగ ననిలంబు చేత విధూతమగుచు. ఆది. 4-122

**ఊరువు** సం. వి. ఉ. పుం.

తొడ

సీ. జనని యూరు ప్రదేశంబున నతినిగూఢంబుగా సౌఖ్యంబు డాఁగుటయును, విరా. 1-54

**ఊర్చు; ఊరుచు** దే. అ. క్రి.

ఊపిరి విడుచు. విశ్వసించు.

చ. తలరు నలందురున్ నపయుఁ దాపభరంబున వెచ్చ నూర్చు.
విరా. 2-293

వ. అనిన విని సంజయుండు వెచ్చ నూర్చి అచ్చపడి.
ఉద్యో. 2-169; సభా. 2-310

**ఊర్జితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. గొప్పది, ఉదారము.

ఉ. ... ము, చ్చిచ్చును నేర్చునట్టులుగఁ జేసెఁ దదూర్జితసేన.
భీష్మ. 2-277

చ. ఒరులకు నందరాని వర మూర్జితపుణ్యని రూఢిఁ బొందఁగా, దొర కొని యున్కి నీ విస్తృతదూరమనస్కతఁ గాదె. మౌస. 73

మ. వ్యాసయాజ్ఞాది చతుర్థ మూర్జిత కథోపేతంబు. విరా. 1-7

2. గాఢము, బలముగలది.

ఉ. ... అతఁ డూర్జితశక్తి నుత్కటుండై నెగసెన్ సమీరసుతు నల్కకు బ్రాఁకిడి నట్లు వీఁగ తోన్. విరా. 2-350

3. వృద్ధి గలది, పెంపొందినది.

ఉ. ... నిర్మలా తూర్జిత కీర్తి కారణ రణోద్ధతి వెల్వెలఁబాఱ నేటికిన్. విరా. 4-186

4. వృద్ధి చేయఁబడినది, పెంపొందింపఁబడినది.

ఉ. అర్జునుఁ డప్డు భీష్ముఁ గని ... అనివార్య పరాక్రమశీల దారుణ తూర్జిత రౌద్ర మయ్యె బహుళోగ్ర మహాస్త్ర గతాగతంబులన్. భీష్మ. 1-250

**ఊర్జితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఉత్సాహము గలవాఁడు.

వ. ఇట్లు నిర్జర వరుల నెల్ల నిర్జించి యూర్జితుండై గరుడుండు.
ఆది. 2-101

**ఊర్ణనాభి** సం. వి. ఇ. పుం.

సాలెపురుగు

క. విన మూర్ణనాభి తంతువు, బలియింపఁగఁ జేసినట్లు సత్త్వము గుణ

సం, జనకంబగునది పురుషుఁడు, గనుట యుదాసీనతన వికారము గలదే. శాంతి. 5-174

**ఊర్ణనాభుఁడు** సం. వి. అ. పుం.

కురు కుమారుఁడు గాంధారీ ధృతరాష్ట్రుల నూర్వురు కొడుకులలో నొకఁడు. వికటానన సునాభుల నడిమివాఁడు. ఆది. 5-107

**ఊర్ధ్వగతి** సం. వి. ఇ. స్త్రీ.

ఊర్ధ్వ లోకములగు స్వర్గాదులకుఁ బోవుట.

వ. ... మాధవీ పుత్రులగు నన్నలువురు దౌహిత్రుల కతంబున నూర్ధ్వ గతి గనియె. ఉద్యో. 3-322; శాంతి. 1-279

సీ. ... అయ్యవిదలు వెన్నుఁ డూర్ధ్వగతి కేగు చెయిఁగి.

మౌ. 1-192

**ఊర్ధ్వబాహుఁడు** సం. విశే. (ఉ. ఊ. ఉ.)

చేతులు పైకెత్తిన వాఁడు.

తే. ధర్మతనయురథ్యంబుల ధరణిఁ గూల్చి, ధనువుఁ గేతువుఁ దునుమాడి తనవు నొంప, నాతఁ డరనంబు డిగ్గి నిరాయుధుఁడు, నూర్ధ్వ బాహుండునై యూరకుండె నధి.

ద్రోణ 3-245; ద్రోణ. 5-409

**ఊర్ధ్వము** సం. విశే. (అ. ఆ. అ.)

మీఁదిది, పైది, ఉపరితనము.

సీ ... ఊర్ధ్వంబు దిశల ... నెక్కుడు. అశ్వ. 2-162

క. త్యాగ మొక నెలవు శమసంయోగం బుత్తరము దానికూర్ధ్వము సంతోషము. శాంతి. 5-348

**ఊర్ధ్వరేతసుఁడు; ఊర్ధ్వరేతుఁడు** సం. విశే. స్.

అధఃపతనము లేని రేతస్సు గలవాఁడు.

క. సుతు లనఘులు వేవురు దమ, యుతులై యుదయించి సాంఖ్య యోగాభ్యాసోన్నతిఁ జేసి ముక్తులై భూరితేజు లందఱు నూర్ధ్వరేతసులైనన్. ఆది. 3-60

తే. ఉత్తమాశ్రమ నిష్ఠితుఁ డూర్ధ్వరేతుఁ, డైన కణ్వ మహాముని
యనఘ చరితుఁ, డట్టి మునికెట్లు గూఁతురవైతి. ఆది. 4-32

**ఊర్ధ్వలోకము** సం. వి. అ. పుం.

1. స్వర్గము.

మ. అనుమానింపకు తోడఁబుట్టువులు గారా తున్మి తూఁటాడె
నెం,దును గ్రొన్నెత్తురు లేఱులై పఱవ నింద్రుం డుగ్రతన్ దైత్యు
లన్, మును లద్వేరు భజింపరే క్రతువు లామోదంబుతో నమ్మహా,
త్మని జేయింపరె యూర్ధ్వలోక మది కాదో యేలఁడో నాకమున్·
శాంతి. 1—282

2. పైనుండు లోకము.

తే. శరణు సొచ్చిన రక్షింపఁ జాలి యుండి, కడపి పుచ్చిన నూర్ధ్వ
లోకములు దప్పు, ఉద్యో. 1-161

**ఊర్ధ్వశ్వాసము** సం. వి. అ. పుం.

ఎగరొప్పు, పైశ్వాస, శ్లేష్మ రోగము.

క. కతు కకు నడ్డపడు నూ,ర్పొత్తిలి పోనీక యూఁగు నూర్ధ్వశ్వాసం,
బెత్తఁగఁ జేయును శీవుఁ, డ త్తమవున నుండనేర కంకట వెడలున్.
అశ్వ 1-178

**ఊర్ధ్వాలకములు** సం. వి. అ. పుం. న. బహు.

తల వెంట్రుకలు

సీ. పాంసుజాలములు పై, బ్రాఁకినఁ గరము రూక్షములగు నూర్ధ్వాల·
కముల దాని. అర. 2-102

**ఊర్పు** దే. వి.

ఊపిరి.

ఉ. ... మీ, ముక్కున నూర్పు గల్గ నొక మూర్ఖుని చేఁబడితిన్·
సిఖాస్థలిన్. విరా. 2-296; భీష్మ, 2-118, శల్య. 1-857

2. నిశ్వాసము.

వ. అవి భంగించి యూర్పులు నందడింప మొగంబు విగువారం గ్రోధ
శోకంబులు మనంబునఁ బెనంగొనం గన్నీ రొలుక నూరకున్న

నెల్లవారు నతనికి మాఱు పలుకను దేఱి చూడను వెఱచి యుండిరి. ద్రోణ. 2-269

**ఊర్పుగాడ్పు** దే. వి.

నిశ్శ్వాస వాయువు, నిట్టూర్పు గాలి.

తే. ... తఱచు, టూర్పు గాడ్పుల పరిమళ ముల్లసిల్ల. విరా. 2-288

**ఊర్పుపోవు** దే. అ. క్రి. (ఊర్పు + పోవు)

ఊపిరి యాడు.

వ. అంజుడు జగంబులు సృజియింప జంతు సంతానంబు పెరిగి సమ్మర్దం బధికంబై యూర్పుపో వని యట్లైన. శాంతి. 5-209

**ఊర్మి** సం. వి. ఇ. పుం. (స్త్రీ).

1. అల

క. వీరాస్థి శర్కరా ఘన, భేరీమడూక గవచ పృథు లోర్మి రథ, స్ఫారావర్త గజ మకర, ఘోర మహిమ రక్త నదులకుం దగియె నృపా. ద్రోణ. 1-295

2. బుభుక్షాది షడూర్ములు- 1) బుభుక్ష, 2) తృష్ణ, 3) శోకము, 4) మోహాము, 5) జర. 6) మరణము.

క. దుర్మతు లామిషగత మగు, కర్మము వాటించి బంధ కలితులగు దుర, ర్వ్యూర్మి గడచి సువిచారులు, నిర్మమతను ముక్తి వడయ నేర్తురు వత్సా. శాంతి. 1-125

**ఊర్మిమాలిని** సం. వి. ఈ. (స్త్రీ).

పుణ్య తీర్థమైన ఒక నది.

సీ. సప్త దినంబులు చంద్ర భాగను విత, స్తను మూర్మిమాలిని దగ వసించి, యాహార విరహితుండై యుండ మునిసమానుం డగు. అను. 2-27

**ఊర్వశి** సం. వి. ఈ. (స్త్రీ).

ఉర్వశి, ఒకానొక అప్సరస, స్వర్గ వేశ్య.

ఈమె పురూరవుని భార్య, పురూరవుని వలన ఈమెకు 1) ఆయువు

తురె యిట్టి యూఱట మదిం బ్రియమంది యుధిష్ఠిరుండు.
ఉద్యో. 3-101

చ. ...మా దెస గప్ప యెలుంగుఁ దామవై, యునికి యెఱుంగ వచ్చె నటు లూఱటగా వరమిచ్చినాఁడవో. ద్రోణ. 3-107

విణ.

విశ్రాంతి నిచ్చునది. సహాయము.

తె. మాటిమాటికిఁ బరికించి మందడీల కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్తు. విరా. 1-95

**ఊఱటపట్టు** దే. వి.

విశ్రాంతినిచ్చు తావు.

ఉ. నీ వలమూఁపు లావు మును నేల వహించిన నాగకూర్మ గోత్రావనిభృద్దిశాకరుల భారయ నూఱటపట్టుగాదె. విరా. 2-198

**ఊఱడంబలుకు** దే. అ. క్రి.

మనశ్శాంతి గలుగు నటుల మాటాడు. చిత్తస్వాస్థ్యము గలుగ మాటాడు.

వ. కృతవర్మ పాలికిం బోయి యాతం డొక్క యక్షౌహిణితోడఁ దన్నుం గలయ వచ్చువాఁడయి యూఱడం బలికినఁ బ్రియంబంది,
ఉద్యో. 1-84

**ఊఱడించు** దే. స. క్రి.

ఊఱడఁ జేయు.

1. ఓదార్చు.

ఉ. ...అతి వత్సలభావముఁ బొంది యావరార్థ్యులకు చూడ్కితోఁ బ్రియహిత స్థిర భావల నాదరింపవే. విరా. 1-188

వ. అతని యంతరంగంబునకుం దెలివును నంగంబునకు దప్పిలేకుని కియు నొసంగి విష్ణు ప్రసాదంబునఁ బ్రశాంతవన్నుండ వగు మని యూఱడించి యరిగిరి. శాంతి. 6-374

ఆ. ...మత్స్య నందనయు, నూఱడింపఁ బడియె నొక్కనాఁడు నీ చేత
అశ్వ 3-170

సీ. సమయ కాలము సన్నఁ జని సుయోధనుఁ బంపి, భోగంబులను

బహు త్యాగములను, యాగంబులను సద్విహారముల్ సలుపుద
మని యూఱడింపవే. శాంతి. 1-89

2. చిత్త స్వాస్థ్యము గల్గించు.

క అనినఁ గిరీటికి హరియిట్లను నీ దగు కోర్కి దీర్చుటకి నాకు
వ్రతం, బనఘా తగ సారథ్యం, బొనరించెద నీకు నసమ యుద్ధ
క్రీడన్. క. అని యూఱడించి నరుఁడో డ్కొని ధర్మ తనూజు నొద్ద
కుం బ్రియ మెసఁగం, బనుదెంచె. ఉద్యో. 1-89, 90

వ. ...(భీష్ముఁడు) ఏసీ రాత్రి యేకాంతంబున దర్భశయనంబున
నుండి భూసురవర్గంబులం దలంచి భక్తిం బ్రణామంబులు సేసి
పరశురాముని జయింపరాదయ్యెడు దినంబులు పెక్కులు సనియె
నతని నాజి జయించుట గలుగునేని మీరు నాకుం దోఁచి యూఱ
డింపవలయునని ప్రార్థించి నిద్రించుచుండ. ఉద్యో 4-388

ఊరడిలు; ఊరడిల్లు దే. అ. క్రి.

1. ఉపశాంతి నొందు

వ మఱియు తేజో విశేషంబున స్ఫురుహూతున కుత్సాహంబు సంభవింపం
గల యది యొప్పు డనాయాసంబునఁ బగతు వధియి ప నగుటని
గిరాందరుం డూఱడిలం బలికిన బలసూదన ప్రముఖ నిఖిల సుర
లోకంబును సంతసిల్లె. ఉద్యో. 1-133

వ. వాసుదేవుం డింత యావంతా వలన దమ్మాటలు విడువుమని యూఱ
డిల్ల బలికి దుర్దశల నలందురు నవ్వేలంది కుందు నాపం దలంచి
యిట్లనియె. విరా 2-283

(అకాడమి ప్రతి ఊరడిల్లు-సం. ము. అనంత—ఊఱడిల్లు)

క. అని యూఱడిలంగఁ బలిగిన, విని యంకిలి దేఱు చిత్తవృత్తి గలుగు
నంగిన. ఉద్యో. 2-125

ఆ. అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి నూఱడిల్లఁ బలికి యునిచి
పోసరె. విరా 1-880

2. స్వస్థమగు, స్వస్థచిత్తమగు.

ఆ. పగయ కలిగెనేనిఁ బాయున్న యింటిలో, మున్నయట్ల శాక యూఱ

డిల్లియుండు నెట్లు చిత్త మొకమాటు గావున, వలవ నధిక దీర్ఘ
వైర వృత్తి. ఉద్యో 3-20

క. అని యూఱడిల్లఁ బలికిన, విని యనఘు గలంకు దేఱి విభుఁడుం
డాముం, అని సంగ్రామోత్సాహం బునఁ బొదవిరి తూర్య ఘోష
ములు దివి ముట్టన్. ద్రోణ. 3-22

ఆ. ఏను నిలిచినట్లకా నూఱడిల్లు నీవున్న నన్న రేశ్వరోత్తముండు.
ద్రోణ 3-23

3. రాణించు, శోభిల్లు.

ఆ క్షుద్ర జంతువులకు గురులకు నెమ్మెయిఁ, దలఁప నొక్కరూప
తల్లి వలయు, నూఱడిల్లఁగఁ జదె యొండు నోటుల సువస్తువు నివాస
మైన చోటఁగాక. శాంతి. 5-276

ఊఱడు దే. అ. క్రి. ఊరడిల్లు

1. విరమించు, ఊరకుండు.

క. కాఱడవిఁ బఱచు మృగముల, నూఱడనీ తగిచి ఆది. 4-19

వ. కృతవర్మ యతనిం దాఁకి

క. ఆఱమ్ము లతని మేనం, దూఱంగా నేసి నాల్గు తురగాంగములన్
గీలించి నఁగని ద్రోణుం, డూఱడి ధర్మజుని దెసకు నుమ్ముఖు
డయ్యెన్. ద్రోణ. 4-12,13

2. ఉపశాంతి పొందు.

క. అనివఁ గడు శౌర్యయుని నెమ్మనమున నూఱడి పేదు, డమానుష
తేజో, ధనుఁడగు నవాదేవుఁ గనుఁగొని యిట్లను. విరా 1-97

క. అతివ తెగువమ్మ నీగ్రువా, మతి నిర్మల చరిత భగన మునీ యీ
యెడ మన్పతులయున్నిధి నైనను, మతి నూఱడి యొక చోట
మన్నన దప్పన్. విరా. 2-24

3. స్వస్థమగు, స్వస్థచిత్తమగు.

క. ఉత్సాహంబున శత్రుక, లోత్సాహ విధి రయోర్చి యున్నత
సామ్రాజ్యోత్సవము నొందు పుత్రుల, మత్సారం బూతుగాక
యూఱడు మింకన్. ఉద్యో 3-206

క. పొంతకు వచ్చిన వానిన, కాంతునిఁగాఁ గొనుచు నొరునిఁ గాంచిం
పతి యే నెంతయు నూఱడి మనమున, జింత యొకఁడు లేకయున్నఁ
జెందు సుఖంబుల్ శాంతి. 4-18

క. అన్న సహదేవ నీవును, నన్నలతో నరిగెదయ్య యట యడవులకి,
వున్నను సుతులందఱు నిం,దున్నట్టుల నాకుఁ జిత్త మూఱడి
యుండున్ సభా. 2-288

**ఊఱార్చు** దే. స. క్రి. (ఊరార్చు)

ఓదార్చు.

వ. అయ్యాక్రందనధ్వని విని సంభ్రమించి సోమకుం డంతఃపురంబు
నకుం జని కొడుకు నూఱార్చి. ఆర. 3-210

**ఊష్మ; ఊష్మము** సం. వి. అ. న్. పుం.

1. వేడిమి.

శా. ...శస్త్రాగ్నిస్రుణా, లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రంబు
విరా. 4-52

క. గందున రాధా తనయుఁడు, రెండు దినంబులు పెనంగి గ్రీష్మ
సమయ మూ,ర్యుండుంబోలె వెలింగెడు, గాండివధరు శరకరోష్మఁ
గ్రాఁగె నరేంద్రా. అశ్వ. 3-124

2. ఉమ్మ, ఉక్క.

సీ. ...అలిని వా,హాయమును గమగొను నప్పు, డగ్గలంపు సందడి
నూష్మ జనింప నానంబులు. అశ్వ. 4-2

**ఊష్మలత** సం. వి. ఆ. స్త్రీ.

తేజస్సు, పరాక్రమము.

క. పావక శాంతత్వము సిజ,భావంబున నూష్మలతయుఁ బ్రకటంబు
లుగా, నా విధుఁడు మనుజ వేషుం,డై వచ్చెనొ శిఖిశరీర యయ్యె
నో యనఁగన్. విరా. 1-274

తే. అంతఁ జందంబుఁ బురుష సమాకృతియును, గలిగియున్నది
యొప్పు నూష్మలత సొంపు, వికృత వేషాకృతంబులై వెలయ

కితఁడు, నీవులు కపిసిన మెఱయని నిప్పువోలె విరా. 4-75

**ఊష్మలత్వము** సం. వి. అ. న.

పరాక్రమము.

క. అనిన విని యింద్రాంశ సంజనితత్వ కలిత తేజోధనుఁడగు నర్జునుఁ జయుఁడు దన యూష్మలత్వంబున సవ్యాక్ష్యంబులు దుస్సహంబులై సం బదరి దరస్మితంబున దధ్వికారంబుఁ గప్పి యవ్విధమిటేని కిట్లనియె భా. 8. 1-47

శ్లో. దర్శయ స్వైంద్రి రాత్మాన మ్యుగ్ర ముగ్రపరాక్రమః.
సం. భా. శాం. 8. 5-2

**ఊష్మలము** సం. విణ. (అ. ఆ. అ.)

వేండ్రమైనది తీక్ష్ణమైనది.

వ. ఉదాత్త బ్రాహ్మణ నిధియైన భార్గవాన్వయమున ... పవిత్ర చరిత్రుండగు పరశురాముండు ... చుటయు, ... క్షత్రియాత్వ మహోష్మలంబై ... బ్రాహ్మణ్య విశ్రుతుండైన విశ్వామిత్రుం ... చుటయును నది యెట్లొకో. అ... 2-291

**ఊష్మలుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

వేఁడిమి గలవాఁడు.

క. భీష్ముని గర్వంబు డిపి మహోష్మలుఁడై ... గవేండ్రుడు ద్రోణుల కెల్లన్, గ్రీష్మాదిత్యుని క్రియ ... వర్ధిష్ణుత్వము ... నూపి ... సేనలు దెరలన్. ద్రోణ. 2-218

**ఊష్మాయితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉష్ణకరమైనది వేఁడిమి కలిగించునది.

క. వాయువు చేష్టారూపము, ప్రేమో యునెడ నభంబు గవము మునిశ్వర జలమూష్మాయితమనలము గ ... ష్మాయితము ధర ... యిటులైదు దెఱంగుల్. శాం. 8. 4-86

**ఊహ** సం. వి. ఆ. స్త్రీ. (ఊహము)

అపూర్వార్థము నుత్ప్రేక్షించుట. ఊహించుట. ఏదేని విమర్శించి నిర్ణయించుట.

వ. నీవును శుశ్రూషా శ్రవణ గ్రహణ ధారణోహాపోహార్థ విజ్ఞాన తత్త్వజ్ఞాన సమన్వితుండవు. ఆర. 1-33

**ఊహము** సం. వి. అ. పుం.

వితర్కము, అపూర్వార్థము నుత్ప్రేక్షించుట, ఊహించుట.

క. ...సకలవేదో, హాపోహాతీత సార హరిహరనాథా మహా. 1

**ఊహించు** సం. స. క్రి.

1. వితర్కించు, ఆలోచించు.

క. పారాశర్యుని కృతియయి, భారతమను పేరఁ బరఁగు పంచమ వేదం, బారాధ్యము జనులకుఁ ద,ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్.

తే తెనుఁగు బాస వినిర్మింపఁ దివురుట. విరా. 1-17, 18

క. మన గస్త్రాస్త్రంబులు గ్రక్కిన యవి యొక్కభంగి వీటికిని గాండి వము,గొని పోయితిమేని సుయో,ధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్. విరా. 1-158

2. తెలిసికొను.

వ. ఇట్లు దాన తమరిఁబున వడిగొనుచు నప్పుడయ్యంగన యింగితం బూహింప నెరవు మాలి మఱియును. విరా. 2-46

3. తలఁచు.

వ. లయిన నా నేర్పుకొలందిఁ దగిన తెఱంగున వారించి చూచెదం గాక యని యూహించి యిట్లనియె. విరా. 2-63

4. అనుమానించు.

క. భరమున నీ పోరెదు నెదఁ, బరమ విషాదంబు నీకు బలిమి మెఱసి యు,ద్ధుర వృత్తి జయము గొనినం, బరితోషము బొందు నన్ను భావించి మదిన్.

వ. ఊహించి సుదేష్ణయుఁ దత్పరిజనంబులుం దమలోన

క. వలలుని దెస మలిని చూ,డ్కులు తెఱఁ గెడవొందుఁ దెలిసెడుం గంటిరె వీరలు వచ్చిన సమయంబును, దలఁపఁగ నొక్కటియ

యువిద్ధం బెట్టొక్కం. విరా. 2-198, 199, 200

"శ్లో. క్రుద్ధయంతి మాం చ సం ప్రేక్ష్య సమశంకత మాం త్వయి"

సం.భా. విరా. 19-12.

5. ప్రశంసించు.

వ. అవిద్ధంబునం గవ్వడి యాదుర్నివార సాధనంబు వారించుట నాలో కించి యమ్మునీశ్వరు లమ్మహాపాశుపతాస్త్రంబు నూహించిరి. సౌ ప్తి. 2-78.

6. మనస్సునం జాదుకొల్పు, దృఢబుద్ధి సేసికొను.

తే. మాతృపితృ దారపుత్రక భ్రాతృ కాంత,వ్యాసనంబులు సంసృతి నముభవింపం, బడియె విందులో నెవ్వరి కడలునాండు, నరుం డనిత్యత యూహించు టరయ నంఋవు. శాంతి. 1-218

7. పాటించు.

క. సంపద లేమికి మది శోకింపవు శత్రువుల చేకని లోనగు టూ, హింపవు సిమ నూరకునికి, పెంపని పాటించె దిట్టి లేవున వే. శాంతి. 4-870.

# ఋ

ఋక్కు సం. వి. చ్. స్త్రీ.

ఋగ్వేదము.

వ. ఋగ్యజుః పఠన రవంబులును సామగాన నాదంబులును.

స్త్రీ. 2-172

ఋక్ష సం. వి. ఆ. స్త్రీ.

అజమీఢుని ముగ్గురు భార్యలలో నొకతె. ఆది. 4-101

**ఋక్షము** సం. వి. అ. పుం.

ఎలుఁగు గొడ్డు.

వ. పౌర వాన్వయ ప్రభవుండగు విదూరథ సుతుండు ఋక్షవత్పర్వతంబున ఋక్షంబులు చేత రక్షితుండగుటయు. శాంతి. 2-92

**ఋక్షవంతము** సం. వి. అ. పుం.

కుల పర్వతము.

ఆ. మలయ మనఁగ శక్తిమంతంబు నా వింధ్య, మనఁగ పారియాత్ర మన మహేంద్ర, మనఁగ ఋక్షవంతమన సహ్యామన నిందు, గుల నగంబు వేడ వొలుచు నధిప, భీష్మ. 1-84

**ఋక్షవత్పర్వతము** సం. వి. అ. పుం.

ఋక్షవంతము అను కులపర్వతము. చూ. ఋక్షవంతము,

**ఋక్షుఁడు** సం. వి. అ. పుం.

ఋచీకునకు అంగిరాయైన సుదేవయను దానివలనఁ బుట్టినవాఁడు ఆది 4-2

**ఋగ్వేదము** సం. వి. అ. పుం.

నాల్గు వేదములలో మొట్టమొదటి వేదము.

సీ. వినుము ఋగ్వేదాది వేదముల్ నాలుగు. శాంతి. 3-119

**ఋచీకుఁడు** సం. వి. అ. పుం.

ఒక మహర్షి -ఈయన భార్య గాధిరాజు అని పేర్వడసిన కౌశికుని కుమార్తెయగు సత్యవతి. కుమారుఁడు పరశురాముని తండ్రియగు జమదగ్ని

ఈయన చరిత్ర ఆదిపర్వమునందును, శాంతి పర్వమునందును అనుశాసనిక పర్వమునందును గలదు. ప్రధాన కథాంశములన్నియు సరిపోవుట చేత ఈ మూఁడు తావులఁ జెప్పఁబడిన వాఁడొక్కఁడే యనుటకు సంశయము లేదు. ఆది. 3-70; శాంతి. 2-68 మొ. 71- వఱకు; అను. 1-104 మొ. 118 వఱకు.

సీ. విగళాముఁడైన యాభృగునకుఁ బుత్రుఁడై, చ్యవనుండు పుట్టె భార్గవ వరుండు, జనవంద్యుఁ డతనికి మను కన్యకకుఁ బుట్టె, నూరుజ నౌర్వుండు భూరికీర్తి, యతనికి నూర్వురు సుతులు

ఋచీకాదు, లుదయించి రఖల భూవిదిత తేజులందు ఋచీకున
కొందంగ జమదగ్నియను ముని పుట్టె నాతనికిఁ బుట్టి-ఆ- రలఘు
మతులు సుతులు నలువురు వారిలోఁ, బరశురాముఁ డాది పురుష
మూర్తి ఆది 3-70

దీనినిబట్టి చ్యవనుని కొడుకు ఔర్వుఁడు. ఔర్వుని కొడుకు ఋచీ
కుఁడు, కాన ఋచీకుఁడు చ్యవనుని పౌత్రుఁడు.

ఆ. చ్యవన నందనుండు సత్యవతీ గర్భ,భంగి సూచి యగ్రబ్రాహ్మ
ణుఁడు, గాఁడు తరుణి నీదు కడుపులోపలిబిడ్డ, క్రూరుఁడైన
రాచకొడుకు గాని. అను. 1-118

దీనినిబట్టి ఋచీకుఁడు ఆదిపర్వకథలోవలె చ్యవనుని మనుమఁడు గాక
కొడుకు అని తెలియుచున్నది. ఒకదాని కొకటి అసంగతముగా నున్నది.
సంస్కృత భారతమునందుఁ గూడ ఈయసంగతి యిట్లే కలదు.

శ్లో. అన్వయుత్పాదయామాస పుత్రం భృగు ర్నిందితమ్।
చ్యవనం దీప్తతపసం ధర్మాత్మానం యశస్వినమ్॥
య స్సరోషాచ్చ్యుతో గర్భాన్మాతు ర్మోక్షాయ భారత।
ఆరుషీతు మనోః కన్యా తస్య పత్నీ మనీషిణః॥
ఔర్వ స్తస్యాం సమభవ దూరుం భిత్త్వా మహాయశాః,
మహాతేజా మహావీర్యో బాల ఏవం గుణై ర్యుతః॥
ఋషీక స్తస్య పుత్రస్తు జమదగ్ని స్తతోఽభవత్।
జమదగ్నేస్తు చత్వార ఆసన్ పుత్రా మహాత్మనః॥
రామ స్తేషాం జఘన్యోఽభూ దజఘన్యై ర్గుణై ర్యుతః॥
సం. భా. ఆది. 66-46,47,48,49,50

ఇందు 'ఋషీకుఁడు' అని చెప్పి యున్నను అతఁడు ఋచీకుఁడు తప్ప
మఱొకఁడు గాఁడు, కొన్ని సంస్కృత ప్రతులలో ఋచీకుఁడనియుఁ గలదు.

శ్లో. కుశిక స్యాత్మజః శ్రీమాన్ గాధి ర్నామ జనేశ్వరః
అపుత్రః ప్రసవేనార్థీ వనవాసముదావసత్॥
కన్యా జజ్ఞే సుతా తస్య వనే నివసతస్సతః.
నామ్నా సత్యవతీ నామ రూపేణాప్రతిమా భువి॥
తాం వవ్రే భార్గవః శ్రీమాంశ్చ్యవన స్యాత్మసంభవః।
ఋచీక ఇతి విఖ్యాతో విపులే తపసిస్థితః॥
సం. భా. అను 4-6,7,8 శ్లో.

శ్లో॥ దృష్ట్వా గర్భ మనుప్రాప్తాం భార్యాం స చ మహర్షిః
ఉవాచ తాం సత్యవతీ దుర్మనా భృగుసత్తమః॥ అను 4-36 శ్లో॥

మూలము నందున్న వ్యత్యాసమే ఆంధ్రీకరణము నందును గనఁబడుచున్నది. ఎవరిపాటికి వా రున్నదున్నట్టు లాంధ్రీకరించిరి.

**ఋజువు** సం. విణ. (ఉ. ఉ. జ్వీ. ఉ.)

సరియైనది, తగినది, యుక్తమైనది, కపటము లేనిది.

క. విమలీ తంత్రంబులకెల్లను నరయఁ బరాయణం బలఘుతర సంవి,
త్తముఁడగు నారాయణుఁడ య,తనిఁ బొందఁగ ఋజువులగు
పథము లివి యధిపా. శాంతి. 6-516.

**ఋణము** సం. వి. అ. న.

1. అప్పు-ఇది ధనరూపముననే గాక ఉపకారము నను నుండవచ్చును

ఉ. ఏ నిధి నీఁగువాఁడ ఋణ మెయ్యదియే,వియు వేఁడు డచ్చెదన్.
విరా. 3-232

(భీష్ముఁడు దుర్యోధనునితో)

క. మును నదివేవురఁ జంపుదు,నని యిచ్చిన మాట వచ్చె నవనీశ్వర నీ,
మన్నించిన ఋణంబు దీర్చితి విను లావిటమీఁగఁ గలుఁగు విధమై
తోఁచెన్. భీష్మ. 3-319; శాంతి. 4-245

2 దేవఋణము, పితౄణము, ఋషిఋణము అని మూఁడు విధములు.
శాంతి 5-80.

ఋణములు అయిదు.

1 దేవఋణము = ఇది యజ్ఞములు చేయుటచేఁ దీఱును 2. ఋషిఋణము = ఇది వేదాధ్యయనమువలనఁ దీఱును. 3. పితౄణము = ఇది శ్రాద్ధములు పెట్టుటవలనఁ దీఱును 4. అతిథి ఋణము = ఇది అతిథ్యభ్యాగత పూజలవలనఁ దీఱును 5. నరఋణము = ఇది సద్వ్రతములు ఆచరించుటచేఁ దీఱును. శాంతి 5-484

శ్లో. దేవతాతిథి భృత్యేభ్యః పితృభ్య శ్చాత్మన స్తథా,
ఋణవాన్ జాయతే మర్త్య స్తస్మాదనృణతాం వ్రజేత్.

శ్లో. స్వాధ్యాయేన మహర్షిభ్యో దేవేభ్యో యజ్ఞకర్మణా,
పితృభ్యః శ్రాద్ధదానేన నృణా మభ్యర్చనేన చ॥

శ్లో. వాచా శేషావహార్యేణ పాలనే నాత్మనోఽపి చ, యథావద్భృత్య
వర్గస్య చికీర్షేత్కర్మ ఆదితః సం. భా. శాంతి. 298-9,10,11

పరఋణమే ఆత్మఋణము. పూర్వజన్మ సంచిత కర్మఫలము సద్వ్రతాచరణముచే తక్కువ చేసికొనవచ్చును.

**ఋతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పూజింపఁబడినది, లీనరూపమైన బుద్ధిచే సంప్రాప్యమగు తత్త్వము.
   సీ. వేద తత్త్వంబన విదితంబునౌ ఋతంబనఁగ నిత్యంబన నశితయిల్లు.
   శా. తి. 6-845
2. సత్యమైనది. (వ్యతి-అనృతము)
   క. వారికి ధర్మువు దప్పని, వారికి ఋతవచనులైన వారికి.
   అగ, 1-879

**ఋతుకాలము** సం. వి. అ. పుం.

స్త్రీ వెలుపలఁ జేరిన దినము మొదలు పదాఱవదినము వఱకుఁ గల కాలము ఇది గర్భధారణమునకు యోగ్యమగు కాలము.

["ఋతుస్తు ద్వాదశ రాత్రం భవతి దృష్టార్తవః అదృష్టార్తవాప్యస్తీత్యేకే భాషన్తే। (సుశ్రుతము శారీరస్థానము, తృతీయాధ్యాయము 5 సూ.] దృష్టార్తవయగు స్త్రీకి ఋతుస్నానము చేసిన దినము మొదలు పండ్రెండు దినములు ఆర్తవము (ఋతు రక్తము, రజస్సు) గనఁబడుచుండును. కావుననే యా పండ్రెండు దినములు ఋతుకాల మనియెదరు.

'ఋతుష్షోడశ రాత్రయః -' అని గ్రంథాంతరమునఁ గలదు. మొదటి మూఁడు దినములును చివరి పదునాఱవ దినమును రజస్సు కనఁబడుచున్నను గర్భ ధారణమున కనర్హము లైన దినము లగుటచే ఋతుకాలము పండ్రెండు దినములని సుశ్రుతుఁడు నిర్వచించెను. ఆ కాలమున రజస్సు ఒకప్పుడు కనఁబడక పోవచ్చును. కనఁబడకున్నను అది ఋతుకాలమే యగును.

శ్లో ద్వాదశాద్వత్సరా దూర్ధ్వ మాపంచాశత్సమాః స్త్రియః
మాసి మాసి భగద్వారా ప్రకృత్యైవార్తవం స్రవేత్॥
ఆర్తవస్రావదివసా దృతుష్షోడశరాత్రయః।
గర్భగ్రహణయోగ్యస్తు స ఏవ సమయస్స్మృతః॥

సర్వాసామేవ చతుర్వర్ణ స్త్రీణాం సర్వవాది సమ్మతః పూర్వోక్త స్సమయః

(భావ ప్రకాశ - పూర్వ ఖండము — ద్వి.ప్ర 1, 2 శ్లో)

పండ్రెండు సంవత్సరముల వయస్సు దాటిన తర్వాత ఏబది సంవత్సరముల వఱకు స్త్రీకి ప్రతిమాసమునందు భగద్వారము నుండి స్వభావముగనే ఆర్తవము స్రవించు చుండును (పదాఱేండ్ల లోపు గలుగుట అస్వాభావికము) ఆర్తవ స్రావ దినము మొదలు పదునారు రాత్రుల వఱకు ఋతు కాలము. ఈ కాలమే స్త్రీ గర్భమును ధరించుటకు యోగ్యమగు కాలము. ఈ పదునాఱు రాత్రులును నాల్గు వర్ణముల వారికి ఋతు కాలమని సర్వ సమ్మతమైనది.

[గ్రంథాంతరే తు విశేషః, తద్యథా - స్నానదివసా దూర్ధ్వం ద్వాదశ రాత్రావధి బ్రాహ్మణ్యాః, దశరాత్రావధి క్షత్రియాయాః, అష్ట రాత్రావధి వైశ్యాయాః; షడ్రాత్రావధి శూద్రాయాః, గర్భధారణే శక్తిః (భావ ప్రకాశ).

అత ఊర్ధ్వం ఋతు ర్ద్వాదశాహం బ్రాహ్మణానామ్, ఏకాదశాహం క్షత్రియాణామ్, దశాహం వైశ్యానామ్, నవరాత్ర మితరాణామ్ - ఋతుర్బీజకాల మవేతత ఇత్యాహు ర్మహర్షయః - (కౌమారభృత్య తంత్రము - ప్రథమాధ్యాయము.)]

సీ. ఋతుకాలమున నాత్మసతియంద రతి సల్పు భవ్యశీలుఁడు సదా బ్రహ్మచారి. శాంతి. 4-868; అను. 1-110

**ఋతుపర్ణుఁడు** సం. వి. అ. పుం.

అయోధ్యాపుర రాజులలో నొకడు - ఇతని యొద్దనే నలుఁడు బాహుకుఁడను పేరుతో వంటలవాఁడుగ నుండెను. ఇతఁడు నలునకు అక్ష హృదయము నుపదేశించి యతని వలన అశ్వ హృదయమును బడసెను.

మధ్యాక్కర - ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁ డనెడు మహీశుఁ డిక్ష్వాకు, కులమందు నీకు పేర్కొండగు. అర. 2-123-220

**ఋతుపుష్పరసము** సం. వి. అ. పుం.

ఋతురక్తము, ఆర్తవము, రజస్సు,

వ. గర్భ యోని యందు ఋతు పుష్పరస సంయుక్తం బగుచు. రేతంబు గాదు చేతం బ్రేరితంబయి కలసిన ఆది. 8-221

**ఋతుమతి** సం. వి. ఈ. స్త్రీ.

1. ఋతుకాలము నందలి స్త్రీ - ముట్టుతయైనది మొదలు పదాఱవ రాత్రి వఱకు కాలము గడపు స్త్రీ

సీ. అధిప రజస్వల నంటుట కేల్మెవ, మూ చరిత స్నాతయైన సతిఁ జతుర్థ దినంబున దోషాసమయమునఁ బొందఁగఁదగు నంద్రు గొంత భార్యలు - తే. ... ఋతు శక్తి యెడల కుండఁ, బెట్టి కార్యము గల్గిన ఋతుమతీ సమాగమము దప్ప నీకున్న నాయి వెక్క.
అను. 4-126

2. ముట్టతయై స్నానము నేసి పదాఱవ రాత్రి లోపం కాలము గడపు స్త్రీ.

వ, ఋతు మతియై యున్న తన దేవి సుదేష్ణ యను దాని మన్నించిన (చూ. ఋతుకాలము) ఆది. 4-232

3. పుష్పవతి, రజస్వల.

సీ. ఋతుమతి గాక శుద్ధతయుఁ గల్గిన యువతి, కన్య. అను. 5-285

**ఋతువు** సం. వి. ఉ. పుం.

1. రెండు నెలల కాలము. (ఋతువులు ఆఱు. 1. వసంత ఋతువు, 2. గ్రీష్మ ఋతువు, 3. వర్ష ఋతువు, 4 శరదృతువు, 5. హేమంత ఋతువు, 6. శిశిర ఋతువు)

వ. అయ్యార్వురు ఋతువులు. అను. 2-218

తే. దినము రాత్రియు ఋతువులు మనుజులు చేయు, సుకృతమును దుష్కృతమును జూచుచుండు. అను. 2-214; కర్ణ. 1-281

2. ఆఱు అను సంఖ్య.

తే. ఋద్వయర్తు గుణంబులు. శాంతి. 5-46.

3. స్త్రీ రజస్సు. అను. 4-126

తే ... ఇట్టులు షోడశంబు దాఁక నెల్ల నాఁడును ఋతుశక్తి యెడల కుండ అను. 4-126

**ఋతుస్నాత** సం. వి. ఆ. స్త్రీ.

ఋతుస్నానము చేసిన స్త్రీ, రజస్వలయై నాలవ దినమున స్నానము చేసిన స్త్రీ.

మ మదిఁ గారుణ్యము సేసి విప్రవరుఁ డీ మంత్రంబు నాకిచ్చెనే,
నిది యే చందమొ చూతునంచు నొకనాఁ డిచ్చన్ ఋతు
స్నాతయై, సుదతీ రత్నము. ఆర. 7-324

**ఋత్విక్కరణము** సం. వి. అ. న.

ఋత్విక్కు చేయు కార్యము.

వ. అమ్మరీచ్యాది సప్తసంఖ్యులును మఱియునుం దత్సములగు మహానుభావులును ఋత్విక్కరణంబు లాచరించిరి. శాంతి. 6-361

**ఋత్విక్కు** సం. వి. జ్. పుం.

ఋత్విజుఁడు, చూ. ఋత్విజుఁడు.

సీ. ... దేవతలకుఁ దృప్తి, యగు నట్లుగా ఋత్వి గర్చన మొప్పఁగాఁ గావించునది. అను. 5-198; ఆశ్వ 4-187

**ఋత్విగాధ్యుఁడు** సం. వి. అ. పుం.

ఋత్విక్కులలో ప్రధాన నిర్వాహకుఁడు.

క. విను ఋత్విగాధ్యుఁ డగు న, మ్మునిపతి యట్లు కురువంశముఖ్య. డొసఁగ మేదిని సంప్రమోదమునఁ గై, కొని యిట్లను దానవేంద్ర కుంజరుతోడన్. అశ్వ. 4-186

**ఋత్విజుఁడు** సం. వి. జ్. పుం.

యాజకుఁడు.

(యజ్ఞకర్తచేత దక్షిణ పుచ్చుకొని) యజ్ఞము చేయించు బ్రాహ్మణుఁడు (హోత, ఉద్గాత, అధ్వర్యువు, బ్రహ్మ-అను వీరు నలువురు వీరిలో ఒక్కొక్కనికి ముగ్గురు చొప్పున బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రా

వరుణుఁడు, ప్రతిస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుఁడు, నేష్ట, అగ్నీధ్రువుఁడు. సుబ్రహ్మణ్యుఁడు, గ్రావస్తుతుఁడు, ఉన్నేత-అని పం|డెండు గురు సహాయ ఋత్విజులు)

క. అనజులు ఋత్విజులుగ నీ,పని యిటు సేయుమని నీ వుపదేష్ట వుగా, విను గురుకుమార పశుపశ.సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్. ఉద్యో. 4-45

సీ. ...అగస్త్యుండు పంౘెడేండ్లు సు వశాలి, రతిఁజేయు మహితాధ్వరమునకు దివ్యానుభావంబుగల యట్టి పరమమునులు, వేడ్క ఋత్విజులయి వెలయ. అశ్వ. 4-261; శాంతి. 8-116; శా. 2-4

**ఋద్ధి** సం. వి. ఇ. (స్త్రీ).

వృద్ధి, పెంపు

క. మహర్ద్ధి భక్త సమాజా. శాంతి. 4-456

**ఋభువు** సం. వి. ఉ. పుం.

వేల్పు, దేవత

క. ఋభువిభు విలోచనాంబుజ, శుభ దరహితా హరిత్వ సుభగ హారశ్యా శాంతి. 6-628

**ఋశ్యము** సం. వి. అ. పుం.

మనుఁబోతు, ఒక జాతి మృగము దీని పాదములు తెల్లగనుండును.

ఆ. వాయు తనయు ఋశ్యవర్ణాశ్వముల మ్రదవతి ధరిత్రిఁ గూల్చె. శల్య. 1-161

**ఋశ్యమూకము** సం. వి. అ. పుం.

పంపా సరస్సునకు దగ్గఱనున్న యొక పర్వతము. సుగ్రీవుఁడు నివసించిన కొండ. ఇచ్చట శ్రీరామ సుగ్రీవమైత్రి జరిగెను.

వ. పంపాభిధానంబయిన సరోవరంబు గలదు. దాని యావల ఋశ్యమూకంబను శైలంబునందు వాలి సహోదరుండు సుగ్రీవుండను వానరుండు సచివచతుష్టయ సహితుండై యుండు. అర. 6-368

(సంస్కృత భారతమునందు 'ఋష్యమూకము' అని గలదు.

శ్లో. ఏషా పంపా శివజలా హంస కారండ సైర్యుతా, ఋష్యమూకస్య
శైలస్య సన్నికర్షే తటాకినీ. సం. భా. అర. 2-78. 44 శ్లో.

శ్లో. తా పృష్యమూక మభ్యేత్య బహుమూల ఫలద్రుమమ్
సం. భా. అర. 279-9

**ఋశ్యశృంగుఁడు** సం. వి. అ. పుం.

ఒక ముని ఋశ్య మృగము కొమ్ముగలవాఁడు.

విభాండకునకి ఋశ్యమృగి (మను బెంటి) యందుఁ బుట్టినవాఁడు. ఇత నికి నెత్తియందొక కొమ్ముగలదు. ఇతని భార్య అంగరాజైన రోమపా దుని కూఁతురు. శాంతయను పేరుగలది. చూ-చరిత్ర.

అర. 8-87; మొ. 118 వఱకు

శాంత దశరథుని కూఁతురు, తల్లిపేరు తెలియదు. దశరథుఁడు తన కూఁతురగు శాంతను తనకు మిత్రుఁడును అంగరాజు నగు రోమపాదు నకుఁ బుత్రిగా నిచ్చెను. శ్రీమద్రామాయణము బాలకాండ. 11 వ సర్గ.

సంస్కృత భారతమున ఋశ్యశృంగుఁడు అని కలదు-శ్రీమద్వాల్మీకి రామాయణమున ఋశ్యశృంగుఁడు అని కలదు.

**ఋషభకూటము** సం. వి. అ. పుం. న.

ఒక పుణ్యతీర్థ ప్రదేశము. ఋషభుఁడను మహర్షి నివాసస్థలము ఇచ్చట దేవ ఋషులు యజ్ఞముచేసిరి. యజ్ఞభూములయందుఁ గుశాకారంబు లైన దూర్వాంకురములు యూపాకారంబులైన వృక్షంబులు గానం బడును. దీనికి హేమ కూటమనియుఁ బేరు గలదు. అర. 8-85

సం. భా అర. 110. అధ్యా.

**ఋషభము** సం. వి. అ. పుం.

1. ఒకానొక పర్వతము జరాసంధుని పట్టణమైన గిరివ్రజమును చుట్టుకొని యున్న యైదు పర్వతములలో నొకటి సభా. 174

చూ. ఋషిగిరి.

2 ఎద్దు

వ. (కృష్ణ భీమ పార్థులు) చైత్యక గిరి శృంగంబున కరిగి యందున్న మూఁడు భేరులం జూపి తొల్లింటి మాగధులు మానుషాదంబను

ఋషభంబు వధియించి దాని చర్మంబున దీనిని నిర్మించిరి.

విరా. 1-175

**ఋషభుఁడు** సం. వి. అ. పుం.

ఒకముని ఋషభకూటము నందుండు వాఁడు.

ఆ. ...ఋష, భాఖ్యుఁడైన తపసి. శాంతి. 3-151

క. ఋషభుండు సుమిత్రుని చిత్తంబు మృగయాశాయత్తంబు గాకుండునట్లుగా బోధించె. శాంతి. 3-168 చూ. వివ, అర. 3-85

**ఋషి** సం. వి. ఇ. పుం.

ముని జ్ఞానముచే సంసార సాగరమును తరించినవాఁడు విరా. 3-150

సప్తర్షులు:- 1. మరీచి. 2. అత్రి, 3. అంగిరసుఁడు, 4. పులస్త్యుఁడు, 5. పులహుఁడు, 6. క్రతువు, 7. వసిష్ఠుఁడు. మఱియొక్కమన్వంతరమున

1. కశ్యపుఁడు, 2. అత్రి, 3. భరద్వాజుఁడు, 4. విశ్వామిత్రుఁడు, 5. గౌతముఁడు. 6. జమదగ్ని, 7. వసిష్ఠుఁడు.

వీరు దేవర్షులు, బ్రహ్మర్షులు, రాజర్షులు అని మూఁడు తెగలు.

మఱియొక క్రమమున 1. మహర్షి, 2. పరమర్షి. 3. శ్రుతర్షి, 4. కాండర్షి - అని నాలుగు తెగలు.

**ఋషికుఁడు** సం. వి. అ. పుం.

అర్కుని అంశమునఁ బుట్టిన వాఁడు.

వ. అర్కుండు ఋషికుండై పుట్టె. ఆది. 3-80

శ్లో. అర్క ఇతఖ్యాతిరిఖ్యాతో యస్తు దానవపుంగవః. ఋషికో నామ రాజర్షి ర్బభూవ నృపసత్తమః.

సం. భా. ఆది. 67-33,34 శ్లో.

**ఋషికుల్య** సం. వి. ఆ. స్త్రీ.

ఒక తీర్థ ప్రదేశము - దీనిని సేవించిన దురితంబులు పోవును.

అర. 2-271

ఇది ఒక నది. అతి ప్రాచీన తీర్థ ప్రదేశము అని సం. భా.

**ఋషిగిరి** సం. వి. ఇ. పుం.

ఒక పర్వతము. జరాసంధుని పట్టణమైన గిరివ్రజమును చుట్టుకొని యున్న యైదు పర్వతములలో నొకటి.

క. గోధమును ఋషభము వై,హారము ఋషిగిరియు, జైత్య కాద్రియు ననఁగా, భూరి గిరు లేను దీనికి, శూర భటుల పోలెఁ గాచి చట్టున నుండున్. సభా. 1-174

**ఋషితర్పణము** సం. వి. అ. న.

ఋషుల నుద్దేశించి చేయు జల తర్పణము.

వ. వాసవ సుతుండు ... ఒక్కనాఁడు ప్రభాతంబు విధిపూర్వకంబు నం గృతాభిషేకుండయి దేవర్షి పితృ తర్పణంబులు సేసి. ఆది. 8-127

**ఋషితీర్థము** సం. వి. అ. న.

ఋషుల కొసఁగు తీర్థము.

కుడిచేతి ప్రేళ్లను గుప్పిలిగా సగము వంచి అంగుష్ఠము తర్జని యను ప్రేళ్ల మధ్య నుండి చిటికెన ప్రేలి దిగువఁగాఁ బడునటుల విడచు జలము.

తే. అంగుళాగ్రము ల్ సిటికెనలందు మొదలు, లనఘ దేవర్షి తీర్థము లనఁగ బరఁగు, వరుస వలకేలి యుప్పలవాయి పై తృకంపుఁ దీర్థఁబు తర్పణ కార్యమునకు. అను. 4-118

# ఎ

**ఎ**[1] ఏ. అవ్య.

**1.** అవధారణార్థకము.

చ. ... పెన్గొదలా, విఱిగి ధరిత్రిఁ బడ్డ యొడ వేగమె వచ్చి శిరంబుఁ దన్నె. కల్కి. 2-887; విరా. 8-134

శా. ... మే, లామై తోఁడనె పోవుఁగాక యని వీరాలాపముల్ పల్కి. విరా. 3-139

2. నిర్దేశమును (చూపుటను) బలపఱచును.

చ. ఇదె యొక పిన్నవాఁ డడరి యొక్కఁడు మూఁకల క్రిందు ద్రోలెడున్. ద్రోణ. 2-11

ఆ. కర్ణు కేతనంబు గ్రాసెను గల్లదె. విరా. 5-70

ఆ. వీఁడె వచ్చుచున్న వాఁడు పార్థుఁడు మన మేమి సేయువారము విరా. 5-181

వ. అదె యంగ సైన్యంబుల్లదె దాక్షిణాత్య సేన. ద్రోణ. 4-12

3. ఆధిక్యమును (ఎక్కువను) తెల్పును.

క. అమరనదీ తనయుఁడు సింహము గాఁక నరుఁడె. శల్య. 1-24

ఎ² అవ్య.

1. ప్రశ్నార్థకము. (ఇది సందర్భానుసారముగా ఆక్షేప పరిహాసాశ్చర్యాదులను గూడఁ దెలుపును.)

(ఆక్షేపము)

క. అతి గర్వమున్నత మగు, నతని శిరము వాని వాలంపఁజెఱు జాప్యోద్ధతితోఁ, జూడఁగ సమరి, తుద దోల్తనె విజయ సీదు శిత భల్లమునన్. కర్ణ. 3-37

క. జనసుత యాత్రామానిని సన్నును మఱి నీ భ్రాతృవరులనుం జూచితె నీ, వెవ్వుడుఁ జూచితి నన్నిటి, సనఘా పృథుమున మున్న యుద్వి వాగముతోన్. ఆది. 6-260

క. సారమతిఁ జేసి మానస, శారీర రుజావళులను సాంతముఁ బ్రతి కారములు సేయుచుండుదె, యారంగ వృద్ధోపసేవ నౌషధసేవన్. శాం. 1-84

(పరిహాసము)

క. వీ రెవ్వరయ్య ద్రుపద మహారాజువె యిట్లు కృపణులయి పట్టు వడన, వీరికి వలసెనె యహహా మహారాజ్య మఖండకాగ మది వాక్పైనోఁ. ఆది 6-89

(ఆశ్చర్యము)

సీ. అనవుడు రాక్షసుం డట్టహాసంబుతో, నెట్టెట్టు భీముండె యీతఁ
డేమి, పుణ్యమో వీని నెప్పుడు సంపఁగాంతునో, యని యున్నచోఁ
దాన యరుగుదెంచె. అర. 1-116

వ. అచ్చిత్రము సూచి యచ్చోటం గల యట్టి.

క. ఎల్ల జనులు నివ్వెరుం, డొల్లడుగా కుత్తమాంగ ముర్వి నిటుల వే,
డొల్లఁగ నేయఁడె వలసినఁ, జెల్లంబో యితని కరుణ చెప్ప విట్లున్నే.
అశ్వ. 4-120

(పరిహాసము - అవమానము)

క. వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె యిట్లు కృపణులయి పట్టు
వడన్, వీరికి వలసెనె యహహా మహారాజ్య మదాంధకార మది
వానెనో. అది. 6-89

సీ. ... సాత్యకి కృతవర్మని, వదనంబు గనుఁగొని మగ మెలర్పి
నొద్ద నిల్చున్న ప్రద్యుమ్ను చే సఱచుచు, నవమాన మేర్పడు
నట్టి భంగిఁ, జెలుచ నవ్వి యరాతి బృందంబు నిద్రావ, శత్వంబుఁ
బొందుటఁ జావు వోని - తే-దుష్టదశ నొంది యుండంగఁ దుచ్ఛుఁ
డెని, నడరి వధియింపఁగా జొరఁ డనిన రాజతనయుఁ డంత
పాపంబు సేయునె యితఁడు, పొడిచెనటె యిస్సిరో యిట్టి పోటుఁ
బోటె. మౌస. 42

(కాక్వర్థమును - ప్రశ్నించిన విషయము యొక్క వ్యతిరేక నిశ్చయ
మును - తెలుపును)

తే. ఒక్కరుని కివి యెల్లను నిక్క మట్టె యొంరుఁగలుగునె యర్జును
నీడువాఁడు. విరా 2-204

క. ... పాండవులకుఁ, జేసిన కీడెల్ల భంగిఁ దెలుపదె మిన్నున్
ద్రోణ 5-31

తే. ... భూసురులకు, నొసఁగినట్టి భగీరథుం డున్నవాఁడె.
శాంతి. 1-284

క. ... నేఁ, బ్రాకట భూసుర కన్యక, నీ కట్టిన మైల గట్ట నేర్తునె

యనినన్. ఆది. 3-185

2. ప్రార్థనార్థకములగు మధ్యమ 'ము,' 'ఁడు' - లకు అనుప్రయుక్త మగును.

తే. అర్థములు బంధువులుఁ గల్గింపుడు తద్వి, యోగ మైనట్టి యెడను మర్త్యునకు నెద్ది, తలఁపు మై నున్న మది విషాదంబు లడరకుండఁ జెప్పవె యది కృపాయుక్తి ననఘ (చెప్పుము + ఎ = చెప్పవె) శాంతి. 1-211; శాంతి. 8-449

వ. ఎల్లవారికి ననుష్ఠింప నయ్యెడు నట్టి పుణ్య కర్మంబెయ్యది యుప దేశింపవే యనుటయు (ఉపదేశింపుము + ఎ = ఉపదేశింపవె.) ఆను. 4-160

వ. మానవులకుం గర్మభూమి కృతంబులైన సదసత్కర్మంబులం జూడవె దేవతలును గీటంబులు నగుట వాటిల్లెడు. అను. 4-326

(చూడుము + ఎ = చూడవె)

ఎ[3] సర్వ.

సమాస పూర్వ పదముగా నున్న యత్కమర్థక మగు 'ఏ' అను దానికి కొన్ని చోట్ల వచ్చెడి యాదేశము-

క. మన మొక యేవుగ మీయం,గనయుం దో నడుగు దేరఁగా నెయ్యెడఁ దో,యిన నెఱుఁగ కుండుదురె (ఏ + యెడ = ఎయ్యెడ.) హ.రా. 1-69

తే మీకెప్పని నడపవలయు—(ఏ + పని = ఎప్పని.) శాంతి. 2-208

చ. ... ఎప్పరుసున లెస్స చేసినను. ఉద్యో. 3-82

ఎంగిలి దే. విశే.

1 నోటికిఁ దగిలి అపవిత్ర మైనది. ఉచ్ఛిష్టము, తినఁగా మిగిలినది.

సీ. వీరవిహారమై వీరయోధ, చారు శరీర సంచయ ముదఁగా దీఁగ కంక శివాగృధ్ర కాక కులము, లాదిగాఁ గలుగు క్రవ్యాద వర్గ్ మీకు పీఁకాడఁట నెంగిలి యయ్యె. స్త్రీ. 2-14

సీ. ఎంగిలి వర్జించి యిలువడి, ఘటశుద్ధి గలిగిన శాంతబందు-గీ - నల్లు. అను. 1-285

వ. ఆ కోమటి కొడుకుల యెంగిలి కూటం బెరిఁగిన యక్కాకంబు.
కర్ణ. 2-81

క. ననుఁ గుచ్చితంపుఁ బనులకుఁ, బనుపక యెంగిలికి లోనుపఱుపక
తగు మన్ననతోడ నరయు వారల, కనురాగము నెఱపి నడతు
రస్మత్ప్రతులున్. విరా. 1-829

2. అనుభవింపఁబడినది.

క. మును మేమాలంబించిన, వెనుకఁ గదా నీకు ననుభవింప వశంబో,
మనసా నీ వెంగిలి కా,దనుమా యవ్విషయ మెక్కడయ్యెడు
మనలోన్. ఆశ్వ. 2-36

శ్లో. "భోగా నపూర్వా నాదత్స్వ నోచ్ఛిష్టం భోక్తు మర్హసి.
సం. భా. ఆశ్వ. 22-28

వి.

1. తినఁగా మిగిలిన పదార్థము.

వ. కురకుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి యెక్కుడు వారల
ధిక్కరించెదవు. కర్ణ. 2-81

క. విను మడుగులంపైఁబడి యైన,నను నెంగిలి గుడిచియైన నరులకుఁ బగ
లోఁ,గొని యరుల కినుపడఁచి బ్రదుకనవలయు నిహమ్ముఁ బరము
గలుగునె చెడినన్. ద్రోణ. 4-248

2. భుక్తశేషము తినుట వలనఁగాని స్పృశించుట వలనఁ గాని కలుగు
దోషము.

సీ. ... గోవుల, కెంగిలి లే దిందుఁ జెట్టు లమృత, మొసఁగు నట్టుల
గోవు లొసఁగు దుగ్ధంబులఁ, దద్వత్స పీత దుగ్ధంబు శుచియ కాన
కోపము దక్కి వర్తింపుము. అను. 8-24

ఎంచు దే. స. క్రి.

ఆరోపించు.

క. ఏ నుపదేశించితి ననఁ,గా నొక పెంపెంచి వాఁడు గాని తలంపన్,
మానవనాథ సురేశ్వర,మానుఁడు నాయట్టివాఁడ చుమ్మే
పనిలేన్. శల్య. 2-847

**ఎండ** దే. వి.

1. సూర్యుని ప్రకాశము, ఆతపము.

ఉ. ఎండకు వాన కోర్చి తన యిల్లు ప్రవాసము నాక. విరా. 1-185.

2. కాంతి.

సీ. సమర వికాసంబు చెమట నొప్పుఱకుండ హేతి దీధితులు రేయెండ నొడుచు. భీష్మ. 1-119.

**ఎండకన్ను వానకన్నును నెఱుంగని** దే. జాతి.

రాణివాస మందుండి బయటికి రాని, ఎండ మొగము వాన మొగముఁ జూడని.

ఆ. వచ్చి రెండ కన్ను వాన కన్నును నెఱుంగని పురంధ్రు వెల్ల - అక్కురువృద్ధుఁ జూడ. ఆశ్ర. 1-148

**ఎండమావులు** దే. వి. బ.

(ఎండ + మావులు = ఎండలో గుఱ్ఱము వలె చలించుచుఁ గనఁబడు చాయలు.)

మట్ట మధ్యాహ్నమున బయళ్లయందు నీటివలెం దోఁచెడు చాయలు. మృగతృష్ణ.

క. మఱిఁ దలఁపఁగ సంసారం, బతి చంచల మెండమావు లట్టుల సంపత్ప్రాప్తి తతు లతిశుణికంబులు, గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్. ఆది. 5-159

**ఎండమొక్కు** దే. అ. క్రి.

ప్రొద్దగు, ఎండ తీక్ష్ణమగు.

క. కడు నెండ యెక్కు నంతకు, మడుగక యచ్చుమప గడచి. అర. 2-105

**ఎండిపోవు** దే. అ. క్రి.

శుష్కించు.

చ. అనయముఁ బండు చుండు నెర నాళ్యము మొప్పిన నిల్చి యెండి పోయిన తడిఁ బాసి పోక తగ వెట్టు కృతఘ్నుత గాదె అను. 1-156

ఎండు దే. అ. క్రి.

1. శుష్కించు, నిస్సారమగు.

ఉ. సూనృత మూఁది బన్నములు సూడక లోన నడంచి నట్టి కో,పానల మెండి యున్న నిది డాటవి పైఁ బచరించు తీవ్రదా,వానలుఁ బోలి. ఉద్యో. 2-137

2. ఆఱిపోవు, తడిలేకుండఁ బోవు.

క. శరవేదన సర్వాంగము, నెరియఁగ నాకిపుడు పెదవు లెండెడుఁ దృష్ణా,భర ముడుపఁదగిన నీళులు, వెరవునఁ దేనేర్తు వీవ వే తెమ్మనఘా. భీష్మ. 3-428

ఎంత దే. ఔ. అనా.

1. ఏ పాటిది, ఏ కొలఁదిది (ఈ యర్థమున 'లు' వర్ణాంత రూపమును ఆమ్రేడిత రూపమును గలవు.)

ఉ. ఇంతకు నేర్చు నీకు నొక యింతటిలోన మదీయ వాణి న,త్యంత విభూతిఁ బెంపెసఁగు నట్టి నినుం గొనియాడఁ జేసె దా,నెంతటి పెద్ద. విరా. 2-194

చ. మన బలమెంత యంతయు సమగ్ర సముద్యమ దుర్దమంబుగా, మునుమును గూర్చి. విరా. 3-108

చ. అలఘు తపంబులం బ్రకట యాగములన్ ముని బోధిత వ్రతం,బుల మహనీయ దానములఁ బుణ్యచరిత్రములన్ మహాత్ము లెం,తలు రమణీయ విశ్రుత పదంబుల కేగుదు రంతకంటె ను,జ్జ్వల మగు సద్గతిం బడయు. ద్రోణ. 2-388

2. సందర్భమును బట్టి ఆధిక్యమును అల్పత్వమును సూచించును.

క. తానెంత యాప్తుఁడైన మ,హీ నాయకు సొమ్ము పాలు సెమ్ము లుగా లో,నూనిన భయమునఁ బొరయక, మానిన గాకేల తలుగు మానము బ్రతుకున్. విరా. 1-186

చ. ఎంత లెం,తలు వడి వాని నీఁగ వలదా?

ఉద్యో. 3-201 (పాఠాంతరము)

తే. ... నీ యుత్తమ నాయకత్వ, మెఱింగి నిను గొనియాడ నే
నెంతదాన. విరా. 2-361

తే. నాథుల దూఱంగ గాదు వినుము, సతికిఁ దానెంత వడియును
సభల లోన. విరా. 2-148; ఉద్యో. 4-888

3. ఎంత కాలము.

క. ఎంతకుఁ గృతకార్యుండగు, నంతకుఁడీ రంతకును భయం బందక
ని,శ్చింతమున నుండుఁడు. ఆది. 7-266

4. ఎంతకు లేదు - ఎంతకుఁ గాదు. ఎంతకైననుఁ బగును.

క. పారాశర్యాది మునులు, నీరాజన్యులును వినికి యెంతకు లేదీ,
గారాము నాకుఁ బరమో,దారపదావాప్తి గాదె ధర్మతనూజా.
అను. 4-894

5. సంబంధ సర్వనామము.

చ. మన బలమెంత యంతయు సమగ్ర సముద్యమ దుర్గమంబుగా,
మును మును గూర్చి. విరా. 3-108

**ఎంతదవ్వు** దే. వి.

1. ఎంత దూరము.

తే. ... ఎంత దవ్వు, సనిన నడవికిఁ గడలేమియును మృగ ప్ర,జంబు
పొదువుటయును గొందలంబు సేయు. స్త్రీ. 1-46

2. అసంభవము.

తే. ద్రోణ కర్ణ దివ్యాస్త్రముల్ క్రూర భంగిఁ, గవియ నప్పుడు
మము నీవు గావకున్న. బ్రదుకు టెంతద వ్వదిగ శుభంబులకు
భ,వత్ప్రసాదంబు గని కాదె వాసుదేవ. శల్య. 2-389

**ఎంతదాఁక** అవ్య. ప్ర. (√ఎంత)

ఎంత వఱకు, ఎంత పర్యంతము.

గీ. ఇలయు గిరులును శరధులు నెంత దాఁకఁ, గలుగు నంత కాలం
బును వెలయుచుండు, శుకుని కీర్తియు. శాంతి. 6-341

**ఎంతయు** విశే. ద్రు. (√ఎంత)

అధికము, మిక్కిలి.

క. ఎలమియు నచ్చెరువును సరి, నెలసి పొదలు మానసమున కెంతయుఁ బ్రొద్దేఁ, గలలోనఁ గన్న చందము, దలఁచుచు నుండితిని భక్తితాత్పర్యమునన్. విరా. 1-25

గీ. సుతుల విద్యా ప్రవీణతఁ జూచు వేడ్క, నెంతయును సంతసంబునఁ గుంతిదేవి, రాజసన్నిధి గాంధారరాజపుత్రి, కెలనమండె. ఆది. 6-8

క్రి. విశే. ద్రు.

మిగుల, అత్యంతముగా.

క. మాతృ వియోగం, బెప్పుడు వాటిల్ల నపుడ యెంతయు దూలున్. శాంతి 5-277; శాంతి. 6-202

సీ. ... త త్తపమున, కెంతయు వెఱచి. ఆది. 4-86

**ఎంతేసి** దే. అవ్య. (ఎంత+ఏసి)

ఎంత చొప్పున.

సీ. పాండవుల బలమంతయు సమయింపఁ జాలుదు రెంతేసి కాలమానమున. ఉద్యో 4-420

**ఎంతపట్టు** దే. అవ్య.

ఎంతవఱకు.

క. నీ విషయ మెంత పట్టది,యే విని పరవిషయమునకు నేఁగెద. అశ్వ. 2-88

**ఎందఱు** సర్వ. బ. (√ఎంత శబ్దమునకు మహన్మహత్యర్థకరూపము)

ఎంత మంది.

చ. ... వెఱచితిరేని నిల్వఁ డొక పీరున కొక్కఁడు చాలుఁ గాక యెం,దఱు వలయుం. విరా. 4-201

ఉ. అందు వృకోదరార్జునుల వాహవ రంగమునందుఁ గ్రేణి సేయువా,రెందఱొ యెన్నమా యిచట నీ గురు భీష్ములుఁ గ్రేణి సేయు వా,రెందఱొ . ఉద్యో. 3-264

ఎందాఁక (√ఎంత)

ఎంత దాఁక.

గీ. ధరణిఁ బోగడిత యెందాఁకఁ బరఁగు నంత, కాలమును బుణ్య లోకము గలుగు నంద్రుడు. ఉద్యో. 2-67

గీ. ధరణి యెందాఁక నుండు సుస్థిరత నీదు, కీర్తి యందాఁక నెఱయ స్ఫూర్తిఁ దాల్చి, నడవఁగల యది. శాంతి. 2-148

ఎందు అవ్య. ద్రు. (ఇది సందర్భమును బట్టి దేశము విషయము మొదలగు వానిని దెలుపును.)

1. ఏ చోట నైనను, ఏ తావునందు.

ఉ. ఎందున నిట్టి రూపు నరు లెవ్వరుఁ గాంచిరె నాక వాదు ౦, క్రందనసూతికిం దగిలి కన్గొనఁ జాలరె. విరా. 2-26

వ. ఇక్కుమారున కెందు వివాహంబు సేయుద మని విదురునితో విచారించుచుండె. ఆది. 5-16 (ఎందు = ఏ తావున)

ఏ విషయము నందు.

క. అరయ నెందును గౌరవ, భారం బెడలంగ నీక పాతివ్రత్యా, చారముమై వర్తింతురు, సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్. (ఎందు = ఏ విషయము నందు) విరా. 1-112

ఆ. ఎల్లదాని నేన యెఱుఁగుదు నెందు వార్తకర్షణాదుల యోగ్యుఁడ యయ్యెఁ జెపుమ. సభా. 2-41

3. ఎల్ల యెడల, అన్నిచోట్ల.

ఆ. పరఁగు పొదరు పొదరు పల్లంబు పల్లంబు, గ్రామ గ్రామ దుర్గ మంపుఁ జోటు, దుర్గమంపుఁ జోటు దొన దొన గుహ గుహ,యాది గాఁగ నెందు నరసి యరసి. విరా. 3-82

వ. ఎందునుం జరియించు వారొక్క నాఁడు జమదగ్ని యాశ్రమంబు నకుఁ బోయి. శాంతి. 2-78

వ. నారదుం డెందునుం జరించుచుండి పంచతూర యను నచ్చర వేమ నొక్కెడం గాంచి. అను. 2-166; ద్రోణ 1-78

4. ఎవ్వరి యందైనను.

క. ఈ నలువుర భుజశక్తుల,తో నెనయఁగఁ జాలునట్టి దోర్బల మెందుం, గానము గావున వీరల, లోనన యొరు డొరుల కని గెలువు సమకూరున్. విరా. 3-114

5. ఎప్పుడైనను.

క. అనఘ నరేంద్రుఁడు మనుజేంద్రుదున కిట్లను దూత లెందుఁ దొలి తొలఁగుడువం, గొనఁ గట్టఁ దొడఁగుదురె వచ్చిన కార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్. ఉద్యో. 3-249

(దీనికిఁ గొన్ని విభక్తులు చేరుటయుఁ గలదు)

## ఎందుండి

ఎచట నుండి.

క. ఎందుండి యేమి పనికై, యెందుల కరిగెదవు. శాంతి. 3-479

వ. అమ్మహీపతి మహాభాగ యెందుండి రాక యే దేశంబులఁ జరించితిరి. అశ్వ. 2-145

## ఎందును

1. అన్నిటి యందు.

క. అని పలికి భీష్ముఁ డిట్లను, విను మెందుమదీయ దాన విధి మే టని శంబునఁజేయ నూర్ధ్వలోకంబును గర్తకుఁ బరమ దివ్య బోధము నిచ్చున్. అను. 4-40

ఆ. ... అమర, భావమున సుఖంబు జీవింతురనెడు దిని, నేలఁ గనిన వాఁడ యెందుఁ బెద్ద. ఆది. 4-158

2. అంతట, సర్వత్ర.

మహోగ్రసద్గర – వజ్ర నిర్ఘోష మెందుం, జెలఁగం బొల్చెన్, హరి. 2-65

## ఎందేని

1. ఎక్కడనో.

వ. వృత్రాగ్ని ... నహుషునంత బలంబు లేమిం జేసి భయాకుల చిత్తుండై.

క. ఎందేనిఁ బవిచెను. ఉద్యో. 1-169,170

2 ఎచ్చటి కైనను.

క. దాని నెఱింగి గృహంబున, మానిత మగు చదువునందు మనసు గొలుప కెం,దేనిఁ జని చదువుదురు క్రతువు, లానంత్యమునకుఁ దపస్వు లగుదురు విప్రుల్. అను. 2-159

**ఎందేనినుండి**

ఎక్కడ నుండియో.

వ శర్మిష్ఠ లజ్జావనత వదన యయి యిట్లను నెందేనినుండి యొక్క మహాముని నిఖిల వేద వేదాంగ పారగుఁడు వచ్చి ఋతుమతినై యున్న నన్నుం జూచి నాకుఁ బుత్త్రోత్పత్తిఁ బ్రసాదించె ఆది, 3-181

**ఎందేనియు**

ఎక్కడకో.

వ. సైంధవుండు దన వారలచేత నీ యాడినమాట విని వెఱచఱచి కురురాజు గొలువున్న చోటికిం జని సిగ్గెఱి నన్ను నగ్గించి నీ ప్రతిన యెఱింగించి యశం దరిగిన మీరు గావలేరని పలికి తానెం దే నియుం బోయెద ననిన. ద్రోణ. 2-304

**ఎంపనుగ్గులు** దే. వి. బ.

ఎముకల ముక్కలు.

ఉ ... పోరి రుద్రగుర్తై గదల్, మందగ నెత్తురుల్ నెదర మాంసము పిండిగ నెంపనెగ్గు లొం,డొందధరిత్రి నైఁ దొరఁగ. ద్రోణ. 2-132

**ఎంపపొడి** దే. వి.

ఎముకల చూర్ణము.

క. .... బకమర్దనుఁడు ... యా,తని మీఁద నుఱికి గ్రమ్మెం, గమకని నెంప పొడి నెరఁ గాలం గేలన్. ద్రోణ. 5-82

**ఎఁడు** ప్ర.

పరిమాణార్థకము.

గీ. అతఁడు పుడిసెఁడు నీ రన యప్పు డతనిఁ కెంచి.

అశ్వ. 1-84; భిష్మ. 8-410 - శర. 6-115

ఎకవెక్కు దే. అ. క్రి.

వైకి వెక్కి వెక్కి యేడ్చు.

సీ. అనవుడు వెకవెక్కి యా బిడ్డ వైచి పోయెను వారలకు.
(పాఠాంతరము) శాంతి. 3-377

ఎక్కఁబాఱు దే. స. క్రి.

అధిరోహించు

ఆ. విరథుఁడై యతఁడు వృషసేను రథమెక్కఁ బాఱుటయును
గలఁగ బాఱె సేనలు. ద్రోణ 4-161

శ్లో. హతాశ్వాత్తు రథా త్తూర్ణమవప్లుత్య విశాంపతే, స్యందనం వృష
సేనస్య సమారోహ న్మహారథః. సం. భా. ద్రోణ. 129-38

ఎక్కటి సర్వ. ప.

1. ఒక్కఁడు, అసహాయుఁడు, పరాపేక్ష లేనివాఁడు.

ఉ. దక్కను రాజ్యమంచు నకటా యిటు నమ్ముని భాగమీక నీ,
వెక్కటి ద్రిమ్మఁగఁ జూచె దది యెట్లగున్, ఉద్యో. 2-52

క. ఒక్కరుని నీవు సంపక, తక్కిన నంతటనె ప్రతిన దప్పునె విభవం,
బెక్కఁగ మీయన్న నరుం, డెక్కటి రాజ్యంబు సేయ నీఁడె కుమారా.
స్త్రీ. 1-171

ఉ. ఒక్కరుఁడైనఁ గేశవు సహాయతకై మేకొనఁడయ్యె నర్జునుం,
డెక్కటి దాన చాలుఁ దమునందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్ప.
ఉద్యో. 4-54

క. ఇక్కురువంశంబున నీ వొక్కరుఁడవ యున్నవాఁడ వుర్వీరాజ్యం,
బెక్కటి సేకొని యేలుము, దిక్కుల వెలిగింపు సంతతియుఁ బడయు
మొగిన్. ఆది. 4-230

2. ప్రత్యేకమైనది, మఱొకదానితోఁ గలియనిది.

క. ఎక్కటి యిట్టివి దోషము, లొక్కొక్కట మఱి రెండు మూఁడు పొదవి
వెరయుఁదా, నక్కడు సన్నిపాతంబు. అశ్వ. 1-174

3. పాటిలేనిది.

ఉ. ఎక్కటి గాండివంబు మఱి యెక్క వెలుంగుట. ఉద్యో 2-194

4. శూరుఁడు.

చ. రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్రుఁ డెక్కటి దివి చూఱకోరఁ
ప్రియము కాకిది యప్రియమే తలంపఁగాన్. ద్రో॥ 2-257

5. దురాశ, పేరాస.

క. ఇక్కొల్లగామంబులోపల, నొక్కటి నీ చిత్తవృత్తి నొందెనొ యొరు
లొం, వెన్నెక్కటి గుడువఁ దలంచితొ, నిక్కము గత మేమి సెపుమ
నిద్ర సెడుటకున్. ఉద్యో. 2-22

శ్లో. కచ్చిచ్చ పరవిత్తేషు గృధ్యన్న పరితప్యసే.
సం. భా. ఉద్యో. 82-14

## ఎక్కటికయ్యము దే. వి.

ఒకనితో ఒక్కఁడే చేయు యుద్ధము, ద్వంద్వ యుద్ధము.

మ. ... ఫాలాక్షు నెక్కటి కయ్యంబునఁ గన్న ఫల్గును భుజా
గర్వంబు. ఉద్యో. 2-174

## ఎక్కటి కార్యము వి.

ఒక్కఁడు చేయుపని, తోడులేని పని.

ఆ. మమ్ము నేఁటి పెట్టి యొక్కటి కార్య, మాచరించువాఁడ వగుట
దగునె. కా ప్ర. 1-89

## ఎక్కటిపోరు దే. వి.

ఎక్కటి కయ్యము.

వ. కౌంతేయాగ్రజుండు రాహినేయుతో నన్నదమ్ముల యిరువుర
యొక్కటి పోరు సూడుమని పలికె. శల్య. 2-141

వ. అప్పగ మనంబునఁ బెట్టికొని పరంపడి జరాసంధుం డక్కమల
బంధు పుత్రు నెక్కటి పోరికిం బిలిచినం బోయి. శాంతి. 1-82

శ్లో. అహ్వాయ ద్వైరథే రాజా జరాసంధో మహీపతిః.
సం. భా. శాంతి. 5-1

## ఎక్కటిబవరము దే. వి.

ఎక్కటి కయ్యము.

సీ. బహు దివ్య శరములు వడయఁడే యొక్కటి బవరాన మెప్పించి
శివునిచేత. భీష్మ. 3-177

ఎక్కటెక్కటి (ఎక్కటి + ఎక్కటి)

ఒకనితో నొకఁడు.

చ. నరవర యొక్కటొక్కటి పెనంగఁగ భీమునికైనఁ బస్సఁగాదు.
శల్య. 2-116

ఆ. ఏను నర్జునుండు నెక్కటెక్కటి దలపడక యున్న నగరె పుడమి
జనములు. ఉద్యో. 4-41

శ్లో. యదహ్యగత్వా న గచ్ఛేయం ద్వైరథం సవ్యసాచినా
అకీర్తిస్స్యాత్ హృషీకేశ మమ పార్థస్య చోభయోః
సం. భా. ఉద్యో. 140-18

గీ. ఎక్కటెక్కటి పెనఁగిన యింత వట్టు, పెనఁకువలు నిట్టు లేచునే
పృథివి నింక, జనము లీకురుపాండవ సంగరంబు, చెప్పికొంద్రు
మనంబు లచ్చెరువునొంది. ద్రోణ. 1-178

ఎక్కడ దే. వి. (ఏ + కడ - వృత్తియందు ఔపవిభక్తికము
ఎక్కడి మాట)

1 ఏ చోటు, ఏ ప్రదేశము

క. మానవపతి నన్నెక్కడి, దానవు నీవనియెనేని. విరా. 1-90

వ. ఎక్కడఁ జూచినం దానయై. భీష్మ. 2-187

ఉ. ఎక్కటినుండి యొక్కడకు నేఁగెదివో.
విరా. 1-308; అను. 1-197

2. అతిన్యూనాతిశయమ్మును దెలుపును.

క. ఇతఁ డెక్కడి మద్రపతీ, నతఁ డెక్కడ నినని దనఁడు పాటియె.
ఉద్యో. 2-238

ఉ. ఏను రాజును నీవు పేద పొలుడవు నాకును నీకును నెక్కడి
సఖ్యంబు. ఆది. 5-219

3. అసంగతత్వము, పొసఁగమిని దెల్పును.

ఉ. ... సుయోధనుం, డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ. ఉద్యో. 8-84

4. అనాదరమును దెల్పును.

ఉ. ... నా, కెక్కడి ప్రాణ మేది తను వెయ్యది నిల్కడ యేమి చేయుదున్. విరా. 2-286

వ. పో పో మ్మెక్కడి వాఁడ వని యదల్చి. కర్ణ. 3-70

క. ఎక్కడి తండ్రివి నీవే, నక్కౌంతేయులకుఁ గొడుక. ద్రోణ. 5-74

5. లోక వైపరీత్యమును దెలుపును.

ఉ. అక్కట వాసుదేవు పను పాపరణంబునఁ జేయరైరి వీ,రెక్కడి బుద్ధిమంతులు. ఉద్యో. 4-20

ఉ. ఎక్కడి మాట గొల్లతన మించుక యేనియు లేదు నీ దెసం. విరా. 1-231

6. ఆశ్చర్యమును దెల్పును.

మ. వలలుం డెక్కడఁ జూచె నొంచెడ నసేవ్యజ్ఞాజముల్ పట్టవే. విరా. 2-188

ఉ. ... నీ బలం, బెక్కడఁ బోయె సైన్యపతులేలకొ యిక్కడ రారు. శల్య. 2-401

7. ప్రశ్నార్థకమైన వ్యతిరేకార్థము నిచ్చును.

చ. ... నీ, వెఱిఁగి యెఱింగి నన్ దొడరి యెక్కడ బోవఁగవచ్చు. ద్రోణ. 2-90

వ. జూదరి యాలికి గరువతనం బెక్కడియది. విరా. 2-153

8. ఎప్పుడు, ఆకస్మికముగా నను నర్థమిచ్చును.

వ. ... ఎక్కడ వచ్చి నెవ్వరినేమి సేయునో యనుచు మేనులు వడంక. ద్రోణ. 5-225

9. సంబంధ వాచకముగా నుపయోగించును.

క. ఎక్కడ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు పరఁగు నక్కడఁ

గలుగుం జక్కటి నిలుచుం గృష్ణుం డక్కడ నతఁ డున్నకడన యగు
జయ మధిపా. ఉద్యో 2-317; ద్రోణ. 1-248

10. పలురకములుగా నుపయోగపడును.

సీ. నామీఁద గృపయుఁ బ్రియము నెక్కడవోయె. కల్కి 1-18
(ఎక్కడవోవు = కానరాకుండఁ బోవు)

తే. ఇంక నాఁటి చూఱ లెక్కడివి. ఉద్యో. 3-362

వ. ప్రముక్కడి మూఁకలు నని యెక్కడెక్కడ నని తలపడిన
(ఎక్కడెక్కడ – అగలింపు మాటలు) విరా. 4-4

**ఎక్కించు** దే. స. క్రి. (ఎక్కునట్లుచేయు)

1. అధిష్ఠింపఁ జేయు, నిలుపు, మోపు.

క. ... పృథివీపతి నీ, తలన తన కార్య ఖడ్గం,బుల మోపెక్కించె,
విరా. 5-28

వ. నీ గౌరవంబంతయు నెఱిఁగి కాదె వహ్నిమానుండైన యీ
మహాముని నారాధించుటకు నీయందు భారం బెక్కించెను.
అర. 7-315

2. అధిరోహింపఁ జేయు

మ. ఆ తేజం డతిథి క్షి గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దోడ్తోని
తెచ్చెన్. ఆది. 4-191

సి. ...ధర్మ,సుత నిజభుజములఁ దనవితతకావాలయమళంబు నెక్కించి.
ఆది. 6-160

వ. ... కుంతీదేవిని ద్రౌపది నొక్క రథంబెక్కించి తోడ్కొని.
ఆది. 7-288

3. కలిగించు.

క. ధర్మనందనునిఁ దగం, గను మతఁడు రాజనని తన, మనమున
నెక్కించు కొనఁడు మదగర్వంబుల్. కల్కి. 1-59

ఆ. అక్కరంబు నెయ్య మెక్కింప నేరంగఁ, దగిలి సంతతంబుఁ దలఁ
చుట్టి, తంగిమొలయుఁ గీడు వఱుపంగఁ గొనియాడ, వలఁతి నీకు
చేయవలసె దివి. శ్రీ. 2-133

4. అధికముఁ జేయు, అతిశయింపఁజేయు.

సీ. అంగుళంబుల నల్ల నలకలు గఱపించి, కెమ్మోవి యాని యెక్కించుఁ గాయ్యు. విరా. 2-810

4. (వారి) విగించు.

గొనయం బెక్కించియు మోపెట్ట నశక్యుఁ బయిన. ఆది. 7-178

6. ఉంచు, తూఁచు.

క. తక్కిన మూఁడాశ్రమములు, నొక్కెడ నొక గృహాస్థ ధర్మ మొక దెసఁ దుల యం దెక్కింప వానితో న,య్యొక్కటి సరితూఁగె నందు రుర్వీశబుధుల్. శాంతి. 1-76

ఎక్కించుకొను దే. స. క్రి.

1. (రథముపై) కూర్చుండఁ బెట్టుకొను, అధిరోహింపఁజేయు.

వ. గోవిందుండు కర్ణుదెసం గనుంగొని నన్నెనిచి పత్తుగాని రమ్మని కరంబు సాఁచి చెయివట్టి తన యరదం బెక్కించుకొని ఉద్యో. 4-19

2. ధావించుకొను, మీఁద మోపుకొను.

వ. జామదగ్న్యుం దదియెల్ల నెఱింగి యోటమి యెక్కించుకొని. ఉద్యో. 4-856

3. ఆరోహించుకొను.

వ. నీవు గొందఱ నర్జించితినని దుర్జయత్వం బెక్కించుకొనఁగు. ద్రోణ. 5-127

4. కలిగించుకొను.

వ. ...ధర్మనందనునిఁ దగం,గను మతఁడు రాజనని తన, మానమున నెక్కించుకొనఁడు మదగర్వంబున్. శల్య. 1-69

5. పూనుకొను.

వ. ...పోనెక్కించుకొనని వానిమీఁదం బ్రయోగించినవాఁడన మగలి వధియించు. ద్రోణ. 8-88

శ్లో. అయుధ్యతి నమోక్తవ్యా సా శక్తిర్యోవ పతేదితి, హన్యాద్దేపా ప్రతీపం హి ప్రయోక్తారమపి ప్రభో.
సం. భా. ద్రోణ 92-51

ఎక్కిడు దే. స. క్రి. (ఎక్కువెట్టు)

1. సజ్యముచేయు, నారితొడఁగు.

ఉ. చుక్కలు తోడుతోడఁ బలచూపదొడంగె మనోభవుండు వి,ల్లెక్కిగి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె. విరా. 2-3 9

వ. తేరెక్కి యెక్కిడిన విల్లును మెచ్చువచ్చు నమ్ములును దొడలపైఁ బెట్టికొని. ద్రోణ 3-305

ఎక్కు దే. అ. క్రి.

1. సంతోషకరమగు, ఇష్టమగు, నచ్చు.

తే. అకట యెరుచిత్తమున నెక్కునట్లుగాఁగ, మెలఁగి యేమి విధంబునఁ గొలుచువాఁడు. విరా. 1-74

క. ...ఇ,య్యేవపుఁ బుట్టువు పుట్టిన, వావగ పెవ్వారికి నెక్కు నళినదళాక్షీ. విరా. 3-50

వ. పాండవులం బరిమార్చు పని నేఁడు చేయక మఱిచేసిన రారాజు నిగ్రహప్రాణుండైన నాకెలసం బెవ్వరి కెక్కెడు. సౌప్తి. 1-24

క. ...దుర్వినీతకోటి సంబుల్, వన కెక్కినట్టి తప్పులఁ గొని సుజనులకిగి నృపాళి గుణమంద్రుఁ బుధుల్. శాంతి. 2-186

2. నమ్మకముగు.

క. అడిగకున్నను, నేమి వినుము చెప్పెదను మునీంద్రుల కెక్కన్. శాంతి. 1-57

3. అధికమగు, అతిశయించు, హెచ్చు.

క. గిమకును బలమెక్కి తఱి, సముచితమగు విగ్రహంబు శత్రుంబులతోన్, జేము మీఱినప్పుడు కర్తవ్యము సంధియనంగ విందురూర్ధ్వుల దేటన్. శల్య. 1-58

వ. అట్లుడరు నయిట్లంబు వాళినివయుండు గినుక యెక్కిన యేత్తైబం బెక్కువటిచె. ద్రోణ. 5-177

క. ఎక్కెడు దినముల శుభములు, నెక్కునఖల వైభవములు నెక్కు

దినమునం, దక్కక యుండెదు కాలము, నెక్కు మహాత్మతయు
నెక్కు నిభపురనాథా. అను. 4-149

ఉ. ...వా, రేమయిరేమి మా కెలన మెక్కె నెఱుంగుము మమ్ము
మువ్వురన్. సౌప్తి. 1-281

5. కలుగు, సంభవించు.

ఉ. ...గో, నెక్కఁగఁజేసి నిన్ను నతిహీన విధాన నియుక్తుఁజేఁతగా,
నిక్కము యుమ్మలించి తిరి నెయ్యము తియ్యము కల్గియే గీ.
విరా. 2-98

క. మహాత్మతయు నెక్కు. అను. 4-149

6. ప్రకటమగు, తెలియు.

వ. అతని లావును తీరంబును లోకంబున నెక్కియున్నయవి.
ఉద్యో. 4-204

క. నినుఁ గీడు వొరయకుండఁగ, జనులకు హానిక్కమెక్క జనవాయక
నే, నసలంబుఁ జొచ్చి వెడలెదఁ, గనుగొను మిచ్చనువు నాకుఁ గరు
ణించు నగన్. అర. 7-180

7. మార్కొను, ఎదుర్కొను

సీ. ఒక్కఁడ పెక్కండ్ర కెక్కిన విచ్చియుఁ, గోదిని చెండాడి పోటు
వోడుచు నెడలు విరా. 8-164

వ. ఇట్లెక్కుమిగిలి యెక్కిన యద్భుతాంగనము గనుంగొని కౌరవ
తమ్ములు. భీష్మ. 3-91

క. పటురయమున నాత్మను లోనెక్కుటఁ దొక్కు ద్రొక్కు గనవికర
ములఁ దుటిడి, త్రుటితాకృతులుగ విహరించుట యొక్కు
వేఁడ్క సేయు సురగణమునకున్. కల్కి. 1-128

8. ప్రీతి గలిగించు, మెప్పువచ్చు.

(భీముఁడు ద్రౌపదితో) శా. చింతాశల్యము వాసెనే భుజబలోద్రేకంబు
నీ కెక్కెనే, శాంతిం బొందదె రోషపావకుఁడు దుర్వారోద్రతనిం
జూచితే. విరా. 2-358

క. పతిమదికి నింత యెక్కిన, యతివ గదా పుణ్యవతి. శాంతి. 3-311

9. ఎచ్చు, అదనమగు.

సీ. రెండవయేఁట నొక్కం డధిమాస మి,ట్లెక్కిన యన్నెలతెల్లఁ గూర్చి,కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక, నిన్నటి తోడన నిండె. విరా. 4-232

తే. ... రెండును మూఁడు నాల్గు, నీ క్రమంబున నోపిన నెక్కినట్టి, దినము వెడ పెట్టి కుడుచుచు ధృతి నొకేఁడు, నడవు వారల తెఱఁగు తేర్పడఁగ వినుము. అను. 4-143

10. కడచు, గతించు.

క. ప్రొద్దు జామెక్కుటయున్. శాంతి. 3-500

11. వృద్ధి పొందు.

తే. ... షోడశంబుదాఁక, నెల్లవాఁడును ఋతుశక్తి యొదల నుండఁ, నెట్టి భాగ్యము గల్గిన ఋతుమతీ ప్ర,సంగమము దప్పనీకున్న నాయు వెక్కు. అను. 4-126

12. వచ్చు, చేరు, లగించు.

చూ. కీర్తి కెక్కు, సతికెక్కు ప్రసిద్ధి కెక్కు.

స. క్రి.

1. అధిష్ఠించు, ఆశ్రయముగాఁ గొను.

క. వల్లెయని రాజనందను, లెల్లను సమకట్టి రథము లెక్కి దిశల్ వే, ద్రెల్లఁగ గర్జిల్లి నిశా,తోల్లసిత కృపాణ కార్ముకోద్యతకరులై. ఆది. 6-64

2. ఉండు, పొందు

ఉ. ... నేల కెం,పెక్కుచు వచ్చె. విరా. 2-319

సీ. బిగి యెక్క యేర్పడంగఁ దెలుపును గప్పును వెలయంగ మెఱుఁ గెక్క. విరా. 1-245

3. క్రమముగాఁ బొందు, ప్రాఁకు.

ఉ. కేలికుంద మోది యే తెలివున దోఁ,నాలు ప్రాఁకునై పుణుంబు

గలుగు, పురుషునట్లు యోగ పరిణతుండును నాన్ని, నేమఱక విముక్తి కెక్క వలయు. శాంతి. 5-537

క. తేనియ కుండం గొనుచు నో,పానము నేమఱుట లేక ప్రాంకిన క్రియ నా,త్మానుసంధరసం బొక కణ,మైనం జిలుకనీక తుదికి నాతం డెక్కున్. శాంతి. 6-121

4. (చెట్టు మొదలగు వానిని) ఆరోహించు.

ఆ. ... పఱచి మహీజ.ము, లెక్కి రండుం గొంచు ఋక్కుడంగి. అర. 2-110; అర. 8-112; ఆది. 1-169. అర 8-244

క్రి. విణ.

1, తగు, అర్హమగు.

చ. ... సురేశ్వరుండు సువర్ణనంబునం బ్రకటింన నెక్కు విమాన మెక్కి యం,బరగతి వచ్చె. విరా. 4-234

2 అధికమగు.

క. ఎక్కుడు దినముల శుభములు, నెక్కు నళుల వైభవములు నెక్కు దినమునం, దెక్కక యుండెడు కాలమ, నెక్కు మహోన్నతియు నెక్కు నిభపురనాథా. అను. 4-149

వి.

సజ్యము, జ్యాసంధానము, నారి కూర్చుట.

వ. ... గాండీవంబుం బుచ్చుకొని యెక్కువెట్టి ముష్టి సంపరించి. విరా. 4-163

వ. కోదండంబు నెక్కుడించి కంకటంబు బూడి, సౌప్తి. 1-65

ఎండ యెక్కు; కీర్తి కెక్కు, మతియెక్కు మొదలగు పదముల వాయో తావులందు, జూడనగును.

ఎక్కుడించు దే. స. క్రి.

వింటి నుండి నారిని సడలించు.

వ. ఎక్కుడించిన పాండవాగ్రజుండు.

క. దనుజకులత్రాసకరంబును రిపు భంజనము రత్న భూషిత రూపం

బును గురుదేశాచ్ఛాదన,మును నగు నిజకార్ముకంబు మోపెడ లించెన్. విరా. 1-169-170, సౌప్తి. 1-65

ఎక్కుడు దే. విణ.

1. ఉత్కృష్టము, శ్రేష్ఠము.

తే. రాజు సర్వోత్తముఁడు ధర్మరాజి యందు, రాజధర్మంబ యెక్కుడు. శాంతి. 2-289

ఆ. అర్థసిద్ధికంటె నరయ నెక్కుడు ధర్మసిద్ధి శాంతి. 2-408

2. అధికమైనవాఁడు, గొప్పవాఁడు.

ఉ. ... ఇట్లు శత్రు దోశ్చండిమ కోహటించితి నిజంబునకున్ నరుఁ డింత యెక్కుడే విరా. 4-98

3. అధికముగా నాదరింపఁబడినది.

చ. ... నిను రాజరాజ యిమ్మనుపున కిద్ది తెచ్చె విధి మానము ప్రాణము కంటెఁ జాల నెక్కుడగుట సెప్పఁగా వినవొకో కడు నీచతఁ బొంది తక్కుటా. కల్య. 3-57

4. హెచ్చైనది.

చ. చిడిముడిపాటు లేక యతిశీఘ్రమునన్ ఘనకీర్తి నాతఁ డెక్కుడు ముదిమొప్ప నానృపతిఁ గూలఁగ వైచె సురల్ నుతింపగాన్. ద్రోణ 3-250

5. స్థితికి మించినది, స్తోత్రమైనది.

ఉ ... గెల్పునుతింపఁగ రాజపుత్రుఁ డెక్కుడుమాట కోరువక యిట్లను నర్జునుంబుతోఁ దగన్. విరా. 5-265

6. స్వాహంకారపూరితము.

ఉ చిక్కని పోటు మాని సివి వీను వారలు నవ్వ నేమిగా, నెక్కుడు మాటలాడెదవు. ఉద్యో. 1-258

7. తన్నుఁ దాఁ బొగడుకొనుటకు సంబంధించినది. ఆత్మశ్లాఘనమైనది

సీ సంజయుతో మీరు శంకలే కాడిన యెక్కుడు మాటలు పెక్కు గలవు. ఉద్యో. 4-191 - చూ ఎక్కుడు మాటలు.

8. ఒకదాని కన్న నొకటి పెచ్చు.

క. ఎక్కుడు దినముల శుభములు నెక్కు. అను. 4-149

9. మించినది.

వ. సహదేవుం డా శైనేయు నుద్దేశించి మిమ్ముఁ బాంచాలురం గడచిన బంధువులు మాకును మమ్మును మిమ్మును మిగిలిన బాంధవులా పాంచాలురకును వారకంటె మాకంటె నెక్కుడు సుహృజ్జనులు మీకును లేకునికి. ద్రోణ. 5-871

10. ముఖ్యము, ప్రధానము.

(మనస్సు ఇంద్రియములతో)

వ. నిజంబుగా నేను దొలంగితేని.

ఆ. అప్రయోజనంబులై యుండు నాటిన, నిప్పులట్లు శూన్య నిలయములును, బోలె మీ స్వరూపములు గాన మనలోన, నెక్కు దేవ చూపె యింత నిజము. ఆశ్వ. 2-23.88

క్రి. విశ.

అధికముగా, మిగుల.

వ. అప్పటి కప్పటి కెక్కుడైన మదంబునం ద్రిగర్తాదులగు నమ్మార్తురు పైపయిం గ్రమ్మి. కర్ణ. 2-317

క. కడు నమ్మియునికియును నెక్కుడు నమ్మమియును సుశీలకులత గా దె,య్యెడనైనను. శాంతి. 2-187

ఎక్కుడుపడు దే. అ. క్రి.

పైకెగయు.

చ. నడవ మహాత్మ యగ్ని యయి నావదనంబున నిర్గమించి యెక్కుడు పడి పద్మగర్భుకడకుం జనె. అను. 4-408

ఎక్కుడుమాట దే. వి. ఏక.

పొగడ్త.

ఉ. ... రాజపుత్రుఁ డ,య్యెక్కుడు మాట కోరువక యిట్లను నర్హజనంబుతోఁ దగన్. విరా. 5-265

ఎక్కుడు మాటలు దే. వి. బహు.

1 స్వాహంకార పూరిత వాక్యములు.

ఉ. చిక్కిన పోటు మానిసి విసీ వినువారలు నవ్వ నేమిగా, నెక్కుడు మాటలాడెదవు ఉద్యో. 1-252

2. తన్నుఁ దాను పొగడుకొను మాటలు, ఆత్మశ్లాఘన వచనములు.

సీ. సంజయుతో మీరు శంకలే కాడిన, యెక్కుడు మాటలు పెక్కు గలవు. ఉద్యో. 4-191

"శ్లో" యదేతత్కత్థనా వాక్యం సంజయో మహద్బ్రవీత్ సం. భా ఉద్యో. 159-8

ఎక్కుపెట్టు; ఎక్కువెట్టు దే. స. క్రి.

సజ్యము సేయు.

తే. ఒక్క విల్లెక్కు పెట్టంగ నుఱక. భీష్మ. 3-368

వ. గాండీవంబుఁ బుచ్చుకొని యెక్కు పెట్టి ముష్టి నలరించి. విరా. 4-198

తే. అట్టి యేఁ దేరుగడపంగ నెందు నుతికి,నెక్కు గాండీవ మేత్రైల నెక్కువెట్టి, రెండు దొనలను బూని కిరీటి యనికి, వచ్చు నేఁ డెల్లి యొందు దొవచ్చు మీకు. ఉద్యో. 2-180

ఎక్కువ దే. వి. (√ఎక్కు)

అధిక్యము, హెచ్చు.

క. హరి సత్త్వాది గుణంబులఁ, బొరిఁబొరిఁ గలిగింపఁ బెంపఁ బొలియింపఁగ భూవర యవి యెక్కువదక్కువఁ, బొరయుచుఁ బరివర్తనంబుఁ బొందుచు నుండున్. శాంతి. 6-420

చ. వతిదెస కూర్మివావుటకుఁ బట్టుగ నెక్కువ తక్కువంచు నున్నతు లగు మేదినీశులకు నానగఁ బల్కుటగాక. ఉద్యో. 4-240

ఉ. ...రాజపుత్రుఁ డ,య్యెక్కువమాట కోరువక యిట్లను నర్హ జనంబుతోఁ దగన్. విరా. 5-265 (ఇది పాఠాంతరము)

ఎక్కువ తక్కువ దే. వి.

ఎచ్చు, తగ్గు

("ఎక్కువ, తక్కువ"—అను రెండు పదములు కలిసి ఏకపదముగను ద్వంద్వ సమాసమున బహువచనమునను మాత్రమే ప్రయోగములు గనం బడుచున్నవి. శాంతి. 6-490 లో ప్రత్యేక ప్రయోగముగాం గనం బడుచున్నను రెండు నవ్యవధినే ప్రయోగింపబడినవి)

చ. పతిదెస కూర్మివావుటకుం బట్టగ నెక్కువతక్కువంచు మున్నతు
లగు మేదినీశులకు నానగం బల్కుటగాక. ఉద్యో. 4-240

(ఎక్కువంచు, తక్కువంచు

క. వినుం డెక్కువ తక్కువలే, కనయము గాని గుణత్రయంబును
('ఎక్కువదక్కువ' అనియుం బ్రయోగము) అశ్వ. 2-182

విశే.

క. ఎక్కువదక్కువ మాటలు, మక్కువములు బలికి ... ంచు
టలుం, జెక్కుదన యన్నదమ్ముల, నిక్కువ నన్నియుం ... వేదము సేయుక్. శాంతి. 3-359

ఎక్కువదక్కువలు దే. వి. బ. (ఎక్కువ+తక్కువ)

ఎచ్చుతగ్గులు.

వ. కావున నెక్కువదక్కువలు నిరూపించి. విరా. 4-185

వ. ఈ యెక్కువదక్కువలు విచారింపక. ఉద్యో. 2-222

వ. ఇత్తెఱంగున నెక్కువతక్కువలు లేక యక్కజంబుగాం బోరువారి భీష్మ. 2-46

వ. ఇట్లెక్కువ తక్కువలు లేక పోరిపోరి. ద్రోణ. 5-207

ఎగంద్రోచు దే. స. క్రి.

పైకెత్తి పట్టు.

వ. నీలాశ్మరశ్మి స్థగితంబైన విమల మణిస్థలంబు జలాశయంబుగా
వగచి పరిధానం బెగం ద్రోచికొని. సభా. 2-86

ఎగము

ఇది పొగచువంటిది. కాని నిర్ధారక ప్రయోగములులేవు 'ఎగయు' యొక్క ప్రేరణార్థకమైన 'ఎగయించు' దీనికర్థము అని మూ. అ. ని.

ఈ 'ఎగచు' ప్రయోగము భారతము ముద్రితప్రతులలో 15 తావులందున్నది. కాని కొన్ని ముద్రిత ప్రతులలో 'ఎగుచు' ఉండుటయు లేకపోలేదు. మనము చూచి నిర్ణయించు వ్రాతప్రతులు కవిత్రయమువారి స్వహస్త లిఖితములు కావుగదా. తొట్టతొలుత ముద్రిత ప్రతియు వ్రాతప్రతినుండి వచ్చినదే కదా—'ఎగుచు ఎగచు' అని రూపాంతరముగా గ్రహింపనగును. అట్టివి మఱికొన్ని గలవా అను ప్రశ్న నిరాధారము. 'ఎగయించు' అని చెప్పుకొనుటకు ప్రేరణముక్రింద గానరావు. పైగా అకర్మకముగాఁ గూడ దీనికిఁ బ్రయోగము గలదు.

అ. క్రి.

1. విజృంభించు.

వ. ఇత్తెఱంగున నందునిమిత్తము నతని దోర్విలాసంబు దుస్సహం బగుటయుం బాండవబలంబులు చెదరినం గురుసైనికులు నలుగడలకు నెగచి రట్లు విజృంభించిన కుంభసంభవు నెదుర్కొని.
ద్రోణ. 1-298

స. క్రి.

1. వెంబడించు, తఱుము.

క. వెనుకొని విఱిగిన సైన్యము, గనుకనిఁ బాఱంగఁజేసి క్రౌర్యోద్రేకంబున ధృష్టద్యుమ్నుండును, దనకోలనం దఱుమ వాయుతనయుం డెగచెన్.
భీష్మ. 2-112

శ్లో. తతస్తాం కౌరవీం సేనాం ద్రవమాణాం తతస్తతః,
నిఘ్నన్ భీమశ్శరైస్తీక్ష్ణై రనువవ్రాజ పృష్ఠతః
సం. భా. భీష్మ. 58-19

చ. ...ఎంతయున్, భరమున నీ మొనల్ గలఁగి పాఱ నరేశ్వర వారి సైన్యసంచయ మెగవన్ మహీతలము సంభృతకంపము గాఁగ నల్గడన్.
కర్ణ. 8-9

వ. ...ఒక్కవాఁడు మహాగహనంబులఁ బెక్కుమృగంబుల నెగచి చంపి తనచేత నేటువడి పాఱిన మృగంబు వెంటం దగిలి.
ఆది 2-165; ఆది. 6-48

ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల, నడ నెడంగుఁ జూచి నగుచు

వాని, నెగచి యెగచి యందు నెగయకుండఁగ నొక్కి, హంసఁ బట్టుకొని యెసెఁ నతిరయమున. అర. 2-12

క. నలి భగదత్తుఁడు గదుపుల, వెలుచు పసులవాని యట్ల విలసద్గతి న బ్బలము నెగవ ధూళియు నా,కుల సంరావంబు గగనకుహరము నిండెన్. ద్రో. 1-882

1. త్రోలు (రథము మొదలగు వానిని)

తే. ...సారథి తోలఁగంగ నెగచె రథము. ద్రో. 5-164

చ. అనపుడు సూతుఁ డెంతయురయంబునఁ దేరు వృకోదరాంతికం, బున నెగవంగ. కర్ణ. 1-149 చూ. ఎగుచు.

ఎగయించు దే. స. క్రి. (√ఎగయు) ఎగయఁజేయు

ఎత్తు.

చ. అనునెడ వాని యుగ్ర సముదాకృతియుం బటువాక్ప్రవృత్తియుం, గని విని మల్లులెల్ల భయకంపితమూర్తులు దాల్చి మాటువ,ెక్కను గనువిచ్చి చూడమ మొగం బెగయింపను జాలకున్న విరా. 2-8

సీ. అతఁడు ఱెప్పల నెగయించి యప్పాండవోత్తముఁ దప్పక చూచి. ఆశ్వ 2-60

క. ...ఇంచుకవడి మౌనము దగం దాల్చియుండి నతవానుండై.

వ. పదంపడి నిట్టూర్పువిగిడించి మొగంబెగయించి భూపాలు వాలోకించి. విష్ణు. 8-178,174

ఎగయు అ. క్రి. నెగయు

1. పైకిపోవు, ఎగురు.

సీ. ప్రమథులు గాసి సేయుచును రక్తములు చల్లి, యాగ్రంగ మృగ రూపమై గగనంబున నెగసె నధ్వరము. శా.౦. 5-489

సీ. వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున, నెగసి మోమునఁ జొరకి మగిడివచ్చు. విరా. 5-895

వ. అట్టియెడ మున్ను తురంగమఖురాదలం దూలిన కెందూళియుం బైపయి నెగయఁ బరబలంబు నెత్తుట జొత్తిల్లుచు. విరా. 5-82

2. లేచు, ఉత్థితమగు.

సీ. మంకినాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై నర్తించు శిఖింప
వలయునట్టి, గుజ్జు దోయిని జట్టిగొని ప్రీతి లంకించియుండ లంకియ
తోన గండ మీఱి, పాఱె నక్కొడియల్ పడియున్న గనప లొక్కటై
నుంగుపై నది యెగసె పఱప, నుభయ పార్శ్వంబుల నురిపోసిన
ట్లవి వ్రేలి చచ్చినఁ జూచి విప్రుఁ డడలి. శాంతి. 4-40

3. కలుగు, పుట్టు, ఉద్భవించు.

ఆ. అన్ని వెడఁదవాతి యమ్ము లద్భుతముగ నొక్క ముష్టిఁ దొడిగి
గ్రక్కునంగ, నతఁడు లీలఁ దునిమె నందఱ తలలును, ఘోరభంగి
రక్తధార లెగయ. విరా. 5-149

వ. తము విడిసిన విప్రగృహంబున నున్నంత, సందొక్కపెట్ట యార్త
ధ్వని యెగసిన విని కుంతీదేవి. ఆది. 6-239

4 వ్యాపించు, క్రమ్ము.

ఉ. బఁదొక విల్లువుచ్చుకొని యుజ్జ్వలరోష మహానలార్చు లొం దొండ
మొగంబుపై నెగయు నుర్వి చలింప. ఉద్యో. 4-319

క. చిచ్చులు కన్నుదరు లెగయ, విచ్చినఁ గపిలత్వ మొండె విబుధ
ప్రకరఁ, బచ్చెరు వందుచు గన్గొన, నచ్చెరువ నొరఘోయు లమల
చరిత్రా. అను. 3-22

క. గరికొని దహనం బెగసెను. వయసను సహదేవు సకల వాహిని
మూఁక, కరులవయిఁ దురగము లపయి, వరరథములపయిఁ బదాతి
వర్గములపయిన్. శా. 1-250

5. వెడలు, ఉద్గతమగు.

తే. రథము మీఁదికిఁ జనుదెంచి పృథుల సైన్య, వార్ధి ఘోషణ ధ్వను
లుఁ దూర్యనిస్వనములు, నెగసి దివిముట్టు మైమఱువిడి తఱచు
నెలమిఁ గోదండ తూణీరములు ధరించె. భీష్మ 1-169

విణ.

పుట్టు, కలుగు.

క. విని యా విప్రునితో నిట్లను నయ్యేలనాఁగ మన మనకు ప్రవేశే
వంగనెగయు వాక్కు దదను వర్తనము మనంబునకు నెవ్విధం
బునఁ గలుగున్. ఆశ్వ. 2-15

ఎగవంజను దే. స. క్రి.

తలుముకొని పోవు

క. మును సహదేవుండెగ వంజని నప్పుడు డయొంచు దేరు సవరించు
కొనం గనుట నది సేర్చి యుతనిం గొని పోయెను సంగరము
నకుం దోలఁ గంగన్. కర్ణ. 2-367

ఎగవు దే. వి.

అవలి భాగము.

ఆ. ... పాండవేయుఁ డార్తిఁ గూరి నిలువలేక కూర్చుండఁబడి
మూతుఁ, నరగ మెగవు తొలఁగి నని యా నధిప. కర్ణ. 2-381

ఎగవెక్కు దే. అ. క్రి.

పై వెక్కిళ్లతో ఏడ్చు.

సీ. అనవుడు నెగవెక్కి యాబిడ్డ పైబడి పోయెడు వారలకు నడ్డ
పడుచు నక్క. శాంతి. 8-777

ఎగుచు దే. స. క్రి.

1. త్రోలు.

వ. ఇట్లు దుశ్శాసనుండు వోలి త్రోలుటయు.

క. సారథి యరదము భీష్ముని, తేరి వెనుక నెగిచె. భీష్మ. 3-344

2. పైకొను; కవియు.

క. శాల హరిణములఁ బట్టెడు, సింహ విషమాటవీ చలిత కేసరి
శార్దూలేభ శరభములఁ దన, శౌర్యమునంద యెగిచి పట్టుచు
మఱియున్. ఆది. 4-6

3. వెంబడించు, తఱుము.

చ. అనిలజుఁ డుగ్రుఁడై ... పేర దుర్మదులఁ జంపనేల యని
మానుగ గోపుడు గోగణంబులన్, గొనకొని రొప్పునట్లు లధికం
దెగిచెన్ బృథునంద హస్తుఁడై. ఆది. 6-78

క. నలిరేఁగి కలఁగి తద్బల,ములు విశ్వామిత్రు సైన్యముల కేను మడుఁ,గులు పెరిఁగి మూడు యోజన,ములు వాఱఁగ నెగిచె నోర్కి మొగిఁ బ్రతిబలమున్. ఆది. 7-107; ఆది. 7-194

వ. ... ఇంద్రుడు శ్యేనంబై న నగ్ని కపోతంబై శ్యేన భయంబునఁ బఱతెంచి శిబి మఱువునొచ్చిన దాని నెగిచికొని వచ్చి శ్యేనంబు శిబి కిట్లనియె, అర. 8-237 చూ ఎగచు

**ఎగురు** దే. అ. క్రి.

ఉఱుకు, లంఘించు.

వ. ఆపాంచాల వరుండు.

తే. ...తలగోయుట తప్పించి, యెగిరె నగ్గురు తేరిపై కేపు మెఱయ. ద్రోణ. 4-100, 101

**ఎగువఁబడు** దే. అ. క్రి.

నిరోధింపఁబడు, అడ్డగింపఁబడు.

ఆ. అగ్ని నేను నాకు నాహారమయ్యెడు, ఖాండవంబు దీనిఁ గాల్పఁ గడఁచి యెగువఁబడితి నుండె,దింద్రు పంచిన మహా,ఘారుదాంబు ధరణంబు చేత (ఎగువఁబడితి = అని పాఠాం) ఆది 8-288

**ఎగ్గతము** వై. విశే. (సం. ఏకాంతః)

ఏకాంతమైన, నిర్జనమైనది.

(గాంధారి శ్రీకృష్ణుని శపించుట)

గీ. ...అయవ్వ యతఁడు ఎగ్గతంపు చోట, నగయ దిక్కెవ్వరును లేని యట్టి తెగుట, నొడిఁగిలవాఁడ గాఁ బల్క నొద్దనుండి వింటి. మా. 157

వి.

ఏకాంత స్థలము, ఒంటరిగా నుండుచోటు.

తే. ఎగ్గతంబునఁ దానుఁ గారగ్గిఁ గాలె, నటు యనాథయై దీనత్వ మంతరంగ మలదఁగఁ... యెట్లుండుఁ జెపుమ. ఆశ్ర. 2-168

**ఎగ్గాడు** దే. అ. క్రి.

నిందించు.

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయొకం బ్రహ్లాదముం బొందు భూ,
వరు నాజ్ఞం జన రీగిమెచ్చరు పనిన్ వంచింతు రెగ్గాడఁబో,త్తురు
కౌతూహలం వేషభాషణములం దుల్యాగ్రమ్ముం బొంది యే, తురు
వారెల్ల పదంబు వేడుదురు సింతుర్ భూమి మూఁబోద్దులన్.
శాంతి. 8–180

ఎగ్గు దే. వి.

1. కీడు, హాని.

సీ. ధార్తరాష్ట్రులు సూతతనయ సౌబలులును, తెలుపన వేతురు చిన్నపన్న. – ఆ. యెటఁగిరేనిఁ జాల నెగ్గు వాటిల్లు. విరా. 1-47

సీ. ...నీ జనించిన యది యాదిగా,నుదుగన పాండవేయులకుఁ జాం నెగ్గుసేసితి విషమిడి పెనుఁబాములఁ గఱపించి నీటిలోఁ గట్టిత్రోచి లక్కయిల్ గాలిచి. ఉద్యో. 3-367

ఆ. అ,ప్పాండవులను గుఱిచి బహువిధ ములగు నిమిత్తములు నయం బునఁ జూచితి, నెగ్గులేవ వారికెల్ల నగ్గు. ఆది. 7—28

2. తప్పు, నిషిద్ధమైన పని.

క. కావునఁ గౌరవ పాండవు లీ వసుధకునై పెనఁగుచొగ్గే ద్రవం, బేవంక బ్రాలె వారిక, పోవుం గాకిత నరేంద్ర పొలుగుమింతన్. భీష్మ. 1-48

క. చేతఁగాని యుప్పునములుట, రాతివయిని నుప్పుగామట రాత్రి దధి మధూ,పేతంబుగఁ గుడుచుట ధ,ర్మేతరములు రేయిపగలు లెగ్గు నరేంద్రా. అను. 4-110

(కర్ణుఁడు శల్యునితో)

ఆ. వావిలేక యెల్లవనితలుఁ బురుషులుఁ, గలయ మీరు నెగ్గుగాక యుండు, మున్నుగల్లు పిదపఁ జన్నఁబాలై పెరుఁ గుడుత్రు నెవ్వ నేం గుణముచింక. కర్ణ. 2-47

3. దోషము, అపరాధము.

శా. ...అట్టి శౌ,ర్యాలంకారు మహాత్ముఁ దా నరకుకేయం దచ్చో

తున్ మమ్మతం, డేలా కైకొను నాసుయోధనునియం దెగ్గేది యూహింపఁగన్. ఉద్యో. 2-145

సీ. అల్లన నవ్వుచు నయ్యంతి యతనితో, నాథ నీయం దొకనాఁడు నెగ్గు, గలదె. అశ్వ. 4-87

ఆ. ధాత్రి శంతనుఁడు విచిత్ర వీర్యుఁడుఁ బాండు,రాజు నెట్టు లట్ల రాజరాజు, ప్రజకు సంతసముగఁ బాలించె నీయందు, నతనియందుఁ గలదె యధిప యెగ్గు ఆశ్ర. 1-100

4. నింద,

చూ. ఎగ్గాడు.

క. కడు నమర శక్తియు నేర్పును, గడఁకయుఁ గలవారి నుఱక కడ వఁగ నెగ్గుల్, నొడివెడు వివేక శూన్యుల,కడ నుండెడు నంతకంటెఁ గష్టము గలదే ఆది. 8-149

5. చెడ శకునము, అశుభచిహ్నము.

క. ఖలుఁ డీ దుర్యోధనుఁ డెగ్గులతోడన యుద్భవిల్లె గోమాయురుతం, బులు వించె దుర్నిమిత్త ,ములు పెక్కువుట్టె వీని పుట్టిన వేళన్. సభా 2-178

6 చావు, అంగవైకల్యము.

ఉ. ...గ్గిసొరం దలంచునటు లర్జును నెక్కటిదాఁకఁ గోర్కి నీ,కెగ్గిది మాని మీ పలుకు లెవ్వరుఁ జెప్పఁగలేరు రూపఱ,న్నగ్గఁగఁ గాల మయ్యె నాకో నావచనంబు లోకించ కర్ణము,లొగ్గనిచ్చి యోధులు బలంబులుఁ దోడుగఁ బోరు టొప్పగున్. కర్ణ. 2-36

విశే.

1 కీడైనది, హానికరమైనది.

క అంటివరము చుట్టఱికం, బెంతయుఁగీ డంతకంటె నెగ్గు తదీయో, పాంత చరత్ జ్ఞవామన, కాంతాదుల తోడి పొందుకలిమి తటు నకున్. విరా. 1-181

2. ఏవగింపు పుట్టించునది, అసహ్యమైనది.

అ. అవులింత తుమ్ము వాపఁబు నష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ,

జలుపవలయు నృపతి గొలువున్న యెడం బా,హిరము లైనం గెలని
కెగ్గులగుట. విరా. 1-187

ఎగ్గుగొను దే. స. క్రి. (√ఎగ్గు)

ఎగ్గుగా భావించు.

క. కావునఁ బ్రభుత్వ సంపద, నీవిభుఁ డాడినది యెల్ల నెగ్గుగొనక సా,
చేవినుము నీదు ప్రతినకు, నేవిధిసేయవగు దానినేర్పడ ననఘా.
కర్ణ. 3-88

ఎగ్గులగ్గు దే. వి. ద్వం.

కీడును మేలును.

ఆ. బుధుఁడు సూక్ష్మవిమలబుద్ధి నప్పురుషుని, నరసి శాంచి యతని
యందు మనసు, డిగ్గవిడిచి యెగ్గులగ్గును బొందమి, శుద్ధశాంతిఁ
బరమ సుఖముఁ బొందు. శాంతి. 4-96

ఎగ్గులాడు దే. స. క్రి.

నిందించు.

వ నా కట్టిన పుట్టంబు నీకుం గట్టంగాదు గాకేమి యని సగర్వంబున
నెగ్గులాడి దేవయాని నొక్క. నూతం ద్రోచి కర్మిష్ఠ. ఆది. 3-138

ఉ. ధీయుత యంచు ధర్మజు నదీసుత కృష్ణుల నెగ్గులాడుచుం, బోయె
ననంబు వెల్వడి నపుత్త్రబలుండయి చైద్యుఁ డల్కతోన్.
భా. 2-15

ఎగ్గులుపట్టు; ఎగ్గులువట్టు దే. స. క్రి.

తప్పులుపట్టు, తప్పులుగాఁ దీసికొను.

క. జనవల్లభ యోగసమయము, విను మీతనితోడ నేను విచ్చలవిడిఁ
దోఁచిన మాటలెల్ల వాడుదు, నను నెగ్గులు పట్టఁగ దీనిం బోలె దొ
నరున్. కర్ణ. 1-256

ఎగ్గులుపలుకు; ఎగ్గులువలుకు దే. స. క్రి.

ఎగ్గాడు, నిందించు.

క. అలిగిన నలుగక యెగ్గులు, పలికిన మఱి వినవియట్లు ప్రతివచనం
బుల్, వలుకక యున్నము వడి యెడఁ దలఁచక యున్నతఁడు చూవె

ధర్మజ్ఞుఁ డిలన్. ఆది. 3-147

చ. ఇతనికి నిట్లు నన్ను ఱక యెగ్గులు వల్కఁగఁ బోలెఁగాక. సభా. 2-61

ఎచటు ఎచ్చోటు

తే. ధర్మదేవత నీదు సత్కర్మమునకు, మెచ్చి యొంతయు బ్రీతిమై నిచ్చినట్టి, వరము గలుగంగ మనమేమి వర్తనమున, నెచట నున్నను నొరులకు నెఱుఁగ నగునె. విరా. 1-61

ఆ. ఏది కులము నామమెయ్యది యెవ్వరి,దాన వేమి పనికిఁబూని యిప్పు డెచటు బుద్ధిఁదలఁచి యేఁగెద వింతయు, నెఱుఁగఁజెప్పు మాకు మెఱుఁగుఁబోఁడి. విరా. 1-312

ఎచోటు ఎచ్చోటు

క. ద్రుపదనృపాలుని ధవళా,తపత్ర మన్త్రంబు లెచోటు దాఁకక జిగి యా,రి పొలిచె, స్త్రీ. 2-147

ఎచ్చటు ఎచ్చోటు

క. మనయింట నిచ్చ టచ్చో,టన కెచ్చటనైన నీ బృహన్నల మెఱఁ గం, బఱదెదు మానిసి. విరా. 1-254

క. వచ్చితి నవుడు విని జను, లచ్చెరువును సందియంబు నడరెడు మదితో, నిచ్చెలువ కడువు కూటికి, నెచ్చటనే నిలుచు నట్టి యిది పలుకగునే. విరా. 1-299, కల్య. 2-54

ఎచ్చొటు ఎచ్చోటు

తోటకము – గరుపాఱఁగ మేను ప్రకంపమునం, బొరిఁ దొట్రువడం బదముల్ దొంగం, బోర నెచ్చొటు లేమి ననువ్వయ దీ, శర మొందినఁ జెడ్పడు భావము తోన్. స్త్రీ. 1-46

ఎచ్చో క్రి. ఎచ్చోటు

1. ఏ ప్రదేశమునందు.

ఉ. ... ఎ,చ్చో వసియించినం బిదపఁ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి

క్రైకొనన్. విరా. 1-166

సీ. ... అతఁడెచ్చో నున్న, వాఁడొ కోయనుడు నవ్వారిజాతి. శాంతి. 4-887

ఎచ్చోటు దే. వి. వ.

ఎచటు, ఎచోటు, ఎచ్చటు, ఎచ్చొటు.

(ఏ + చోటు—చూ. అచటు)

ఏతావు, ఏచోటు.

క. ఎచ్చోట నున్న వాఁ డతఁ డిచ్చోటికి నేల రాఁడొ. విరా. 5-801

తే. ... ఎచ్చోట నెదురుగా మెలఁగి రచట, మన రథం బల్లల్లన చనఁగ నిమ్ము. విరా. 5-10

ఎటు దే. వి. వ.

ఎచ్చోటు, ఎక్కడ.

వ. అయ్యింతి యింత సేపు నీ చేరువ నుండి యిప్పు డెట మెలఁగె. వి. 2-61

క. ఇటు గర్వించుట నీచత, యెట వోయెదు పొమ్ము. శాం. 4-393

వ. విధి వశంబున నన్నుం బాసి పోవ యేశ్వర్యుల నెట యేగియుం బోయిరె దన స్వేచ్ఛా సక్త చిత్తనై విపిన పరిభ్రమణం బెట సేసె. అర. 2-99

(ఎటయేయున్ = ఎచ్చటికో) శాం. 5-266

కి. ఏనెట నీవెట సుతుఁ డెట. అను. 4-99

(ఇట సంబంధము లేమిని దెల్పును.)

ఎటు దే. అవ్య. ఎట్టు

1. ఏవైపు, ఏతట్టు.

చ. ... ఏమనునో యెటు మాచునో యెవ్వరి దెస చెప్పుడే తలఁపు వచ్చునో యీతని కంచు. విరా. 1-129

2. ఏ ప్రకారము, ఏవిధము.

వ. ధృతరాష్ట్రుండు సంజయునితో నిత్తెఱంగువం బన్ని బవాలబిని

రంబున సమరం బెటు సేసి రని యడిగిన. ద్రోణ. 5-142

చ. ... తత్సమయంబున రెంటఁ గూడ నీ,వెరవున యూఁది చిత్త మున వేగిర పాటెటు లేక పొంచుమీ. అను. 1-272

(ఎటు = ఏ విధముగా నైనను)

**ఎటులు** దే. అవ్య. (√ఎటు)

ఏ ప్రకారముగా.

ఉ. . . . , నీవు, స,మ్మానము సేసి నాకిటు లమాత్యుఁడవైన పదంబు కంటె మే,లై నుతికెక్కు కోర్కి యెటు లారసి చూచిన నొందుఁ గల్గునే. ఉద్యో. 1-98

ఉ. . . . క,య్యమ్మున తెఱంగు సెప్పు మెటులయ్యెఁ బదంపడి సూత నందనా. ద్రోణ. 2-86

**ఎట్టకునేని** అవ్య. (ఎట్టకున్ + ఏని) ఎట్టకేని

చాల సేపటికి, చిట్ట చివరకు, అతి ప్రయాసమున, చాల కష్టము మీఁద.

ఉ. ఒల్లరు రాజు దేవులును నొద్దుల రాచిన చందనంబు మే, నెల్లఁ దెమర్పఁగా నలయ కేను శ్రమంపడి నిల్చి నిల్చి య,ల్లల్లన మార్గ వం బొనరు నట్లుగ నెట్టకు నేని రాచి మీ,తల్లికి భక్తిఁ బెట్టెదు విధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్. విరా. 2-220

**ఎట్టకేని** అవ్య. (ఎట్టకున్ + ఏని) ఎట్టకేని

చాలసేపటికి, చిట్ట చివరకు, అతి ప్రయాసమున, అతి కష్టము మీఁదఁ.

తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని, సింహబలు మందిరం బల్లఁ జేర నరిగి, యొల్లఁ బోవుచు బెబ్బులియున్న పొదరు, సొచ్చు లేడి చందంబునఁ జొచ్చుటయును. విరా. 2-112

వ. . . . ఇక్కార్యంబున దోషంబు లేదు విని ప్రకరణంబయిన నా హృదయ శల్యంబు నుద్ధరింపుమని ధృతరాష్ట్రి నెట్టకేనియు నొడంబఱిచి దుర్యోధనుండు. ఆది. 6-180

**ఎట్టకేనియు** దే. అవ్య. ద్రు.

ఎట్టకేని.

వ. ఈ దేవియును (కుంతి) బతితోడన నోపి సమగట్టినం బుత్త్రరక్ష ణార్థంబు మునిగణ ప్రార్థితయై యెట్టకేనియు ధృతి ప్రాణ యయ్యె. ఆది. 5-166

**ఎట్టకేలకు** దే. అవ్య. ద్రు. (ఎట్టకున్ + ఏలకు)

ఎట్టకేని.

చ. అనుటయు నెట్టకేలకు ధరాధిపుఁ డట్టుల కాక యంచు.
విరా. 1-287

చ. ఒకరుఁడ తాను నీతి వెరదొంరెదు రెండవ కన్న నెట్ట కేలకు దగఁ దేర్చునప్పుడు బలంబులతోఁ గురురాజు నూడ. విరా. 5-886

**ఎట్టి** దే. విశ. (ఎట్టు + ఇ)

ఎటువంటి.

ఆ. ఎట్టి సాధ్వులకును బుట్టిన యింద్లను బెట్టకాల మునికి నెట్ట కనదు.
ఆది. 4-65

తే. యోగి యెట్టి యాహారంబు లుడుగవలయు. శాంతి. 6-591

(ప్రశంసాదులను దెల్పును.)

ఉ. ఎట్టి లా వెట్టి పరాక్రమస్ఫురణ మెట్టి గయంబని పిచ్చ గింపఁ న.
ఉద్యో. 1-280

**ఎట్టిపాటివారు** దే. సర్వ. బహు.

ఎంతటి వారు.

ఆ. దైవ వశమున, నెట్టిపాటివారు నట్లుఁగారె. శాంతి. 4-426

**ఎట్టిండు; ఎట్టిఁడు** దే. సర్వ. ఏక. (ఎట్టి + వాడు)

ఎటువంటి వాఁడు.

క. తివిరి సుత జన్మం బెట్టిం,డవు నాకో దేవరుఁడు వాగు వనుచుం.
ఆది. 4-252

క. ఇనఁడెట్టిఁ డైన నేమగు, నతనికి సఖుఁడట్టి బల మహా త్తర సఖ్యం, బితనిం బాత్రముఁ జేయదె.
శాంతి. 3-492; శాంతి. 4-418

**ఎట్టు** దే. అవ్య. ఎటు

ఏ విధము, ఏ ప్రకారము.

ఎట్లు

ఉ. ... ఇప్పు డిటు బ్రుంగుడుపాటునఁ బొందఁ జూచి నా, కెట్టు
మనంబు వట్టు ధృతి యెమ్మెయిఁ దూలక నిల్చుఁ జెప్పుమా.
విరా 2-192

ఎట్టులు దే. అవ్య. ఎటు, ఎటులు

ఏ విధముగా, ఏప్రకారముగా.

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టులనియె సీ వత్సర, మొకఁడు నెట్టులయిన
నుడిగి మడిగి, సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి
పిదప నెగడవలయు. విరా. 1-143

తే ఎప్పు డెయ్యెడ నేమిట నెట్టులరయ, వలసె నెమ్మెయి నారయు,
మలసి డస్సి నొచ్చియైనను. విరా. 2-214

ఎట్టులొక్కొ (ఎట్టులు + ఒక్కొ)

ఏ విధముగాఁ గానున్నదో - ఏ విధముగాఁ బరిణమించునో.

ఆ. ... ఇమ్మని, యేల సైఁచు నింక నెట్టు లొక్కొ. అర. 2-827

ఎట్టెట్టు (ఎట్టు + ఎట్టు)

ఏమేమి (ఆశ్చర్యమును దెలుపును.)

సీ. అనవుడు రాజునుం డట్టహాసంబుతో, నెట్టెట్టు భీముండ
యీతఁ డేమి. అర. 1-116

ఎట్లొకో ఎట్లొకో

ఏ విధముగాఁ బరిణమించునో.

క. ఇట్టగు కొలుఁగక వచ్చితి, మెట్టొకొ మన భంగి వీరలిందఱును
గడున్ బెట్టిదులు. విరా. 4-5

ఏపట్టున నైనను, ఎట్టి పరిస్థితి యందైనను.

ఆ. ఎట్లనియొని గూర్తు రింతులు మాకని, విశ్వసించు వారు వెడఁగు
లెందు. అర. 2-164

ఎట్లు ఎటులు, ఎట్టులు

1 ఏ ప్రకారము.

వ. తత్ప్రకారంబు నడపెద నది యెట్లనిన. విరా. 1-48

2. ఏ ప్రదేశము, ఏ తావు.

(భీష్ముఁడు కర్ణునితో)

చ. నెపమిడి యోహటించి యిటు నీవు దొలఁగినఁ బోవ వచ్చునే. కుపిత మనస్కుఁడై నరుఁడు గూల్పఁ గ్రమంబున దొడ్డలెల్లఁ జూ వ్వ విడప నెట్లుఁ జొచ్చెదు. ఉద్యో. 4-249

(ఎట్లుఁ జొచ్చెదు = ఏ తావునకుఁ బోయెదవు)

ఇది సం. ము అకాడమీ ప్రతుల పాఠము. ఎట్లుఁజచ్చెదు పాఠాంతరము - ఆనంద ప్రతి ఎట్లుఁ జచ్చెదు—పాఠము ఎట్లుఁ జొచ్చెదు పాఠాంతరము. ఎట్లుఁ జచ్చెదు = ఏ విధముగా నైనను చచ్చెదవు.

3. ఇది వ్యతిరేక క్రియలపై 'వల' అను నర్థముతోఁ బ్రయోగింపఁబడి యుక్తార్థమునందు నిశ్చయమును దెల్పును.

ఆ. ... ఇట్లు వడిన వీరలు వదవడి, తమకు నగ్గమైన గెలి జయింప రెట్లు - (నిశ్చయముగా జయించిరి.) విరా. 1-56

4. అన్ని విధముల.

ఆ. రాజు నొద్దఁ బలువురకు సంకటముగాఁగఁ దిరుగు పనుల కెంత తేజమయిన, వాని బుద్ధి గలుగు వారొల్లర మీఁదఁ గీటు దెచ్చు కెట్లు సిద్ధమగుట. విరా. 1-126

5. సంబంధ సర్వనామముగా నుపయోగించుట.

ఎట్లు - అట్లు

వ. మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియంబట్లు సేయు వాఁడ కాక. ఉద్యో. 1-377

**ఎట్లుచెప్పిన; ఎట్లుసెప్పిన** దే. అ. క్రి.

ఏ విధముగా అనుకొనినను, ఏ ప్రకారముగా ఆలోచించినను.

చ. ఇది పెను బాము చందమున నెంతయు భీషణమై జనంబులన్, బెద రఁగఁ జేయు; నట్లగుటఁ బెట్టి చనన్ వలయుం దలంచి చూ, వ్వార యము దీనిఁ గాయుటకు నియ్యకొనం గొరదెట్లు చె (సె) ప్పినం, దుది నొకచోట నైచుటయ తోఁచిన కార్యము సెయ్యకుం గటా. విరా. 1-160

## ఎట్లొకొ, ఎట్లొకో, ఎట్లొకొఁ, ఎట్లొకోఁ, ఎట్లొ-

క మునినాయక మృత్యువు ప్రభు, వని విందుము లోకమునకు నది
యెట్లొకొ. ద్రోణ 2-159 (ఏ ప్రకారమో)

క. ... వారు లి, త్తతి నీళులు ద్రావక తెప్పిరి యెట్లొకొ శత్రు
సైన్యభీకర మూర్తీ
ద్రోణ. 3-160 (ఏమి కారణమో) ద్రోణ. 5-46

## ఎట్లొకో

1. ఏమగునో, ఏది జరుగునో.

ఉ. ఎండకు వాన కోర్చి తన యిల్లు ప్రవాసపుఁ జోటునాక యా,
కొండు నెలంగుడున్ నిదురకుం దఱిదప్పెడు దప్పిపుట్టె నో,క్కం
డన యెట్లొకోయనక. విరా. 1-136

2. ఏమి కారణమో,

సీ. శుభలక్షణాంగి యీ సుందరి సైరంధ్రి, యగు నెట్లొకో యని
వగచు వారు. విరా. 2-146; శాంతి. 6-398

8 ఎందులకు జరుగఁ గూడదు, జరుగ వచ్చును అని భావము.

చ. ... ఈ బలం,బుల కధినాథుగా ద్రుపద భూపతి బట్టముఁ గట్టు
టెట్లొకో. ఉద్యో. 4-99

ఉ. ... విక్రమా,పన్నిత వైరి భీముఁడును వారికిఁ దోడుగ నేఁగు
టెట్లొకో. ద్రోణ. 4-129

3. ఎటులం సాధ్యపడునో.

వ. మునుల వలన శూద్ర జాతి భామలందుఁ బ్రభవించిన వారికి
బ్రాహ్మణత్వంబు గల్గుటది యెట్లొకో యని వితర్కించి.
అను. 2-26

వ. బ్రాహ్మణునకు శూద్రజాతియందు భార్యా పరిగ్రహంబు సేయం
గు నని విందు నతనికి భార్యలు ముగ్గురని నిర్దేశించితి రది
యెట్లొకో యనుటయు. అను. 2-280

## ఎట్లొకొఁ

ఏమగునో, ఏది జరుగునో.

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రిం కెట్లొక్కొ యంచున్ భయం బొదవం. విరా. 8-27

ఎట్లొక్కొ

ఎట్లు జరుగునో, ఎట్లు సాధ్యపడునో.

క. ఏము నిను మత్స్యరాజన్య, శ్రీమహిమకు నెల్ల యుక్తుం జేయం దలంపం,గా మా మనోరథమునకు, నీ మాట విన్కి పుట్టె నిది యెట్లొక్కొ. విరా. 1-286

ఎట్లో

సంభవము కామిని సూచించును.

క. మేలు దొరకొను విధమెట్లో. భా. శి. 8-133

ఎడ[1] దే. వి.

1. స్థానము, చోటు.

తే. ఇట్లు దమదమ వర్తిల్లు నెడల నగరి, జనములకు హృదయాను రంజన మొనర్చి. పరా. 2-8

క. మన మొక యేవుర మీ యం,గనయుం దోనరుగు దేగంగా నెయ్యెడం బో,యిన నెఱుంగకుండుదురె. విరా. 1-59

వ. సరిగా రెండెడలకు, నరులు సమటం గోరి మనమునన్. అను. 5-160

ఆ. ... పార్థు, నరిగి నెడక మనము నరిగి యుతని యున్నచోన ప్రీతి నుండుద మిందుండ, నేల యనుచుం జొరుటెల్లం దోలి, ఆది. 6-142 అర. 2-178

2. ఎడము, అంతరము.

వ. అంత నంకుమంతుండు శాంతుం డగుచు వచ్చె నట్టి యెడం గడిసి కవ్వడి గాంగేయుపైం గ్రూర నారాచ నికరంబులు నిగిడించి పదం ద్రోచిన. భీష్మ 3-411

వ. యోధవీరులుం గుమారులు వెక్కు పెట్ట ధృష్టద్యుమ్నుం బొదివిన నతండు ద్రోణదత్త ప్రమోహన బాణంబున వారినందఱ నిశ్చేష్టితులం జేసినప్పుడు దప్పి దీర్చికొన నెడగని యవిలంవందనుం

డొక్క మడువున మధుర శిశిర జలంబులఁ బానంబు సేసి.

భీష్మ. 2-373

3. అవకాశము, వ్యవధానము.

వ. ఇవ్విధంబున నం గృపాశ్వత్థామ శల్యవృషసేనులు దెంపు సేసి సైంధవున కడ్డం బైనం జూచి యాసవ్యసాచి యతనిఁ దెగఁజూడ నెడ గానక యవుడుగఱచుచుఁ బ్రొద్దుదిక్కు గనుంగొనినఁ గేశవుం డిట్లనియె. ద్రోణ. 4-311

క. కొండొక యెడఁ గని శాంతనవుం డాఖండల తనూభవుని డామూఁపు గ్రుద్దఁడ భుజబలము మెఱయఁ బ్రచండాస్త్రహతము సేసె

విరా. 5-175

తే. శోకభయ కారణంబులు లోకమున ననేకములు దానఁ దలసూపు శోకములకు, భయములకు బుద్ధి నెడయీఁడు పండితుండు, మూఢుఁ డవి ప్రోవనేరండు మునుఁగు వగల. శాంతి. 1-188

ఉ. నాకెడ యిమ్ము నెమ్మి కురునాథు మనఃప్రియ ధర్మపత్ని నే, నేకత మెట్టులుండదు మహీపతితోడనపోదు. ఆది. 5-144

తే. తేరు డిగ్గి పారించెఁ గ్రీడి గాండీవ గుణంబు.

చ. ఎడగని యబ్బలంబు గడు నేర్పెఱఁ గిట్టి మహాస్త్రశస్త్రముల్ గడువడిఁ గుప్పఁగూరగఁ జలంబున బైఁ దొరఁగింప.

ద్రోణ. 3-151, 152

శ్లో. ఇదం ఛిద్రమితి జ్ఞాత్వా ధరణీస్థం ధనంజయమ్.

సం. భా. ద్రోణ. 99-42

4. సమయము.

క. అమరనగరంబున నరిగినయెడ మూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన. విరా. 1-87

వ. అదియును నిలిచి మార్కొన్న యప్పుడును నడచు నెడనుగాదు.

శల్య. 2-305

క. గెలుపు నెరవేయు నెడవడిఁ బలుచు నెడం దొడఁగు నెడ నపారబలం బుల్, మెఱయు నెడ భీమునకు నం, దొలుఁ గిడ్పడఁ దొడఁగి రుద్ధ

తులు రాజసుతుల్. ఆది 5-164

సీ. ఇతని విక్రమ మాశ్రయించియకాదె య,ద్యోధ లగ్గయిల్లు వెల్వడఁగఁ గంటి,మి. ఆది. 6-278; అను. 2-195

5. గడువు, వ్యవధి.

వ. ...అర్ధేని నహంమకడకుం జని సముచితంబుగాఁ దదీయ సాంగత్యంబున నెడవలికి గొనివచ్చునది. ఉద్యో. 1-162; ఉద్యో. 1-186

(ఎడవలికి = గడువుగా మాటాడుకొని అని తాత్పర్యము)

ఉ. అల్లన యింతి యిట్లనియె నారసి నా పుణ్యమేమియుం, దెల్లముగా నెఱిఁగికొని తేఁకువ వేకిట వచ్చుటొప్పునా, యుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె నీ, వెల్ల నెఱుఁగు దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. ఉద్యో. 1-186

సీ. పలుకుల కెడలేదు తాదాత్మనము గాని,చను దెమ్మ నా తోఁడ.
ఆది. 8-118

6. విరామము, విచ్ఛిత్తి.

తే. పుత్త్రి వినుమేము దశుని పుత్త్రి నన్నుఁ, బావగావ కిచ్చె మా తండ్రి బాల్యమునను, నన్ను నతఁడంత యొల్లఁడు నాకుఁ బతి, యెపుడు నెడలేని పొందుగా నీవొసగుం. అర. 5-259

7. తెఱపి, తీఱిక.

ఆ. వేగ జాముగలుగ నెడనిద్రఁ బొందుదుఁ,గాని రాజ్యభార కార్య యుక్తి, నట్లునయన నాకు వావోగనిద్రలం, తదయు లేదుము వే యెల్లప్రొద్దు. అర. 5-803

8. మధ్యము (నడిమి ప్రదేశము)

సీ. ...నూత్నముక్తాదామముల తోడఁ, గుసుమమాలిక నెడ గ్రుచ్చి ప్రేలఁ గట్టించి. విరా. 5-886

తే. ...మీ తండ్రి క్రీడిపై నదర నడుమఁ, గొల్చె సాత్యకి యన్నదియు తుఁడు శక్తి,నైన మెయివాల్చి యది పట్టి వైచె ముగుద, నాతఁడా థిమ్ముఁ దెడఁ దునుమాడె నధిప. భీష్మ. 3-286

క. కదిసి శరాసనగురు డిరు,వది యేను శరంబులేయఁ బార్థుఁడు వా నిం, గుదియించి విశాలాస్య, ప్రదరము లడరింపఁ గుంభభవుఁ డెరఁ ద్రుంచెన్. ద్రోణ. 3–75

క. అని మామఁ బలుకు పలుకులు, విని యశ్వత్థామ క్రోధవివశుం డయి గ్ర,క్కున వాల వెఱికికొని క,ర్ణుని దెసకుం గవియ భూవరుం డెడ సొచ్చెన్. ద్రోణ. 5–106

9. ప్రవేశము, చొరవ.

వ. ...పృథివి శాసింప భవదీయ విభవం బుజ్జ్వలంబై యొరుల కెడ లేక చెల్లుచున్న దెంత యొప్పగునో యటు విచారింపుము. ఉద్యో. 2–89

10. స్థితి, సందర్భము.

వ. విప్రుని దండించు నెడలునుం గలవు శుక్రుండును జెప్పిన వాఁడు వినుము. శాంతి. 2–174

వ. పద్మవ్యూహంబు సంఘటించునెడ వివిధ దేశంబుల రాజులు దళంబులును. ద్రోణ. 2–4

11. వీలు, అనుకూల్యము.

చ. ఎడగని వాలు బల్లెమున నేసె వెసం దునియంగ ద్రోణుఁడు. ద్రోణ. 2–112

క. ఇవి మీ కన్నియుఁ జేయఁగ, నవునని తలఁపకుఁడు భూసురావాలి మంత్రోద్భవ దారుణ దహనశిఖల్, గవిసిన నెద్దియును జేయఁగా నెడ గలదే. ఆది 2–182

12. దూరము.

చ. ఎడ వగు దెంచె బబ్బిన్నకిఁ బ్రబదతీబ స్వ త్తిగఁ దేరుపోవ ని,మ్మెడ గలుగంగఁ గోయెఁ బసులిప్పుడ కూడుదమన్న. విరా. 4–171

(ఎడగలుగంగ = దూరముగా)

క. వేత్ర హస్తులు దొలంగు తొలంగుం డని నెడ గలుగ జడియ (ఎడ గలుగంగ = దూరముగా నుండునట్లు.) భీష్మ. 3–169

వ. పవమానసూనుం డవమాన పూర్వకంబున నీవెందులవాఁడ వింత ప్రొద్దెల వచ్చితెట వోయెదెడ గలిగి పొమ్మనిన విని హిడింబ యిట్లనియె. ఆది. 6-191

సీ. అడవిలో నిద్రావశాత్ములమై యున్న, మన నిద్రఁ దెలుపంగా దని హిడింబ, యెడ గల్గఁ గాని పోఁబు రొక్కటి చంపిన. ఆది. 6-278

చ. ... అచ్చటన్, జను లెడయేట గాంచు నెఱిపాలకా. విరా 2-247

13. ఆలస్యము, విలంబము.

క. ధరణీసురులకుఁ గడు, నెగ్గై యెడ నెఱిఁగి యొడయుఁ జేయుదురె మహా,పురుషుంని నరుఁడు విలుగోని. (ఎడయున్ = ఆలస్యమును) ఆది. 8—119

14. విధము.

సీ. ... ఆలోయల సమద వృత్తి, నెట్టకేలకు వోకయొడ మాన్చి. మౌస. 1-183

(ఒక యెడ = ఒక విధముగా — అతి కష్టము మీఁద — అని భావము.)

15. అడ్డు.

వ, అనిన విని కుటిలం బగు నతని యభిప్రాయంబునకుఁ గోపించి యస్త్ర గురుఁ డవ్వరంబునకు నేమేనియు నెడపెట్టి యిచ్చువాఁడుగా నూహించి. ద్రోణ. 1-112

శ్లో. సత్య మిచ్ఛామ్యభిప్రాయం, జ్ఞాత్వా ద్రోణో౽ర్థ తత్త్వవిత్.
తం వరం సాంతరం తస్మై దదౌ సంచిత్య బుద్ధిమాన్.
సం. భార. ద్రోణ. 12-19

విణ.

16. అధికము, మిక్కిలి.

చూ. ఎడదవ్వు.

అవ్య. ద్రు.

17. అందు, విషయమున.

తే. ... తల్లి ప్రజల, యెడ విరోధంబు వాటించు టెంత మేలు.
ఉద్యో. 3-265

క. మా తండ్రియెడం జేసిన, పాతకము కతంబుగాఁగఁ బాంచాల
నికృష్టా తుని మెద నిను. కర్ణ. 2-327

క. ... సజ్జన సేవ్య యన్న దానము, మును లధికం బంద్రు పాపములం
బాపు నెడన్. అను. 4-270

ఎద₂ వై. వి. ఎడఁద, ఎద్ద, ఎడ్డ, ఎడ, (సం. హృద్)
హృదయము.

తే. దీని కెడ నియ్యకొని వేడ్క నూని కృతిప, తిత్వ మర్థించి వచ్చితిఁ
దిక్కశర్మ. విరా. 1-18

క. ... కుమ్మరి కోలను సారెంబోలిత్రిం దలఁచి చూచు మెదన్.
అను. 1-16

తే. ... బెట్టులూకుఁ, దదరి యన్న కులానుజు నంపవెల్లి, ముంప
నతఁడేచి పటు భల్లమున శిరంబుఁ, ద్రుంచె నన్నల యెదలు సం
తోష మొంద. శల్య. 1-386; విరా. 5-82

ఎద₃ విశే.
స్వల్పము.

ఆ. కర్షకునకు వేళ కాల మెఱుంగుట, యట్టి కాని కేది సంభవించె,
నందు విలువ మొదలనగు లాభమును నెద, వ్యయము గల్గుటయు
శివప్రదములు. అను. 5-75

ఎదఁగాంచు దే. స. క్రి.
దూరమునఁ జూచు.

మత్త:—మహామునీంద్రుల యాశ్రమం బెదఁగాంచె నంభోరుహాక్షి
పురా సమార్జిత పుణ్యకర్మ ఫలంబునన్. అర. 2-96

ఎదఁజొచ్చు దే. అ. క్రి.
1. నడుమఁ జొరఁబడు.

ఆ. అప్పు డర్జునుండు దప్పక చూచి యీ, బలము పసుల కడ్డపడక
యుండ, నెద సొరంగ వలయు నిట యెయ్యి కొనుమని పనిచె.

మత్స్య భూమిపాల సుతుని. విరా. 4-267

క. ఎడఁజొచ్చి చిత్రసేనుఁడు, పదముఁదిపై నేయ. భీష్మ. 8-57

2 అడ్డుపడు.

క. ద్రోణాచార్యుండు సుత,త్రాణ పరత్వమునఁ గృష్ణు తమ్ముని పై, నక్షీణోద్ధతిఁ గవియుడు గీ,ర్వాణాధిప సుతుఁడు వచ్చి వడి నెడఁ జొచ్చెన్. భీష్మ. 8-318

**ఎడఁద** వై. వి. ఎద్ద, ఎడ్డ, ఎద[2] (సం. హృదయము)

హృదయము, మనస్సు.

తే. వికట విస్ఫురదసిచర్మ వివిధ చిత్ర, గతులు చూపఁగ యెడఁద కద్భుతము సేయ. ద్రోణ. 1-171

తే. ఎడఁద సొగయించు మాటల నెలమి మిగుల. విరా. 2-64

**ఎడఁబడు** దే. అ. క్రి.

ఊఱట గొను, విశ్రాంతిపొందు, తెంపు అగు.

క. ఎడఁబడక యహోరాత్రులు, వడిఁగొని చదివింప నిట్లు వఱయునె.
అర. 3-288

**ఎడఁబాయు** దే. అ. క్రి.

విడుచు, త్యజించు, పాయు.

ఉ. హా యను ధర్మరాజ తనయా యను నన్నెడఁబాయ నీకుఁ జన్నె యను. ద్రోణ. 2-242

**ఎడగను** దే. అ. క్రి.

వ్యవధి పొందు, అవకాశము పొందు, వీలు చూచుకొను.

చ. ఎడగని వాలు బల్లెమున నేసె వెసం దునియంగ ద్రోణుఁడు.
ద్రోణ. 2-112

క. రేయును బగలును విదురుఁడు, నీయొద్దన యునికిఁ జేసి నేరము పలుకన్, మా యిష్టం బెఱిఁగింపఁగ, దీయుత యెడఁగంటి మిన్ని దివసంబులకున్. ఆది. 8-18

**ఎడగర** దే. వి.

చిత్త స్వాస్థ్యములేమి, నిద్రలేమి వలనఁ గలుగు వేగిరపాటు లేక తొట్రుపాటు.

చూ. ఎడగరపడు.

**ఎడగరపడు** దే. అ. క్రి.

చిత్తస్వాస్థ్యము లేకుండు, నిద్రలేమి వలనఁ గలుగు వేగిరపాటు లేక తొట్రుపాటును బొందు.

సీ. ...నీవు డస్సి,యున్నవాఁడవు నిద్రయును లేకయున్న నీ,వెడ గర పడితొ ది యడవిలోన. సౌప్తి. 1-61

శ్లో. చిరం తే జాగ్రత స్తాత స్వప తావన్నిశామిమామ్
విశ్రాంతశ్చ వినిద్రశ్చ స్వస్థ చిత్తశ్చ మానద.
సం. భా. సౌప్తి. 4-4, 5 (వావిళ్ల)

**ఎడగలయు; ఎడగలుగు** దే. అ. క్రి.

1. దూరముగాఁజేరు, దూరముగా నుండు.

క. నిలిచిన సకల జనులు నెడ,గలిగి బలసి నిలిచిరవుడు. శల్య. 2-280

(ఎడగలసి — అని సం.ము పాఠము అప్పుడు నిదియే యర్థము)

వ. వేత్రహస్తులు దొలంగు తొలంగుండని సందడి నెడగలుగ జడియ భీష్మ. 3-169

వ. ధృతరాష్ట్రుిండు గొండొక యొడకలుగం జనియె. ఆశ్ర. 1-157

2. వ్యవధియుండు, సావకాశము చిక్కు.

క. ఇవి మీ కన్నియుఁ జేయఁగ, నవునని తలఁపకుఁడు భూసురావాలకి మంత్రో,న్నవదారుణ దహనశిఖల్, గవిసిన నెద్దియును జేయఁగా నెడగలదే. ఆది. 2-182

**ఎడతెంపి** దే. వి.

వ్యవధానము.

చ. ...భయంపడి యిద్దెస వచ్చెనేని న,త్తెఱగయిపోమె యంచు నెడ తెంపిగఁ గొందఱు వాయఁబాఱఁగన్. విరా. 5-61

(ఎడతెంపు-అని పాఠాం)

**ఎడతెంపు** దే. వి.

చూ-ఎడతెంపి.

**ఎడతెగు** దే. అ. క్రి.

ఎడపడు, విచ్ఛిన్నమగు.

క. ద్రోణుఁడు రయమున వేసిన, బాణము లెడ తెగి యొక్క బాణము పోలెన్, శ్రేణియయి పోవఁ బార్థుఁడు, రేణువు గావించెఁ గంటిరే చిత్రగతిన్. విరా. 5-129; విరా. 5-41

క. జనవినుత యగ్నిహోత్రం,బును సంతానమును హోమములు నెడ తెగఁగాఁ, జన దుత్తమ వంశజులకు. ఆది. 4-181; ఆది. 4-221

**ఎడత్రెవ్వు** దే. అ. క్రి.

ఎడతెగు, విచ్ఛిన్నమగు.

క. వెనుకవ యెడ త్రెవ్వక పదు, నెనిమిది దివసములు సల్పె.
శల్య. 1-348

క. మడు వింకఁగఁ బాఱెను నీ,రెడ త్రెవ్విన పొండు చోటి కేఁగఁగ రాదె,ప్పుడు నింకని నీళ్ళులుగల, మడుగు పుష్కలము పోవ వలదె మనకిట్టి యెడన్. శాం. 8-186

**ఎడదవ్వు** దే. వి.

మిక్కిలి కాలవ్యవధి, చాలా కాలము గడచుట.

క. ఎఱుఁగఁడొకో నన్ను నెఱిఁగియు, నెఱుఁగని యట్లుండునొక్కొ యెడ దవ్వగుటన్, మఱచెనొకో వస్త్రాభరణములు, మఱునాఁటి బహు కార్యభాగమగ్నులు గారే. అను. 4-68

**ఎడదాఁటు** దే. అ. క్రి.

లంఘించు, ఉఱుకు.

చ. కరిపతి జిట్టురం బిరిగి క్రమ్మఱ నూఁకిన వృష్ణి వీరుఁ డుద్ధుర రథ ముద్ధతిం బెనఁచి తొండమునన్ వెస నెత్తి విచ్చి,త్తె రయము మైనతం డిలకు జిత్రముగా నెడదాఁటి పోయెు. ద్రోణ. 1-324

**ఎడనుడుగు** దే. అ. క్రి.

నడుమమాను, మధ్యలో విరమించు.

క. ...తపకుఁ, దలరఁగఁ బ్రేరేపకేల కానెడ నుడుగున్. ఆది. 2-178

**ఎడనెడ** దే. వి.

అ: క్రిందక్రింద.

వ. పశ్చిమాభిముఖ ప్రయాణంబుల నెడనెడ వన్యాహారంబుల శరీర యాత్రలు నడుపుచు. విరా. 1-147

2. అప్పుడప్పుడు.

వ. తమకంబు నెడనెడ నతిముతిం దద్రథంబు దెసకు నతఁడు వాఱి విడిచిన విశిఖంబులు నూఱు గలవు. ద్రోణ 2-228

3. మధ్యమధ్య, నడుమనడుమ.

సీ. కజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు, ధృతరాష్ట్ర సుతుఁడు పుత్తెరఁ బ్రీతి, నెడనెడఁ గొనివచ్చి యిచ్చిన వానినెల్లను వేడ్క ననుభవించిన విధంబు-తే. సలిపి యనుభవ మొల్లక చనఁగ. ఉద్యో. 3-178

సీ. ఇరుప్రొద్దుగుడుచుచు నెడనెడఁ గుడువక యుండు వాతండు సదోప వాసి. శాంతి. 4-868

**ఎడపక** దే. అవ్య. (ఎడపు ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకము)

1. తొలఁగక, వీడక, వదలక.

వ. ...చలం బెడపక నీమఱంది యన్న కులాసుఖుల గిట్టి. శల్య. 1-860

ఆ. ...వాని, నడపకయు నిష్ఠయెడప కతఁడు. శాంతి. 2-222

క....అ,య్యేవురు పతులందు ధర్మ మెడపకయుండుం, గావున. ఆది 7-262

2. వారు, వీరు అను భేదము లేకుండ.

క. అడవులునేఱులు నదినీ, పడసిన యవి యట్టె పుణ్యభాగీరథి యుప్పు డమిఁగల జనులకెల్లను, నెడపక సేవ్యంబకాక యది నీయుదయో. ఆది. 7-40

మనః పూర్వకముగా. సభా. 2-80

చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితిమి.

2. తొలఁగించు.

క. నా కీడు దలఁపనేరక, శ్రీకినెడపి పాడియింత సేయక పుత్త్రా, నీక సుహృద్బాంధవులం, బోకార్చితి బ్రతుకుటింకఁ బొసఁగునె చెపుమా స్త్రీ. 1–13

3. తప్పించు.

క. ...కిలెడసిన జంత్రము, వడుపునఁ బడనేసె నతని వాసవి యధిపా. ద్రోణ. 3-79; ద్రోణ. 1-371

ఎడపెట్టు; ఎడవెట్టు దే. స. క్రి. (√ఎడపడు)

1. విడుచు, విడిచిపెట్టు.

గీ. దినము లెడపెట్టి కుడుచుచు. అను. 4–148

క. గెలుపును నోటమియునునని, గలుగవె యెడపెట్టి యెట్టి ఘనులకు నిమ్మైకఁ, బలుకుదురే తగువారిం, తులువా నీకులము గుణముఁ దోఁచెం బ్రజకున్. ద్రోణ. 4–289

(ఎడపెట్టు = ఒక దానిని విడిచి యొకటి ఒకటి తరువాత నొకటి ఎడు పడి అని భావము).

2, అడ్డుగాఁబెట్టు, మితిగాఁ బెట్టు.

ఉ. గురుని ప్రతిన వింటె వెరవున లావునఁజేసి దీని బొంకు సేయవలయు నెఱుఁగు మతఁడు నిన్ను నెడవెట్టి పలికిన, వాఁడు గానఁ జెప్ప వలసె నీకు. ద్రోణ. 1–116

వ. అనిన విని కుటిలంబగు నతని యభిప్రాయంబునకు రోసి యత్త్రు గురుం డవ్వరంబునకు నేమేనియు నెడవెట్టి యిచ్చువాఁడుగా నూహించి. ద్రోణ. 1–112

శ్లో. తస్య తీవ్రాం మభిప్రాయం జ్ఞాత్వాద్రోణోర్థ తత్త్వవిత్, తం వరం సాంతరం తస్మై దదౌ సంచిన్త్య బుద్ధిమాన్. సం. భార–ద్రోణ. 12–19

ఎడపొందు దే. వి.

మనసు తగిలియుండుట.

క. వలలుని దెస మాలిని చూ,డ్కుం డెలుం గెంపొందు(దెలిపెసుం
గంటిరె పీ,రలు వచ్చిన సమయంబును, [illegible] నొక్కటియ
యవ్విధం బెట్లొక్కొ. విరా. 2–200

**ఎడమ** దే. విశే.

సవ్యము, డాపలిది.

ఉ. ధర్మము మాని యూరులు గదం బోడి సేసిన యంత(బోని దు,ష్క
ర్మ(డు వాయుజుం డెడమకాల శిరంబంటు దన్నె సౌ ప్తి. 1–221

**ఎడమడియు** దే. అ. క్రి.

సమయము దాటిపోవు, అవసుచెడు.

క. ఇరుపతికి జయము గోరెదు, గురుపుత్త్రు(డు ముల్లోకములలో
యిటు తలికిం. జోరక యెడమడిసినసు మఱి,పగవాం జేవయును
జూప వేడుకవడియెన్. సౌప్తి. 1–207

**ఎడమడుగు; ఎడమడువు** క్రి. విశే. (ఎడమ + అడుగు)

1. వ్యత్యస్తము, తాఱుమాఱైనది.

క. నడిపింపంగ( బోడిపింపంగ, నెడమడుప్ప [illegible] చేవ్వంగ
నే, గడు సేర్తు( బేర్పునావగు, కడిమియు నీ [illegible] గొనెన
గా దే. ఉత్త. 4–214

2. విపరీతము, విరుద్ధము,

క. పొడవున( బ్రాయంబున( గడు(,నడిచి బలంబు ను [illegible]
[illegible] నీ,కొడుకని యూహని చెంతయు, నెడమడుగు([illegible] జూప
దెత్తె యిందఱు నగగాన్.

వ. ఇట్టి లోకవిరుద్ధంబులకే మోదుదు మయుక్తంబులయిన పలుకులు
పలుకక. ఆది. 4–100, 101

**ఎడమిచ్చు** దే. అ. క్రి.

అవకశమిచ్చు

తే. అతిథులకు నెడమిచ్చి యాహారములను, భక్తివాత్సల్యములలోన(
బంచిపెట్టి. ఆశ్వ. 2–170

(ఎడమిచ్చి = ఆతిథ్యమిచ్చి అని ఇక్కడ భావము)

**ఎడము** దే. వి.

1. నడిమి భాగము. మధ్య ప్రదేశము.

సీ. కవట లోఁడోంటితోఁ గదియుచు నెడములు ప్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులు వాని. విరా. 1-162

2. చోటు, స్థలము, అవకాశము.

ఆ. అనఘ నీ ప్రయత్నమున నా శరీరంబు, పొదలె నిందు నాకు మొదల నెడము, సాలగట్లుగాన మేలుగ నొండొక యెడకుఁ గొంచుఁ బొమ్ము నెడఁగి నన్ను.

వ ఆనిన నతం డాజలచరంబులఁ గైకొనిపోయి యొక్క వావియందు విడిచిన నది యెప్పటి యట్ల యక్కజంబుగాఁ బొదలి తనకు నవ్వాపియందు నవకాశంబు పర్యాప్తం బగుటం జెప్పి యతనిచేత గంగిమడవున విడువంబడి కాలక్రమంబున నచ్చోటఁ దిరుగం బట్టు చాలకున్న నతం డెత్తికొనిపోయి సముద్రంబునం బెట్టిన నది వాని కిట్లనియె. అర. 4-221, 222

శ్లో, అథ మత్స్యో మనుం దృష్ట్వా పునరేవాభ్యభాషత,
భగవన్ సాధు మేఽద్యాన్యత్ స్థానం సంప్రతిపాదయ.

సం. భా. అర, 147-14

సీ. గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన, యెత్తుచు నెడముల నుత్తరించి. అర. 4-228

**ఎడమేను** దే. వి.

వక్షస్థలము.

సీ. ఎడమేని నెత్తావి సుడియంగఁ బయ్యెద, సగము దూలించి పైమగుడ దిగిచి. విరా. 2-64

**ఎడయగు** దే. అ. క్రి. (√ఎడ)

దూరమగు.

చ. జను లెడయాటగాంచు నెలిసాలల. విరా. 2-247

**ఎడయాట** దే. వి.

సమీపమునఁ దిరుగాడుట.

చ. జను లెడయాట గాంచు నెటి సాలక. విరా. 2-247

(ఇది పాఠాంతరము)

**ఎడయిచ్చు** దే. అ. క్రి.

1. గడువొసఁగు, వ్యవధి యిచ్చు.

ఉ. ...న్యాయుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేల నీ, వెల్ల నెఱుంగు దివ్వు డెడయిచ్చుట యుత్తము నాకుఁ జూడఁగన్. ఉద్యో. 1-165

2. అవకాశ మొసఁగు.

క. వగపున కెడ యీకుము నెవ్వగఁ గుందిన మానవుండు వైరుల చేతం, దెగుగాని తనదు కార్యముఁ, దగ సాధింపఁగ నేరఁడు తగునే వగవన్. ద్రోణ. 2-357; అశ్వ. 5-144

3. తావొసంగు, చోటిచ్చు.

క. సీతయ్యె ననుచు నల్లన, యాతని శయనమున నొరిగి యతనికెడ యీఁగా, నా తల్పంబున నొకరెడఁ, బ్రీత హ్యాయమై శయించెఁ బృథ్వీనాథా. అను. 2-13

**ఎడయుడుగు** దే. అ. క్రి.

నడుమ విరమించు, విశ్రాంతి తీసికొను.

వ. భీమజరాసంధు లెడయుడుగక యొండొరులం బట్టియుఁ గిట్టియు నడిచియుం బొడిచియుఁ దాచియుం ద్రోచియు మహాయుద్ధంబు సేయుచు. సభా. 1-208

**ఎడరు** దే. అ. క్రి.

విఱుగు, భగ్నమగు.

చ. తడయక ఘోరదర్శన సుదర్శనపావకుచే దహింపఁగాఁ, బడి పర మేశ్వరోగ్రశరపావకదగ్ధ పురత్రయాకృతిన్, దొడరి ధర న్వెలుఁగఁ బడియెం దెడి సౌంభక మంత సాల్వుఁడుం, బడ.... మదీయ చాప పటుపాతరయంబున రెండు వ్రయ్యలై. అర. 1-198

వి.

1. భంగము, అవమానము.

చ. ...మానినికిం దనుఁదాన కాచికో, లోనవిన దానఁజేసి సభకొచ్చెము దక్కినఁ బాండునందనుల్, బ్రదికిరి గాక యయ్యెడరు రాచకొమారుల కోర్చునట్టిదే ఉద్యో. 1-348

2. కీడు, హాని.

క. ఈనలుపురుదక్కఁగ మన, సేనల నొక్కొరుఁడు కైనఁ జేడ్పడని భటుం, గానం జెవి కెడరైనం, బూని తలఁగు నతఁడ చూవె పురుషుం డెందున్ విరా. 2-231

ఆ. పుత్రదార బంధుమిత్ర సక్తుఁడు రొంపిఁ, బడిన గజముగనట్ల యెడరు నొందు, భోగజాలపరుఁడు వాగురాజాల సం, పతిత మృగ ఝషముల భంగిఁ దలరు. శాంతి 6-318

3. యుక్తసమయము, అదను, తఱి.

అ. తలఁపఁ గ్రూరమతులు ధార్తరాష్ట్రులు గదా, నెగ్గుసేయఁ జూతు రెడరువేచి అర. 6-194

4. ఆపద

వ. ఇట్లు విరథుండును వికల హాసుండును నై విషణ్ణుండగు నన్నరనాథుఁడు వెడంగగుటం గటకటంబడి యాంగికటంబు నిష్ఫలంబును బుద్ధి బుచ్చివైచి యొండొక కవచంబు దొడిగె నయ్యెడగు గనుంగొని శీఘ్రంబునం దత్సైనికోత్తములు చతురంగ బహుబలంబులతోఁ గలిసి కవ్వడిం జుట్టుముట్టి. ద్రోణ. 3-209

శ్లో. తం కృచ్ఛ్రామాపదం ప్రాప్తం దృష్ట్వా పరమధన్వినం,
సమాపేతుః పరీప్సంతో ధనంజయ శరార్దితమ్.
సం. భా. ద్రోణ. 108-32

ఎడలు వి. ఎడ

1. తావు, చోటు.

వ. తనయొద్దంగల యోధవీరు లెయ్యెడల నేమి చెల్లంబయినను మాకుఁ జేదోడు ధర్మంబు గలదు. ఉద్యో. 1-377

వ. మీరెల్లపు వలయునెడల నిలిచి భీష్మునకుఁ గావలిగా వలయు. భీష్మ. 1-174

సీ. ఉన్నతంబులయి నెడలెక్కుచు. ఆర. 3-312

తే. నాలుగె నెడల మాత్రఁ గన్నదానం దృప్తుండనై యున్న మేలు. శాంతి 1-58

క. నాయట్లువడిన యంగన లేయెడలం గలరె. శాంతి. 1-58

ఆ. జలము లున్న యెడలు వెలయఁజూచి, యానువస్థలంబులని జను లెఱుఁగక, యుండునట్లుగా మయుండు చేసె. సభా. 1-12

2. సమయము.

తే. నటియ వావంగఁ దనియఁగా విఱువ వలయు, నెడలఁ గాళ్ళలఁ జేతులఁ దొడలఁబట్టి, కడఁగి యనువుగాఁ జేసి త్రొక్కిడుదుఁ గాని, కత్తిగొడ్డలి యడుగ నేఁ గట్టియలకు. విరా. 1-78

ఆ అవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ, జలుపవలయు నృపతి గొలుపున్న యెడల ద్వావిగముళై నఁ గెలని కెగ్గుఁగుట. విరా. 1-187

విణ.

అధికము.

క. దుర్జనునకు సంపద లెడలయ్యెను నాతని, మొదలిటి సంపదలతో సమూలంబు చెడున్. సభా. 2-202

ఎడల అవ్య. ద్రుత. ఎడ[1]

విషయమున, సందర్భమున.

ఆ. కథ జగత్ప్రసిద్ధ గావునఁ బార్థవ, ర్యాద్ధ యుక్తిసేయువట్టి యెడల, యత్నమించుకంత యయినను వలవదు. విరా. 1-42

క. శిలచేవ ద్రమానదెప్పగ, జలనిధిఁ గడవ దొరకొనిన దాక్షువనఁ బాత్రంబులు గాని యెడల దానంబులఁ బాపము నిస్తరించు బుద్ధి దలఁచినన్. శాంతి. 1-380

ఎడలఁద్రోచు దే. స. క్రి.

ఎడలించు, తొలఁగద్రోయు, పరిత్యజించు

తే. మేలు గడువేగ దేయరు శాంతాశ, బద్ధులై యెమురుటఁ జేసి పడఁతి

మనుజు,లింత యెఱుఁగుట సంసార మెడలఁ ద్రోచు,నట్టి విసువుటఁ బుట్టించు నది హితంబు. అను 5-289

**ఎడలించు** దే. స. క్రి. (√ఎడలు) ఎడలఁజేయు

1. తొలఁగించు, ఊడఁదీయు.

క. బంధుశతంబులు శౌర్యమ,దాంధములై శక్తిసంపదాభీలతమై, సింధుర సదృశత నున్నను, సంధుల సంధు లెడలించి చంపుదు రణనిన్. విరా. 1-325

వ. ఇట్లుత్తరుండు సమారూఢ శమీవృక్షుం డగుటయు నరదంబు పయి నిలుచుండి పాండవ మధ్యముండు వేవేగ విడువు మనవుడు నతండు నాయుధసంచయ బంధం బెడలించిన. విరా. 4-118

వ. ...ధర్మతనయుండు దన నికేతనంబున కరిగి యచట నిఖిల పరిజనంబులుం దాను నున్నాహంబు లెడలించి శూన్యాకారులై యున్న సమయంబునం దమ్మనిడను కూరిమి నారం గూరిన వగ పెంపున ధైర్యంబు సొంపఱి వివర్ణవదనుం డగుచు నిట్లనియె. ద్రోణ. 2-187

2. త్యజించు, విడుచు.

సీ. పన్నిన పగఅపై సన్నాహమంతయు, నెడలించి నడచుట యెట్టు లొకొ. భీష్మ. 1-164

తే. తాను గ్రోధాదు లెడలించుఁగాని ముక్తి,దెచ్చి యీదొక భంగి ముక్తికిఁ బథంబు,నగుట ననపాయమగు నుపాయం బనంగ, వలసె నీ నేర్పు పేరిందువంశవర్య. శాంతి. 5-871

3. వదల్చు.

సీ. కీలుకాఁ డెడలింపఁ గెడసిన బొమ్మల, కైవడిఁ బటుతురంగ వ్రజంబు. ద్రోణ. 3-62

**ఎడలు** దే. అ. క్రి.

తొలఁగు.

సీ. ...ద్రుపద, తనయా సుభద్రలు ధర్మజుం డనుజు లా.శిశువు సంజీవితుఁ జేయకున్న -ఆ- బ్రదుక రన్వయమున కుదక పిండప్రదా,

నంబు లెడలు. ఆశ్వా. 3-170

చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభుఁ బ్రోల నున్న వా, మిళిత సుగంధ బంధురసమీర వశంబునఁ దూలి కాలపై, వలువెడలన్ బయల్పడియె వల్లకచంబులుఁ గుచయుగ్మమున్, లలిత కృశోదరంబుఁ దరళత్రివళీయుత రోమరాజియున్. ఆము. 4-48

2. వడలు.

వ. పయిఁబడిన వీరులం గిరిశలిన జంత్రములం బోలె నేలఁగూలఁ జేయుచు. భీష్మ. 3-187

క. అరయ నెందును గౌరవ, భాగం బెడలంగ నీకుఁ బాటిల్లక, చారము మై వర్తింతురు, సైరంధ్రీ జాతివారు జగంబున్. విరా. 1-112

3. తగ్గు, క్షీణించు, నశించు.

సీ. శాల్ల యొప్పిద మాఁడుకట్టమజ్జనము సేయంగఁ దగులు భావ లంద మెడల, విరా. 1-223

క. గురునలుక నాకు నస్త్రస్ఫురణ మెడలె నండ్రు జనులు బోంకిరి. ఉద్యో. 2-266

క. దగ్గములై నట్టులు సమ్మోగ్రైశ్వర్యము నీకు మంచి పాయము చేయుమున్. విరా. 4-88; విరా. 5-208; విరా. 1-294

4. విఱుఁగు, తునుఁగు.

సీ. ...చాపము సిడమెడల రెంటఁ జేసి. భీష్మ. 3-19

5. చెడు.

క. అంబయు నట పాల్వడెఁ గుంబోయిన నతఁడు భీష్ముఁ బోవిడిపోయిన దానిం బరచుం గైకొన దగ్గ్నంబె తనార్తిగ్నె మెడలె మగువా నీకున్. ఉద్యో. 4-278

6. విభిన్నమగు.

(భీష్ముఁడు) క. కురువంశ మెడలం బడ్డినఁ, బరమోహాయమున మగుడఁబడ నెన్. స్త్రీ. 2-111

7. భిన్నాభిన్నమగు.

క. సేనాపతిత్వమునకుం, బూని యొకండు నడపకున్నఁ బోడవడఁగదె యీ, సేనయనిఁ గర్ణధార విహీనంబగు కలము జలధి నెడలిన భంగిన్. ద్రోణ. 1-60

8. వికలమగు.

చ. తనువు ఘనాస్త్రశస్త్రములు తాఁకిన నొప్పిని దప్పిపుట్టినాఁ, ననము వశంబు గాకెడలె మాటల చందము చూడ మీరు డ, స్సినయటు లున్నవారలు. కల్యా. 2-33

9. పగులు, భిన్నమగు.

సీ. ...నృప విను కడవకు సారిపై, సమర మృత్తిక యిడునపుడు విరి యుటయు వెరవారఁ బట్టఁగరాక చెడుటయు, వాని యెత్తెడు నెడ బ్రయ్యుటయును —తే— నెత్తియొకచోట డించిన నెడలుట యును, నెండి యవియుటయును నావమిడినఁ బగిలి, పోవుటయు వాఁడు జనులచేఁ బొలియుటయును గలుగు గతిమేనికెట్లును గలుగుఁ జేటు. స్త్రీ. 1-34

10. వృథయగు, వ్యర్థమగు.

వ. ...అవ్వాలమ్మూఁకలు నమ్మెయిన వమ్మైన విషాదంబున వాసుదేవుం డు వాసవి కిట్లనియె.

క. మున్నెన్నఁడు నివ్విధమేఁ, గన్నదిగా దమ్మెడలె గాండీవము లా, వున్నీ భుజముల శక్తియు, మిన్నకపోఁ జిత్రమిది యమిత్ర ధ్వంసీ. ద్రోణ. 3-197

11. ఛేదమును బొందు,

తే. ఈగి మన్ననఁ గలఁగంగనీక పొదివి, యధికముగ గణముఖ్యుల నాదరించి, పనులు గొనువది తమలోనఁ బాయకుండఁ, బ్రోవు లెడలిన రాజ్యంబు పొలుపుదప్పు. శాంతి. 3-40

12. చచ్చు.

ఆ. గొడ్డు బడుగుఁ దెవులుగొంటుఁ గ్రాగె పెడలిన, దాని నెచ్చటేని

నూనమైన, యట్టిదాని నొకట నాయాసపడియున్న, దాని నిరు
గో ప్రదాన విదులు. అను. 2-402

క. కడుఁగూర్తుఁ గవ్వడికి న, ఘెయ్యడలు గలుగి నేను బ్రతికియుండు
దుఁగా కెక్కడి బ్రదుకు నాకు నాతం, డెడలిన నప్పార్థుఁగాతు నెల్ల
విధములన్, ద్రోణ. 2-349

సీ. శరణన్న మ్రొక్కినఁ దురగాళి యొడలిన నొరుతోడఁ బోరుచు
న్నున్నవెట్టి -ఆ- పగతునైనఁ జంపఁదగదు. శాంతి. 2-420

13. విఘ్నమగు, భంగపడు.

ఆ ఏను గర్తననుట యెఱుఁగమి దాఁగర్త, గాని నేమిఫలము నెడల
కుండి, సకలం కర్మములను నాచరించుచు న్నా, వాఁడ కాన
కర్తగాఁడు దాను. శాంతి. 4-376

14 లయించు, హరించు.

క. అతనిఁ బొదుపు సంకల్పం, బతుల జ్ఞానంబు దాని నడచును విజ్ఞ,
నితఁ దద్వలముఁ బురుషదే,హితనుం గాలంబు వరుస నెడలం
జేయున్.  శాంతి. 5-76

స. క్రి.

విడుచు.

శా. ఉద్యద్విక్రములైన యీ ద్రుపద మత్స్యోర్వీపతుల్ విన్న సం,
పద్యోగోజ్జ్వలుఁ జేయఁబూని కడఁకం బ్రాణంబు లీ నున్న ని,ట్లు
ద్యోగం బెడలంగ నేమిటికి నీ కుర్వీశ. విన్న. 2-18

తే, క్రియ లహంకారమునఁ గల్గుఁ గ్రియలవలన, దేహసంబంధ మెడ
లక తిరుగవలయు. శాంతి. 4-291

క. ... ఆ తం,డబు మొదలక మఱియు నేని నధికరయమునన్.
విన్న. 2-306

ఆ. ... మా,తలి ప్రతోద మెడలి ధరణిఁబడియె. అర. 4-68

ఎడసేయు దే. అ. క్రి.

1. జాగొనరించు, ఆలస్యము శేయు.

(కీచకుఁడు సుదేష్ణతో)

ఉ. బుద్ధులు సెప్పుచెల్ల నటుపో విడు మెమ్మెయి నైన సౌఖ్య సంసిద్ధి యొనర్పు నాకు నెడసేసినఁ దాపము రూపుమాపు నా. వృద్ధియ కోరుదేని నవివేకివి నీవని నన్ను నిట్లసంబద్ధము లైన వాక్యములు పల్కక వే పిలిపింపు కోమలిన్. విరా. 2-76

క. కొడుకుల నిందఱ నీల్లడ, యిడి పరలోకమున కరిగె నెడసేయక యిప్పుడ వీరలఁ గురు వృద్ధుల, కడకుం గొనిపోనపలయు గజపురమునకున్. ఆది. 5-148

వ. పుత్త్ర మిత్ర బాంధవ బలసంపన్ను డైన ద్రుపదు నొద్దఁ బాండవులుండు వా రైన వారలం గృష్ణ బలదేవులు యదువృష్ణి భోజాంధక వర్గంబులతో వచ్చి కూడిన నెవ్వరు సాధింప నోపరు గావున నెడసేయక ద్రుపదుండు పాండవుల విడుచునట్లుగా భేదింతము. ఆది. 8-22

2 తప్పించుకొను.

వ. సత్పాత్ర దానక్రియ నిర్వర్తించి తత్ఫలంబు మున్ను దనకు గోదాన ఫలంబిచ్చిన యతని కిచ్చు వాఁడయిన నతండును గొను వాఁడయి యుండి కొనక యెడసేసి తిరుగందిరుగ. శాంతి. 4-156

తే. అమరి యున్నాఁడ నా బారి కగ్గమైతి, పడుదు గాకింక నీకు నెక్కడకుఁ బోవ, ఎచ్చు ననవుడు నిదియేల పెచ్చు పెరిఁగి, యాల మెడసేసి యనిలజ ద్రేపెతె దిట్లు. కల్యా. 2-246

స. క్రి.

3. పరిత్యజించు.

క. క్షమియింప వలయు నోకఁ దెఱుఁగమి నీమే నన్న నంతఁ గటగటఁ బడి ధూర్తమణుని కార్యస్థితి చిత్తములం దెడసేయునట్టి తరమే మీరల్. విరా. 4-226

4. ఉపేక్షించు.

ఆ. పల వృద్ధరాజు లెడసేసిరో పార్థు, నరిగి నెడక మనము నరిగి యతని, యున్నచోన ప్రీతి మండద మిందుండ, నేల యమచుఁ.

బాష్పజలం, బగ్గలము విడుచుచున్నవి, తగ్గెడుఁ గారణము లేక తడబఁడి పడగన్. విరా. 4-87

2. కాఠిన్యమును దెల్పును.

క. కడు ననురక్తియు నేర్పును, గడఁకయుఁ గలవారి నుఱక కడనఁగ నెగ్గుల్, నొడివెడు వివేకశూన్యుల, కడ నుండెడు నంతకంటె గష్టము గలదే ఆది. 3-149

3. భవిష్యత్కాలమును దెలుపును,

వ. ...నాగముఖ్యులనెల్ల వాసుకి చెలియలైన జరత్కారువువకు జరత్కారుండను మహామునికిం బుట్టెడు వాఁడధికతేజస్వి యాస్తీకుండను మహాముని జనమేజయు సమారబ్ధ సర్పకుల ప్రళయంబు వలన రక్షించును; ఆది. 2-137

4. భూతకాలమును దెల్పును.

సీ. గరుఁల ద్రుంచెడి వేళ గిరుల దున్నాడు సింధ్రకందను కైవడి గాన వచ్చు శల్య. 1-282

క. తెడఁబడఁబడియెడు రవమును, బడి కాలెడు రవముఁ గాలి పలు పెఱఁగుల ప్రవర్సెడు రవమును దిగ్వలయము, గడుగొని ప్రమోయించె నురగికాయోత్థితమై. ఆది. 2-215

ద్రు.

5. ఆశీశ్శః సంప్రార్థనములందు క్రియా ప్రత్యయములకు వచ్చు ఆదేశము. దీనికి అచ్చుపరమైన చో 'మ' వచ్చును. ఆశీస్సునకు.

క. ...యీయాతికి నీకును నయిన యీ వివాహమునం దపక్రమ దోషంబు లేకుండెడు మని వరమిచ్చి. ఆది. 3-169

శాపమునకు.

క. పతిహీనలైన భామిను, లతి ధనవతులయ్యుఁ గులజలయ్యును ననలంకృతలయ్యెడు మాంగల్య రహిత లయ్యెడుఁ గృపణ వృత్తి నిటమొదలుగాన్. ఆది. 4-229

ఎడ్డ ఎడఁద

హృదయము.

క. వికచ ముఖుఁడగుచు శాత్రవులకు భీతులగునట్టి వారలం గని
భూపాలకుఁ డెడ్డ కర్తగాయు నాలుక బెల్లము నై మనంబులుం
గన వలయున్. శాంతి. 8-268; శాంతి. 6-835

తే. వీఁడు దనకంటెఁ బ్రాజ్ఞుఁడు లేఁడు జగతి, నెందు నీకంతతమ్ముఁ
డా నెడ్డఁ దలఁచుఁ, దాని నిట్టి యెచ్చరించు ప్రేమా నిరూఢ బుద్ధి
నరుగుచునుండె నప్పురుష వరుఁడు. మహా. 1-36

ఎడ్డ ఎడఁద

హృదయము.

ఉ. ఏనొక పాపభావమును నెడ్డఁ దలంపకయుండునట్లుగా,
అర. 2-216

ఎత్తించికొనిపోవు దే. స. క్రి. (√ఎత్తు)

మోయించుకొని పోవు.

వ. అచిరకాలంబునకు విష్ణుండు విహగపతిం బిలిచి యెత్తించి
కొనిపోయి. శాంతి. 6-374

ఎత్తించు దే. స. క్రి. (√ఎత్తు)

1. పైకిలేవదీయించు (పతాకము మొ.) పైకి నెగురఁ జేయు.

వ. సన్నాహ సౌందర్యము నొందిన శాతాంగంబు నెత్తించి మెఱసె.
విరా. 4-287; శల్య. 1-193

2. నాటించు. (డేరాలు మొ.) వేయించు.

వ. ...విశాల రమణీయంబైన బహిరంగణంబునం బటకుటీరం బెత్తించి
విడిసి. ఉద్యో. 3-147

ఎత్తికొను దే. అ. క్రి. (√ఎత్తు)

పూను, సిద్ధపడు. యత్నించు.

తే. ఇంత పాపంబు సేయంగ నెత్తికొంటి; మయ్యొ! రాజ్యలోభంబున
సఖబంధు, జనుల వధియింపఁ దొడఁగితి మని రథంబు, మీఁదఁ
గూర్చుండఁ బడియెఁ జేయూఁతఁగొనుచు. భీష్మ. 1-188

"శ్లో॥ అహో బత మహాత్పాపం కర్తుం వ్యవసితా వయమ్."
సం. భా. భీష్మ. 1-45

వ. ఇట్లు పితామహులు నెత్తికోలునకుం జిత్తంబు వికసిల్ల ననుజ సహితం బుగా నితనిం బరివేష్టించి, భీష్మ. 1-108

క. తరతరమ ప్రజలఁ దునిమెఁదు, నరునప్పటి యెత్తి కోలునకు సుర విగ్రాప్ర,ధరఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి పుట్టునొ యనుచున్. (ఇట 'విజృంభణము' అని భావము) విరా. 5-64

2. సంకల్పము, ఇచ్ఛ.

ఉ. ...గద పండువు సేయఁగోరు నా, దయ్యపు నెత్తికోలు దుది దాఁ కుట గాదె భుజంగ భంజనా. ఉద్యో. 3-67

క. పదివేలఁ జంపఁగా నో,పుదు నేనను నెత్తికోలు పుట్టిన యది నీ, పదునొకఁ డక్షోహిణులను, జదురున నడిపింతు నెదిరి సైన్యము గలతున్. ఉద్యో. 4-406

వ. అలసి డస్సి యెప్పుడెని మీర లడ్డమాడుదు రప్పుడ శపింతు నిట్టిద నా యెత్తికోలు. అను. 2-381

3. పొందుట.

ఉ. ...నీ, కిసరమెత్తికోల్ గలిపి యిప్పుడు కార్యము దప్పఁజూచు నీ, వారలు మట్టవచ్చిన నవశ్యము నంతకు జాలరుంజుమీ. ఉద్యో. 3-385

**ఎత్తిచను** దే. అ. క్రి. (√ఎత్తు)

దండయాత్రకుఁ బోవు.

సీ. చిగురులతో సంధిసేసి యంబుజములు, పైకెత్తి చనునట్టి పదతలములు. విరా. 2-67

**ఎత్తినడుగులనుండు** దే. జాతి. (√ఎత్తు)

ఎత్తిన పాదములనుండి, మునివ్రేళ్ళమీఁద నిలఁచు (ప్రయాణమునకు సంసిద్ధముగా నుండు)

తే. గొంటి కోండ్రదు రెల్లను గురువరేణ్య, యెత్తి నడుగుల నున్న వార లపస్వి నీవరిష్ట దర్శింపంగఁ బోవఁగోరి, యనియె నట్లు లయ్యిరువురు నాడుటయును. ఆశ్ర. 2-25

**ఎత్తిచె(సె)ప్పు** దే. స. క్రి. (√ఎత్తు)

ఉద్ఘాటించు, వెల్లడిచేసి చెప్పు

వ. ...పాండవాగ్రజుండు వాని ప్రతిజ్ఞావచనంబు లెత్తి చెప్పి మొగ మోడ కగల్చిన. భీష్మ. 3-55

**ఎత్తు** దే. అ. క్రి.

1. కలుగు.

సీ. కొలువులోపల నిన్న కోపమెల్లెత్తినఁ, గలఁపక నిలిచిన ధైర్య మహిమ. విరా. 2-160

మ. ఉరుసైశ్వర్య విభూతినొప్పు భవదీయంబైన రూపంబు సూచు తలంపెత్తెనఁ బోలునేని దయఁ జూపుము ప్రీతిఁ గావింపవే. భీష్మ. 1-206

క. ఆడ కలు దిన్నట్లగునే, కడుపుఁ గుట్టెత్తినపుడు. ద్రోణ. 4-89

క. కొంగవులు సేయు నవమతి, కారణముగఁ గోపమెత్తుఁ గద్దని వగవాం, భోగుహాముం గనుఁగొన శమ,మారున్ పావకము గాక యంతన బుద్ధిన్. శాంతి. 1-18

2. (పోరాటకు) పూను, కడగు.

క. నీ యనుజులు దివిజాంశు న,జేయులు ధృతరాష్ట్రసుతులం జెలుచుట వేఁగే, తోయజ నాళము గజము లీలాయత్తము గాదె యెత్తు మాహవమునకున. ఉద్యో. 4-112

3. దండెత్తు, పోరుటకై బయలుదేరు.

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట యెత్తి వచ్చినం,దేరు ల్పవాస్నలా వశగతిం జరియించిన గెల్వవచ్చు. విరా. 4-22

క. బలవంతుఁడు పైకెత్తిన, బలహీనుఁడు ధనముగోలుపడిన యతఁడు గ్రముచ్చిల వేచువాఁడుఁ గాముకుల చిత్తుఁడు నిద్రలేక యుందురు రధిపా. ఉద్యో. 2-21

తే. ఎవ్వరిఁ గొని యతండు, కౌరవులమీఁద నెత్తి రాఁగలుగువాఁడు. ఉద్యో. 2-168

సీ. వానయు సీతును వర్జించి మండు వేసవి గాక మున్న సస్యములవంట,
లోఁదవెదు తఱి నెత్తునది శరత్తుపయి. శాంతి. 3-8

4. అతిశయించు, ఎక్కువగు.

క. దివ్వెన విఱిగినఁ బౌరులు, నవ్వుదు రకట మేలుమేలు నను వాఁగకు నీ, క్రొవ్వులుగ దేనిఁ దలపకు, మెవ్విధి ననితేని ననుచు నెత్తిన కీలిన్. విరా. 4-71

ఉ. ఎత్తిన వేడ్కఁ గంధరము లెత్తి మొగంబులు సాఁచి...చిత్తరు కేళిఁ దేలె విలసిల్లుచు జక్కవదోయి వేకువన్. ఉద్యో. 2-109

స. క్రి.

1. లేవదీయు, పైకిఁదీయు.

క. అని మనమునఁ దలపోయుచుఁ, దనతమ్ముని నల్ల నెత్తి దండడ దొరఁగం, జను దెంచు నశ్రుపూరము, కనుఁగవలోఁ గ్రుంగికొనుచుఁ గామిని పలికెన్. విరా. 2-79

క. పెనురొంపిలో వలమ గ్రుంగిన ధేనువు నెత్తుపోలికని. శల్య. 1—158

ఉ. పంచిన శోకభారమునఁ బ్రాణవిమోక్షము గోరి గంతదే, శంబున రాయి గట్టికొని సన్మునినాథుఁడు నిశ్శరాత్ముఁడై, యంబుధిఁ జొచ్చినం గడు భయంపడి వార్ధి లసత్తరంగ హస్తంబుల నెత్తి పెట్టెఁ దనపై కతశీరముఁజేర నమ్మునిన్.
ఆది. 7-119; విరా. 4-174

2. ఉన్నమితము చేయు, ఊర్ధ్వముగా నుండునట్లు చేయు.

వ. తమ కందువలు రోసి యెత్తిన మెడలును. విరా. 2-240

క. హయములఁ బూన్పుము రథమున, రయమున సిడ మెత్తుము. విరా. 5-42

ఉ. ఎత్తిన వేడ్క కంధరము లెత్తి మొగంబులు సాచి ... జక్కవదోయి వేకువన్. ఉద్యో. 2-109; విరా. 5-82

3 పైని పెట్టు, మీఁద నుంచు.

ఆ. సూత పుత్ర యితఁడు నాతఁల పెద్దమో. నెత్తి నమ్మియున్న

యిట్టిచోటఁ, గ్రందుసేయ నాకుఁ గాదని సైరించి, యున్న
బ్రతికి తింక నూరకుండు. ఉద్యో. 4-251

శ్లో సముద్యతోయమ్ భారో మే సమహాన్ సాగరోపమః
సం. భా. ఉద్యో., 167-30

4. (అర్ఘ్యము, హవిస్సు మొదలగు వానిని) ఇచ్చు సమర్పించు.

క. అమ్మంత్రము దనరఁగు హృదయమ్మున నక్కన్య నిలిపి యాది
త్యున కర్ఘ్యమెత్తి నాకు నిమ్ము ప్రియమున నీయట్టి కొడుకు
నంబ జమిత్రా. ఆది. 5-9

వ దివ్యాధిపులు దగు ధిపులు డు గన్ని రోజక సన్నురవతితోఁ
గనకై యెత్తిన పురోడాశ భాగంబు విష్ణు డెల్ల వేలుపులుఁబోలె
నాకు దర్శన గోచరుండై కొనక యగ్ర్యుడై కొనియె.
శాంతి 6-364

5 ఇచ్చు. ఒసఁగు.

ఆ అట్టి యవసరమున నమ్మహీపతి నన్నుఁ, దలఁచె నప్పుడే బల
విరోధి, మది విరోధ ముడిపి మసలక వచ్చి యర్ఘ్యాలు ప్రాణ
మెత్తి ప్రమద మెసఁగ. శాంతి 1-271

6. చావు మొదలగు వాని నుండి ఉద్ధరించు, ఉజ్జీవింపఁ జేయు.

క. ... విగతాసులఁ దన, మృదు వచన ప్రశ్న మను నమృతమున
నెత్తెన్. ఆది. 6-262

7. మోయు, వహించు.

వ. ... కృష్ణునిచేనన్న నర్జుని వసువునం గనకరత్నమయంబగు నతని
పాదపీఠం బతండు వ్రేల్చిన కాళ్లు దిగిచికొన సద్దఱు ముద్దియ
లెత్తి తెచ్చి నాకుం బెట్టిన నేమను దానిం గరతలంబున నంటుచు.
ధరణీతలంబునఁ గూర్చుండి. ఉద్యో. 2-121

8. తీసికొను, గ్రహించు.

సీ. ఘన శరాసనముఁ ద్రిఖండంబుగాఁ జేసి, వారాచ మొక్కటి
వాలి మేన, వేయేక విల్లెత్తి వెసఁ బదునాలుగు, శాత బాణములఁ

టడవి. ద్రోణ 3-305

శ్లో. పీతోపవృత్తాన్ స్నాతాంశ్చ జగ్ధాన్నాన్ సమలంకృతాన్.
సం భా. ద్రోణ 112-55

14. పట్టి తీసికొని పోవు.

సీ. ఘన కాయ జవ సత్త్వ గజ కచ్ఛపముల నొ,క్కెత్తున లీలమై నెత్తె నితఁడె. అను. 1-270

15. అపహరించు.

తే. కామ రసమున నతి తృష్ణుఁడై మనుష్యుఁ, డర్థ తృష్ణా పరీతాంతరంగుఁడైన, గొఱియ నడవిలో నెత్తెడు కోలుపులియుఁ, బోలె మృత్యు వాతనిఁ గొనిపోవు దేని.
అను 5-285; శాంతి 6-229

16. (కంఠస్వరము) హెచ్చు చేయు (ఈయర్థమున ఎలుగు, గొంతు మున్నగు శబ్దములతోనే కూడి యుండును.)

క. అత్తఱి నీతనయుం డెలు,గెత్తి గధికవరులతోడ నిట్లను.
భీష్మ 2—372

17. (దీపము మొదలగు వానిని) వెలిగించు.

సీ. దివియలోఁబుఱుఁ ద్రువ్వు దివియ యెత్తినవారిఁ బాపంబు వొందుదునే. అను 5-58

18. ప్రయోగింప నుద్యమించు.

క. గురుసుతుఁడు భీమునకు నై,పరమాస్త్రం బెత్తె. అశ్వ. 3-172

19 తూచు,

తే. ధనము కలిమియు లేమియుఁ ద్రాసునందు, నిలిపి యెత్తంగ మాలునూపె నిర్ధనత్వ, మెక్కుడై దాని దిక్కున నెట్టులన్న.
శాంతి. 4-83

శ్లో. ఆకించనత్వం చ రాజ్యం చ తులయా సమతోలయన్.
సం. భా శాంతి 176-10

20 (భిక్ష) యాచించు, అడుగు.

తే. తగు వేళఁ బర్ణశాలలకు నరిగి, యెత్తగా భిక్ష. శాంతి. 1-58

వి.

1. మాఱు, తడవ, పర్యాయము (ఈ యర్థము 'ఒక్క' శబ్దపూర్వకము గనే యుండును.)

ఆ. ఇట్లు దఱిమెనేని నిప్పుడ యూఁగఁడి, ద్విక్కువానినెల్ల నొక్కయెత్తు గాఁగఁ బిలుకుమార్చు. ద్రోణ. 5-196

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదులగు నీ కొడుకు లొక్కఁడొకఁడ జగంబులెల్ల జయింపఁ జాలుదు రందఱు నొక్కమొగంబై త్రోచి నడచిన నవ్వసాధి నొగ్గుదురిన కాదు పాండవులనెల్ల నొక్కెత్తునవైచి కొననోపుదురు. ఉద్యో. 2-282

సీ. ఘనకాయ జవసత్త్వ గజకచ్ఛపముల నొక్కెత్తున గీలమై నెత్తె నితఁడె. అను. 1-270

2. పన్నుగడ, ఎన్నిక, యుక్తి.

ఉ. ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మార్కొనిరేని గోపులం, దెత్తు ముహూర్తమాత్రమున. చూ. ఎత్తునఁగొను. విరా. 4-9

విణ.

సమానము, సమము.

వ. దివిజ దానవ గంధర్వాది సమస్త భూతంబులు నాతోడి యెత్తు రాకుండెడినట్టి దోర్వీర్యంబున వెలసి వర్తిల్లుదు.

శ్లో. దేవ దానవ గంధర్వ మనుష్య పతగోరగాః
నసమా మమవీర్యస్య శతాంశేనాపి పింశితాః
సం. భా. శాం. 12-17

క. ఈ యున్నరాజులందఱు, వాయునుతున కొక్కయెత్తు.
ఉద్యో. 3-337, అను. 2-48

**ఎత్తుదెంచు** దే. అ. క్రి. (√ఎత్తు)

దండెత్తి వచ్చు.

వ. ద్రుపదుపయి నెత్తుదెంచిన ద్రుపదుండును క్షతుండై ప్రావాళ్ళ గుల మఱువునొచ్చె. ఆది. 7-191

**ఎత్తునఁగొను** దే. స. క్రి.

నైపుణ్యముచే జయించు.

చదరంగములోఁ గాయనడపుట యెత్తనఁబడును. అట్టి యెత్తుల చేతనే ఆ యాటలో జయము కలుగును. అటులనే చదరంగములో నెత్తు వేయుటకుఁ జూపునట్టి యుక్తిఁజూపి (కౌరవులనెల్ల) తన వశముసేసి కొందునని యుత్తరుని వచనము.

ఉ. ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మూర్ఖుని రేని గోవులం, దెత్తు ముహూర్త మాత్రమున. విరా. 4-9

(ఎతెం, ఎత్తల, ఎత్తుర, ఎత్తెర, ఎత్తర, ఇత్తెర) అనునవి పాఠాంతరములు

**ఎత్తులువట్టు** దే. స. క్రి.

(పూలదండలు) సరిపడునో లేదో యని ఉరువు మొదలగు వానిని సరి చూచు

సీ. పువ్వులు బహువిధంబులఁ గట్టి ముడికొక్క ఛంగిగా నెత్తులు వట్టి యిత్తు. విరా. 1-107

**ఎత్తువచ్చు** దే. అ. క్రి.

సరితూగు, సమమగు, సాటియగు.

వ. వారెల్లఁ దేజో ధైర్య పరాక్రమోపాయ విచారవివేకంబుల నా యొత్తువత్తురె. ఉద్యో. 2-265

**ఎత్తెరుచోటు** దే. వి.

దండు వెడలు ప్రదేశము.

వ. సుశర్మయు... వేగిరంపుఁ బయనంబులయ్యును బ్రజల నోలాకు పడనీక యెత్తెరు చోట్లను విడిదల యందును లోనుగా నిస్సాణాదులయిన యుద్భట చిహ్నంబులు ప్రకటింపక. విరా. 8-131

**ఎత్తెల** దే. వి.

చేపంను బట్టుకొనెడి యొకానొక సాధనము.

క. వెరవున నూఁతల నెత్తెలఁ, గరముల మత్స్యములఁబట్టి కడ సంతసముం. బొరయుచుఁ ద్రాళ్లం గ్రుచ్చఁగ, గర మూహించి మదిఁ బ్రావృట్కాలజ్ఞుండున్. శాంతి. 3-198

**ఎత్తెలగొను** దే. స. క్రి.

వలతోఁ జేఁపలను బట్టినట్లు అనాయాసముగా (శత్రువులను) పట్టుకొను లేక వశము సేసికొను

ఎత్తెల = చేఁపలను బట్టువల - వలవేసి పెక్కు చేఁపల నొక్కపర్యాయము అనాయాసముగాఁ బట్టిన చందమునఁ గౌరవులనెల్ల నొక్కత్తునఁ బట్టుకొందును. అని యుత్తరుని బీరపుమాట.

ఉ. ఎత్తెలఁగొందుఁ గౌరవులనెల్లను మార్కొనిరేని గోవులన్, దెత్తు
మహాస్త్ర మాత్రమున. విరా. 4-8

(ఇది ప్రాచీన ప్రతి పాఠము అని సూ. ఆ. ని. ఇప్పటి ప్రతులలోనిది పాఠాంతరము) చూ. ఎత్తుఁగొను

**ఎద** వై. వి. ఎడఁద

హృదయము, మనస్సు.

తే. ...సంతోష మెదనిండ నెలవుకొనఁగ. [illegible] 1-24

క. ...అన్నాకపతియు సిగ్గునఁ గదురన్. ఉద్యో. 1-118

క. వాలమ్ములు దాఁకి ధరన్, వ్రాలు భటులఁ గాంచి [illegible] వడఁ
కఁగ మేనుల్, దూలఁగఁ [illegible] దాఁకియును, వాలము సాచి
కొంద అవలఁ జనంగన్. విరా. 5-82

**ఎది** దే. సర్వ.

ఏది.

సీ. ...ఏకాదశేంద్రియానీక మీశ,ఏంది [illegible] యుండెడి
యింపెసఁ దనవంక కిద్యుజాలు, బుద్ధితత్త్వము గల్గు [illegible]
కఁడు. ఆశ్వ 2-44

**ఎదిరి** దే. విశే. (√ఎదురు)

1. అన్యుఁడు ఇతరుఁడు.

క. ఎదిరికి హితమును ప్రియమును, మదికింపును గాఁ [illegible] మాటలు
పెక్కైన, యొకవినము చెప్ప యటుగా, [illegible]
యొంతయు నొప్పున్. ఉద్యో. 2-69

2 ఎదుట నున్నవాఁడు, ఎదుట నున్నది

క. అని పిడఁగఁ బల్కిన నమ్మను జాంధముఁ డంతఁబోక మదనోన్మాదం, బునఁ దన్నెదిరి నెఱుఁగక, వనితకు నిట్లనియె గారవపు బలుకులన్. విజా. 2-51

వి.

ప్రతిపక్షుఁడు, విరోధి.

క. నిమ్మెఱుఁగు దెరి నెఱుఁగుదు, నెమ్మిమెఱుఁగు దర్మసిద్ధి నెఱి యెఱుఁగ దెం వాక్యప్రమాణముల పద్ధతి నెఱుఁగుదు, నెమ్మెన్వఁడ నెఱ నీకు బుద్ధులు సెప్పన్, ఉద్యో. 8-34

## ఎదిరివాఁడు దే. వి.

ప్రతిపక్షుఁడు, విరోధి

ఆ. ఎల్లభువనములును నేలుటకైనను, నిట్టి ద్రోహకర్మ మెట్లు సేయు, వమ్ముఁగడఁగి యెదిరివారేమి సేసిన, మాఱుసేయ నాకు మనసు రాదు. భీష్మ 1-185

## ఎదురఁబడు దే. అ. క్రి.

ఎదుటఁ గనఁబడు, చేఁజిక్కు, వశమగు, యాదృచ్ఛికముగా లభించు.

ఆ. ఎదురఁబడినవాని వదలక శార్దూల, శరభ సామజాది సత్త్వతతులఁ బట్టి తినుచునున్న యట్టి నాకిప్పుడు, భక్ష్యమైతి వీవు పాండుపుత్ర. అర. 4-111

## ఎదురీఁదు దే. అ. క్రి.

నీటి ప్రవాహమునకు ఎదురుగా ఈఁతకొట్టు, ఇబ్బందిములగు కష్టములు ఢీకొని వానిని తరించుటకు ప్రయత్నించు.

చ. ...వారిధినాథుండు లేచి దీనతం, బోరసి కృపైక భాజనతఁ బొందిన యప్పురిఁజూచి మానసం, బెరియఁగఁ బొచ్చె నేటికెదురీఁదిన చాడ్పున నేమి సెప్పెదున్. మౌస. 1-98

## ఎదురు దే. అ. క్రి.

మాఱొడ్డును, ప్రతిఘటించు.

క. కావున నీ యుగ్భట రథి, కావలి నివ్వీరుని గాచునట్లుగఁ బనుపం-

3. అభిముఖుఁడు (ఎదురు మొగమైన వాఁడు) అభిముఖ, అభిముఖ.

క. ఎదురున్న రూపు వలుకఁగఁ, దుఃఁ గటగటబడవు. ఉద్యో. 1-368

వ. కొంద ఱెదురుగాఁ జనుదెంచిన వారిది యేమి యని యడుగ నశ్వత్థామ వచ్చి పొడుచుచున్న వాఁడనిన సౌప్తి. 1-197

సీ. ఎదురుగా వచ్చిన నెంత యేలియు దవ్వు, గలుగ వేఱొక త్రోవ దొలఁగు వారు విరా. 2-36

4. ఎదిరింపన సమర్థమైనది, ప్రతిఘటింపఁ జాలినది-సాటి, సమానము.

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గార్ముక విద్యా ప్రౌఢిమై నిరూఢు లయిన యీ,శకుని జయద్రథ దుర్ముఖ, వికర్ణ కర్ణాది యోధ వీరుల కెదురే. విరా. 4-53

తే. ...ఈ సీట నాబల్లిదునకు, నెదురు రథికునిఁ గాన ననేక హేతి, నిపుణ శార్దూల విక్రమ నీవు దక్క. శల్య. 1-91

వ నీకైమీ తండ్రి యిట్లు సేయఁడయ్యేనేని వానికెదు రెవ్వరు ద్రోణ 5-289

5. మాఱు, బదులు

సీ. కుల పర్వతావళి కులిశ భయంబున, బెదరి వాపోవ నల్లెదురు సెగఁగ ఉద్యో. 4-116

క్రి. విశే.

1. ఎదురుగా, అభిముఖముగా.

ఎ. నీకెదురై జయంబు గొనరాదు. ఉద్యో. 1-87

2 సమానముగా.

వ. సుయోధనుఁడు...భీష్ము కడకుంజని శోక గద్గద కంఠుం డగుచు నతనితో నిట్లనియె.

వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించి యతని కిట్లనియె భీష్మ. 3-76,78

ఎదురుకొ(ర్కొ)ను దే. స. క్రి. (√ఎదురు)

1. మార్కొను, తలపడు.

**ఎదురుచను; ఎదురుసను** దే. అ. క్రి.

1 ప్రతిఘటించు.

క. గురుఁడను నురుతరగిరి నిష్ఠుర భంగిం బుట్టి వచ్చు సునిశిత బాణోత్కర చండ వేగనదికి నె, దురు చన రావయ్యె నపుడు ద్రుపదసుతునకున్. భీష్మ. 2-57

2. ఎదురుగాఁ బోవు.

వ. అని సమస్త జనంబులుఁ దదభిముఖులయి భక్తి యుక్తిం బ్రత్యుత్థానంబు సేయం దానును గద్దియ డిగ్గి యెదురు చని నమస్కరించి యతని యాశీర్వాదంబులు గైకొని సగౌరవంబుగాఁ దోడ్కొని చనుదెంచి సముచితసమున్నతాసనంబున నునిచి. విరా 1-189

క. చిడిముడి పడుచు నెదురు సనఁ, గడఁగుచు హారములు చక్కఁగాఁ ద్రోచుచు మ, ల్లడి గొనుచు దుర్విలాసం, బొడలికి నొడఁగూర్చు చుండ నుగ్మలి యంతన్. విరా. 2-114

**ఎదురుచు; ఎదుర్చు** దే. అ. క్రి. స. క్రి.

ప్రతిఘటించు, మార్కొను.

క. పొంపిరివడ నప్పుడు శౌర్యోన్నద్ధుఁడగు నయ్యనిల తనయు మార్గణములు బెట్టిదముగఁ గవియుఁడు నోటమి, యెదురుప లేరైరి కురుకులేంద్రుఁడు వారున్. కర్ణ. 2-164

ఆ. అనఘ నీ కెదుర్చి యని సేయువాఁడనై, మ న్నెపుబ్బుఁ గొనఁగ నిన్నుఁగాన, నెమ్మి వచ్చినాఁడ. భీష్మ. 1-156

క. విను సైంధవుఁడు మహారథుఁ, డని బోక పెంగు నతని నా ద్రౌపదికై, పెనుపఱుఁ బంచిరి కుంతీ, తనయులు వారం కెదుర్పఁ దపముం జేసెన్. ఉద్యో. 4-222

క. పొదువుచు విచ్చుచుబలువిడి, నెదురుచు బాఱుచును మఱి మహీభాగముఁ, గ్రక్కదలం గార్ముక విద్యా, విదుఁడగు గురుతోడఁ బోరె వివిధ బలంబుల్. ద్రోణ. 1-144

చ. అనిలజవంబునం బఱచు నమ్మరనాగ మెదిర్చి క్రమ్మఱిం,చిన
పరికాంక్ష పోలె. ఆది. 4-206

చ. దురమున నర్జున ప్రకట దోర్విభవంబు నెదుర్చ్వఁజాలు ను,ద్ధురుఁ
డొకరుండు గల్గెనె. శల్య. 1-88

ఎదురుచూచు దే. అ. క్రి.

ప్రతీక్షించు, నిరీక్షించుకొని యుండు.

వ. (కీచకుఁడు) అమ్మగిదిరాక్షిరాక కెదురు చూచుచుండె.
విరా. 2-87

క. హాయముల మరల్పమీ తల్లియు బంధులు నెవలు ంచరింప
గుమురు గట్టియెదురు సూతురు వారికిఁ, బ్రియముగ శీఘ్రమున్న
నం బురికిఁ బోవలయున్. విరా. 5-2౩4 విరా. 4-81

ఎదురునడుచు దే. అ. క్రి.

అభిముఖముగా వచ్చు, ఎదుర్కొనవచ్చు.

క. చరులఁ బనిచి యరుల తెఱం,గెఱయుచు వారెదురు నడచునట్టి
నాయున దె,ప్పరవుం దెరువున డప్పిం, బోరసి రెండు కడియుచోటఁ
బోడచుటుగవగున్. శాంతి 3-4

ఎదురుపడు; ఎదుర్పడు దే. అ. క్రి.

ఎదురువచ్చు, ఎదుర్కొను.

క. ఇదివనికిఁ జిత్రసేను డు, బురుమి తుండు వేల్పుకోటి సంతుడుఁ
బ్రాపై, యురవఁడి దఱిమినవారికి, నరనంగాను డమురుపద గుణ
ధ్వని సెలఁగన్. విరా. 3-813

ఆ. అరినృపాలు పెంపు నాత్మీయశక్తియు, నడిఁగి మూర్ఖవృత్తి
నెదురుపడక, యుచితవృత్తి నతని యున్నతి మెవసిఁ, గడిహీన
బలుఁడు నెడక నిలుచు. శాంతి. 3.90

వ (గరుత్మంతుఁడు) అప్పుడ్రశైలిరిని సూరెల మన్నాసుగలదు మును
లను గలసిం గనుఁగొని.

చ. ...నల్లి దాసియగు టోర్వక గం,డియున్ జ్ఞ మీ కెదు,ర్పడిన దురు
ద్ధతిన్ మఱచి బాంధవ సత్కృతి నాచరింపుఁడీ అను. 1-265; 266

**ఎదురుపలుకు** దే. అ. క్రి.

మాఱుపలుకు, ప్రత్యుత్తర మొసఁగు.

క. ఏ నొల్లఁగాక ధన్మము,గా నిన్నుంజూతునే వికారియనుడుం, దానె
దురు పలుకకంత,ర్ధానము వెసఁజేసె నతఁడు ధరణీనాథా.
అను. 2-203

**ఎదురువచ్చు** దే. అ. క్రి.

అభిముఖముగాఁ బోవు, వచ్చెడివారికి ఎదురుగాఁ బోవు

వ. శల్యుండు నుపప్లావ్యంబునకుం జని స్కంధావారంబు దఱియం
జొచ్చి ధర్మనందను నివాసంబున కరిగిన నతండు దమ్ములుం
దానును ద్రౌపదీ సుభద్రలు నభిమన్యు ప్రభృతి పుత్రవర్గంబును
నెదురువచ్చి కృత ప్రణాముండై. ఉద్యో 1-104

వ. కమల నాభుండు గదలిపోయి సూర్యాస్తమయ సమయంబునఁ
గుశస్థలంబు సేరఁ జనునప్పు డందలి విప్రు లెదురువచ్చి కాంచి.
ఉద్యో. 3-147

తే. భవ్య విభవంబుతో నుపప్లావ్యపురము. సొచ్చి సంభ్రమమునఁ
బాండుసుతులు దనకు, నెదురువచ్చిన నాహ్లాద మెసక మెసఁగ
విరా. 5-378; సభా. 1-179

**ఎదురువోవు** దే. అ. క్రి.

1. వచ్చువారికి ఎదురుగాఁబోవు, అభిముఖముగాఁ బోవు.

వ. ధర్మనందనుం డొక్కఁడుఁబోయం బోడఁగని దుర్యోధనుండు దోలఁ
గెం బెట్టుచేమల నడంగి యుండునో మీరు మెలంగునెడల నరయ
వలయుననిన వాఁడును వృకోదరుని మృగయులలోని వాఁడగుటఁ
దమ వారికి నెదురువోయి యమ్మాట తెలియంగఱించుటం జేసి.
శల్య, 2-86

2. ప్రత్యుత్థాన మొనరించు ఎదురుగా బోవు.

సీ. ...త్యవతి కొడుకండుల, కేతేర నందఱు నెదురువోయి. ఆశ్ర. 2-71

**ఎదురుశోకించు** దే. అ. క్రి.

దుఃఖించువానిని జూచి తాను వానితో సమానముగా దుఃఖించు.

వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించియతవి కిట్లనియె.
భీష్మ. 3-78

**ఎదురుసేయు** దే. స. క్రి.

ప్రత్యర్థిగా నిలువు.

క. శౌర్యాటోపంబున దోర్వీర్యంబున నస్త్రశస్త్ర విన్యాసమునన్ మాత్సర్యంబు సేయు నాకును, దుర్యోధనుఁ డెపుడు నన్నెదురు సేయంగన్. విరా. 3-12

**ఎదురెదురు** దే. వి. బొ.

ఎట్ట యెదురు.

క. ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదురని యెఱుఁగఁ డెట నా యెదు రెదురన్, వివ్వచ్చుఁ జూపి సేఁబు, గ్రొవ్వాఱఁ బలుపలుకు లిట్లు ద్రోణుఁడు పలికెన్. విరా. 4-1?9

**ఎదురేచు** దే. అ. క్రి.

ప్రతిఘటించు, పోరికిదిగు.

క. పాండవులు శౌర్య మొల్ల రఖండితనీతి ప్రకార శౌర్యము మెచ్చ్చి, యుండుదు రెదురేచినఁ దదిమండు రాగ్నంగ రాదు మరి యెవ్వరికిన్. ఉద్యో. 2-73

**ఎదురేయు** దే. అ. క్రి.

ప్రతిఘటించి బాణ ప్రయోగము చేయు.

వ. ముందటి పుట్టువున నంగనయగుట వాని నెదురేయకుండుదు

భీష్మ. 3-302

**ఎదురొడ్డు** దే. స. క్రి.

ప్రతిఘటింపఁ జేయు, డీకొనఁ జేయు.

మ. మహిషవ్యాఘ్రమృగజాదిసత్త్వచయముఁన్ మల్లవ్రజంబు గృహాంగణా తుండై యెదురొడ్డుచున్ వరుసఁ బోరం జూచు. విరా. 2-193

**ఎదుళ్లుచూచు** దే. అ. క్రి.

వ. కుంభసంభవ ప్రముఖులైన మాన్యులును అని మాధవుతోడ మా యిండ్ల నెల్లను గానిక లాయితంబులు సేసికొని నీవు విజయం చేయుటకు నెదుళ్లు చూచుచున్నవారమని పల్కి ప్రార్థించిన.

ఉద్యో. 3-123

**ఎద్ది** దే. సర్వ.

ఏది.

క. ... ఇ, ద్దినములు గడపంగ నెద్ది తెఱఁగయ్యెడినో. విరా. 1-59

**ఎద్దు** దే. వి. (బహు) ఎడ్లు

సీ. అనఘ విశాఖ నెద్దు. అను. 2-379

తే. బలము లేఁబ్రాయమును రూపుఁ గలుగునట్టి, గవప యెద్దు సద్ధర్మ విప్రునకు నిచ్చి, నతఁడు సద్విధి గోదాన మాచరించి, నతసి పడ సిన గతిఁ గాంచు ననఘ చరిత. అను. 2-460

చ అనుటయు భీతి వేడికొని యావులు వేయును నెడ్లనాఱు నూఱును రథముల్ శతంబును. కర్ణ. 2-91

తే. కడఁక నెడ్లను దఱిమి రొప్పెడు నరాలి, యులివువిని యుల్లమున గడు నులుకు పుట్టి. అను. 4-318

**ఎద్దుఁబట్టు** దే. స. క్రి. (√ఎద్దు)

ఎద్దును బీజములు లేని దానిని గాఁజేయు, ముష్క హీనముచేయు.

సీ. పొలఁతి నపుంసకుల్ పూర్వభవంబున, నెద్దుఁ బట్టిన వారు. అను, 5-105

శ్లో. యే పురా మనుజాః భూత్వా ఘోర కర్మరతా స్తథా।
పశు పుంస్త్వోపఘాతేన జీవంతి చ రమంతి చ॥

సం. భా. అను. 221-81 (నిర్ణయ)

(ఎద్దు పట్టు - అని.సూ.అ.ని. అన్యప్రయోగము.)

**ఎన** దే. విశ.

సాటి, సమానము.

సీ. ఇత్తన్వి కెనలేమి కెదిరి పన్నిదము భాషా విభుతోనైనఁ బఱవ రాదె. విరా 2-27

చ. ... మాతలియుం దలంప నీతని కెనరాఁడు. కర్ణ. 1.315

క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను, మతులిత బలుఁ డితని యట్ల యాత్మజుఁడును వి,క్రమశక్తి సోమ దత్తుం, డితనికి నీతనికి సమర మెన పెండలికిన్. ఉద్యో. 4-230; స భా. 1-78

వి.

సామ్యము, పోలిక.

చ. ... వారల చెప్పెడు ధర్మ వృత్తి నిచ్చెనయుఁగ నూఁది నిత్య
ధము, దెందుట కెక్కుము పొత్తినూలి ప్రవృత్తి పోయుఁ గాకు
బంధకుఁ డవుం దన కల్గుఁడు దాన యమ్మెయిన్. శాంతి. 6-227

**ఎనమంద్రు; ఎనమంద్రురు** దే. సర్వ. బహు. (√ఎనిమిది)

ఎనిమిది మంది (ఎనిమిదికి మహన్మహాత్యర్థక రూపము.)

వ. ఆయ్యైన మంద్రను దక్కిటి దొరలను గనుంగొని. ఉద్యో. 4-113

క. ... వసువుల, నెనమంద్రం గాంచి యెంతయుఁ బ్రీతిన్.
అది. 4-125

క. వారలఁ బొదువనదరు బలు, శేరుం మొత్తముం మిగిలి దీప్తపటు
రథో, దారులగుచు నెనమంద్రురు, వీరులు నిశమిరి నిశాంత
వేగోజ్జ్వలులై. ద్రోణ. 3-216

**ఎనమన్నూఱు** దే. సర్వ. బొ. (ఎనిమిది+నూరు)

ఎనిమిది వందలు.

వ. ఉత్తరపోథనవర్యం డశ్లేని శుద్ధ ధవళ వర్ణంబులై యొక్క
కర్ణంబు నీలంబైన యుత్తమాశ్వంబు లెనమన్నూఱు దెచ్చి
యిమ్మని పలికిన. ఉద్యో. 3-306

వ. ఇరువది యొక్క వేయు నెనమన్నూట డెబ్బది రథంబులు.
అది. 1-81

**ఎనయిక** దే. వి. (√ఎనయు) ఎనయుట

పొందిక, ఒకదానితోనొకటి చేరుట.

క. అనఘ యమలోమమునఁ దోఁ, పును బ్రతిలోమమున అయము
పొందుటయును గల్గును సర్వత త్త్వముల కవి, యొకయిక బ్రహ్మ
మును గలయు నేకత్వమగున్. అను. 4-184

**ఎనయు** దే. స. క్రి.

1. పోలు.

చ. ఎనయుదె నీవు పొరువ విహీనుఁడ వర్థివి శేంద్ర నందనున్.
కర్ణ. 2-23

తే. ఉదయ ధరణీధరంబుపై నొప్పు దివసనాథు నెనయుచు సిం
హాసనంబు మీఁదఁ, బొలిచె లీలావతీ కర కలిత చామరములు
వొలయంగ నుచిత జనములు గొలువ.
ద్రోణ. 3-5; శాంతి. 5-75

2. పొందు.

క. పరమ మగు యశము నీకును, ధరణింగలిగింపఁ బూని తాత్పర్యము
నం, బుధవర నాదు బుద్ధి, స్ఫురణము నీ మనమునందుఁ జొని
పితి నెనయన్. శాంతి. 2-147; శాంతి. 4-276; శాంతి. 5-76

క. అని సాత్యవతేయుఁడు గృప, నెనసి సుధాధారఁ బోలు నీక్షణముం
గ, తనువున నిగిడించిన నమ్మునిపతిఁ గీర్తించె భూతములు
ప్రీతములై. అను. 5-330

3. ఛేదించు, వ్రచ్చు.

క. ఆలోనన యారథికుని, ఫాలస్థలి నోలి నెనయఁ బదినారసముల్,
గీలించిన నవి యచ్చట, నీలోత్పల మాలవోలె నెఱయం బొలిచెన్.
ద్రోణ. 4-230

శ్లో. తే లలాటం విభిద్యాస్య సూతపుత్రస్య మారిష,
వివిశుః శోభితా స్తేన వల్మీకమివ పన్నగాః.
సం. భా. ద్రోణ 189-7

(స్థలమోలినేయ-అను పాఠాంతరమే సమంజసమేమో)

అ. క్రి.

1. సరియగు, సమానమగు.

క. ఈ నలువుర భుజశక్తుల తో, నెనయఁగఁ జాలునట్టి దోర్బల
మెందుం, గానము. విరా. 3-114

క. నెల్లఁడు యమ తనయునితో, నెల్లగుణంబులను జాల నెనయుదు
నని తా నుల్లమున నిశ్చయించుం, జెల్లంబో పోరఁ బగఱచే
నిట్లయ్యెన్. స్త్రీ. 2-104

2. కలుగు, సంభవించు.

క. కోకిల కుల గంధర్వా, నీః ధ్వము లెనసి జెరసి నిగుడఁగ నమరీ,

లోక భ్రమరీ మండలి, శాకల కల నాదములును గలసి చెలంగన్.
అను. 4-417

3. వ్యాపించు, ప్రసరించు.

సీ. తునిసిన నెత్తురు నెనడును నెమ్ములు, నెఱచియుఁ గండలు నెనసి సమర – తే. – తలము ఘోరంబుగాఁ గపిధ్వజును ధవళహారులు కోవిల్ల.
ఉద్యో 2-144

4. ఏమగు, కూడుకొను.

ఆ అరయఁడు కాలకలితమైన కర్మమున సంసార వర్తనంబు గలువుచుండు, ప్రపన్న సంప్రవృత్తి నలిపెడునరు మాద్యక్క, నింద్రియములతోడ నెనయ వెరసి.
శాంతి. 4-195

తే. కేళి సలిపిరి భవన దీర్ఘికల తమ్మి, విరుల నెత్తావి నెనయుంగ వెరసి చెమట, పొడవు మేను లతని కంపు ప్రోది తఱచు, టూర్పు గాడ్పుల పరిమళ ముల్లసిల్ల.
విరా. 2-288

5. సంగమించు, రమించు

క. వనితకుఁ బురుషునకుం దన, తన యంతర యూపాకం దోవఁ జేయఁగ విన్నను వు గలుగ దొండొరువుల, కెనయుటఁ గాని శ్రుతి మతము నిట్ల మహాత్మా.
శాంతి. 6-22

6. ఒప్పు.

క. అని యొక గుదిమీల నడుమ, నెనయంగాఁ దూలి కఱచి యిరు దౌడలఁ ద్రాడొనరంగఁ బట్టుకొని క్రుచ్చిన చందము దోఁప మూర్ఛఁ జెందిన భంగిన్.
శాంతి. 8-195

7. కప్పు, ఆవరించు.

చ. ... పా, మెనసిన తోలు వాయుక్రియ నీవు దొఱంగుదు పాపపుంజమున్
శాంతి. 5-188

8 సఖ్యము చేయు.

తే ... అన్నదమ్ముల, లేమి విధమునఁ దమలోన కెనసి నడచు, వార లెఱుఁగింపు మనుటయు గారవమున.
అను. 4-130

ఎనవచ్చు దే. అ. క్రి. (√ఎన)

సాటివచ్చు, సమానమగు.

క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణాచార్యుం కెనవచ్చు దివ్యశర విదుఁడు కృపాచార్యుఁడు. విరా. 5-9

ఎనిమిది; ఎన్మిది దే. సర్వ. బా.

ఏడు నొకటి.

వ. కౌరవపతి యరదంబున నెనిమిది సునిశిత విశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. కర్ణ. 3-190

ఆ. ఎనిమిదింట ద్రౌణిని. ద్రోణ. 3-227

క. ఎనిమిదిటఁ జేరుకున్న నక్కరున్నపాలు నొడలం గ్రుచ్చెన్. ద్రోణ. 4-42

క. ఏను నుల్లేచి నకులుఁ బొడిచె, వెనుగ గ్ర ధ్వని నసేక వేదం డనులం, దెనిమిదిటఁ గూల్చె బాణము, లెనిమిది యెనిమిదులఁ దమ్ముఁ దేర్చెల నధిపా. కర్ణ. 2-345

వ పదునెనిమిదవ పర్వంబై స్వర్గారోహణము నాఁబరఁగె. ఆది. 1-64

సీ. ఐదు నెన్మిదియును నాలు కల్యుఁడు. ద్రోణ. 2-80

ఎనుపోతు దే. వి. (√ఎనుము)

దున్నపోతు, మహిషము.

చ. ...కోలు పులినైనను గాఁ రెనుపోతునైన...పట్టుదు. విరా. 1-88

వ నిత్యంబు నెలు వరుస నొక్క మానిసి రెండెనుపోతులం బూనిన శకటంబున నపరిమిత భక్ష్య పిశిత మిశ్రాన్నంబు నించుకొని పోయిన దానిని వానిని నయ్యెనుపోతులను భక్షించుచు. ఆది. 6-265

ఎనుబోతు దే. వి. (√ఎనుము)

దున్నపోతు, మహిషము.

చ. వలసిన నేలు మేను బలవంతుఁడఁ గాఁ రెనుబోతు దంతి బెబ్బులి మృగనాథునిం దొడరి పోరుదు. విరా. 1—228

(శి.వ. ప్ర.కోశమున ఈ తావున 'ఎనుబోతు' అని సవరించుకముగా నున్నది, వారు అనఁగా అకాడమి వారు ముద్రించిన భారత ప్రతి యందు ఇచ్చట నిర్భందుకము గాఁగందు సంశోధితము నందును. ఈ యొక్క తావుననే 'ఎనుబోతు' అని నిర్భందుక ప్రయోగము గలదు. మిగిలిన తావున ఎనుపోతు అనియే గలదు. ఈ సంఖ్యలో అనంత వారి ప్రతి యందు 'ఎనుపోతు' అనియు కలదు. సూర్య.ని. వారు 'ఎనుఁబోతు' గాని ఎనుబోతు గాని ఈయలేదు. విచార్యము.)

**ఎనుబది** దే. సర్వ. బొ.

ఎనిమిది పదులు, అశీతి.

తే. ఎందు మెనుబది నాలుగు వేల యోజనంబులని హేమధాత్రీ
ధరంబు పొడవు — శివ. 1-22

**ఎన్నండు; ఎన్నఁడు** దే. వి. బొ. ఏనాఁడు

1. ఏదినము, ఏకాలము.

క. నీ పసులఁ గావఁబెట్టుము, భూపాలక నన్ను నేను బూనియరసినన్,
గోపంక్తులు రుజవడ వారు, చేపడ వెన్నఁడును దప్పఁ జేర్పడ
వెచటన్. — విరా. 1-278

ఆ. ఒలసి యెంత కాలముండిన నేను మీ, దానఁ గాన యొరుల
ధనము నన్ను, నెన్నఁడయిన వారుల కిచ్చుచో నసుగకు, భోజ
నముగ నిచ్చి పుచ్చుఁ డిపుడ. — ఆది. 6-257

2. ఎప్పుడును, ఎల్లప్పుడు.

(ఈ యర్థమునఁ దఱచు దృష్టాంతముగా నుండును.)

క. కని కొలువు సేసికొని మాలిని వాఁ డని సాధ్వి యిది మఱిమన
వృత్తంబున పొంతఁబోవ దెన్నఁడు. నను ప్రేమఁదనంబు దోఁచు
నట్లు చరించున్. — విరా. 1-106

సీ. ...మఱి, పాండు నందను లేక పత్నియంద. కరమనురక్తులు
గావునఁ దమలోన, నేలకేళిల్లుదు రెన్నఁడయ్యు - ఆ - వారిక
పతికిఁ బతులు పెక్కండ్రు గగుటచి, పతుల కోర్కె గాన యతివ
కృష్ణ సుందరాంగి వారి యందేం యపరక్త, యగు.
(ఎన్నఁడయ్యు = ఎల్లప్పుడును) — ఆది. 8-25

తే. (బలరాముఁడు) ఇట్టి దాని కోర్వక యెన్నఁడేనిఁ, గృష్ణు తోడనేఁ
జెప్పితిఁ గినిసి యిరు దె,ఱంగు వారికిఁ దగఁ జెప్పి సంగతంబు,
సేయుమని యెంత సెప్పినఁ జేయఁడయ్యె. ఉద్యో. 4-168

(ఎన్నఁడేని = ఎన్నఁడో, ఏనాఁడో)

మత్తకోకిల :- మదీయ భాషిత మెన్నఁడున్నేని మోఘము గాదు-
దిగ్ధరణీ రవీందు లెఱుంగఁ గాన్. ఆది. 7-141

(ఎన్నడున్నేని = ఏనాఁడైనను, ఎప్పటికిని.)

**ఎన్నఁడో చచ్చినయట్లు** దే. జాతి.

ఎంతకాలము క్రిందనో చచ్చినట్లు,

క. అని యతని జతు దేశం,బున నొక వాలమ్ము వక్షమునఁ జెక్కను-
గ్రుచ్చినఁ ద్రెళ్లి యెన్నఁడో చ,చ్చిన యట్లు రథంబు మీఁదఁ
జేడ్పడి యుండెన్. ద్రోణ. 2-51

**ఎన్నాళ్లు(లు)** దే. వి. బ. (ఎన్ని + నాళ్లు)

ఎన్ని దినములు.

సీ. ...ఇంక నెన్నాళ్లు లుండెడి, గొంతి వనంబునఁ గూరదినుచు.
ఆశ్ర. 2-15

**ఎన్ని** దే. సర్వ. బ.

(ఎంత శబ్దమునకు అనువాదర్థక బహు వచన రూపము సంఖ్యా-
వాచకము.)

1. ఎంత సంఖ్య గలవి (ప్రశ్నార్థకము.)

సీ. నెలఁతి నిట్టిదని యింతి నెమ్మనం బెన్ని. భంగుల నరసినఁ బట్టు వడదు.
విరా. 2-47

క. భూవర నాకుం జూడం,గా విష్ణుఁడు దైవ మట్లు గావున నగనిన్,
భావించు పెల్లవారికిఁ, గావించును మోహమయ సుఖము లెన్నిం
టన్. శాంతి. 5-509 (ఇది పాఠాంతరము.)

2. యావదర్థకము (ఇది తావదర్థకము నపేక్షించును)

వ పాపాత్మురాలైన సుదేష్ణ దనకు మదిరారసంబు దేరం గీచకనివా-
సంబునకు నన్నుం బనిచినఁ బోవుట కొడఁబడక యెన్ని సెప్పిన

నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినం జెన్ద పెరంగ నొల్లక.
విరా. 2-178

ఎన్నియేన్ స్త్రీ. 1-140; ఎన్నియేనిన్ ఉద్యో. 3-41; ఎన్నియేని యున్ ద్రోణ. 2-199; ఎన్నియేనియును మా॥ 5

ఎన్నికొను దే. స. క్రి.

లెక్కపెట్టుకొను

తే. ఎన్ని కొనుచుండఁ జనుచుండ నేండ్లు లివ్విధమున నాయువు దోడ్తోడఁ దఱిఁగి జీవహాని వాటిల్లఁగా. శాంతి. 6-224

వ. అడుగు లెన్ని కొనుచు నరిగి పదియగు నడుగు నప్పు డప్పాముశేష దష్టుండై తన రూపంబు విడిచి విఖ్యాత రూపంబుతో నున్న నన్నలునకు. అర. 2-127

ఎన్ను దే. స. క్రి.

1. లెక్కించు. లెక్కపెట్టు, పరిగణించు.

క. శత్రుంతపాదులగు గృహ, పుత్రులుఁ బేరుగల యోధ పుంగవులు మద,చ్చిత్ర శరనిహతి సంగర, ధాత్రిఁబడిరి వారి నెన్నఁ దరమై యుండన్. విరా. 5-91

చ. అమలిన తారకా నముదయంబుల నెన్నను ... భారత భారతీ సముద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే. ఆది. 1-19

ఉ. అందు వృకోదరార్జునుల బాహువరంగము నందు మీఱు వారెం దఱొ యెన్నుమా. ఉద్యో. 3-264

వ. వీని నెన్నికాని నిశ్చయింప నేరము. అర. 2-174

2. ప్రసంగించు, చెప్పు.

తే. అల్పులకు మ్రింగఁ జేరైన హాలహలము, శంగిఁ బొంగారు కోపంబు మ్రింగి కొనఁగ, నీలగళు నెన్ని నిన్నెన్నఁ బోలునట్టి, నీవుహాలికఁ గాకేల నెగడఁ జేరు. ఉద్యో. 1-838

వ. మనసేనానాయకులం జెప్పెద నిన్నును భీష్ముని నెన్న నేల కృపాచార్యుం డశ్వత్థామ శల్యుండు వికర్ణుండు భూరిశ్రవసుండు

మఱియుం జెక్కండ్రు రథికులుం గలరు. భీష్మ. 1-174

సీ. వినుము ధర్మములెల్ల వినుత కృత్యంబుల, తపమెన్ని యెప్పగా
ధర్మమెందుం గలదు. అను. 4-82; అర. 5-115

**ఎపుడు (ఎప్డు)** ఎప్పుడు

ఎల్లప్పుడు.

క. సన్న్యాసి వేషమున రాజన్యునిం గని యెపుడుం గొలిచి సభ్యత్వ
మునన్, మాన్యుండనై పుణ్య కథా, విన్యాస మొనర్తు నతని వేడు
కకుం దగన్. విరా. 1-69

ఉ. ...ఎప్డు నంగనా, జనములు నన్నుఁజూచి మరుసాయకముల్
దమ చిత్తవృత్తు లేచినం గొని వచ్చి యిత్తురు విశిష్ట ధనంబులు
నాకు లంచముల్. విరా. 2-384

**ఎప్పటి** అవ్య. (√ఎప్పుడు)

ఎప్పటివలె, యథాప్రకారముగా (మరల, తిరిగి అని తాత్పర్యము.)

వ. విశ్వరూపా యీ రూపం బుపసంహరించి నీదగు నెప్పటి యాకా
రంబు గైకొనవే యనిన. అశ్వ. 3-51

చ. ... తగం దొలంగఁగాఁ, ద్రోవఁగ నాది బంధులకు దుర్మతి పుట్టిన
యట్టి మర్త్యవా, రేవిధినైన మందులిడి యెప్పటి బుద్ధిఘటించు
చాడ్పునన్. శాంతి. 6-198

**ఎప్పటిచందము**

యథాప్రకారము.

వ. కుంభ సంభవు, నారికిం దప్పించుకొని పోయినం బోపొమ్మని పలికి
డెందం బెప్పటి చందంబగుటయు నిశ్చల భావంబొందె.
ద్రోణ. 5-321

ఉ. ఎప్పటి చందముల్ విడిచి యేత్తైఱం దక్కిన చూడ్కులు.
ద్రోణ. 1-14

**ఎప్పటిచొప్పు**

యథాప్రకారము.

వ. మున్ను నిద్రించు ప్రక్క వక్కయొండు ప్రక్క నిద్రించు భార్గవు నట్లు గాంచి సంతోషించి పరిక్రాంతి దిగఁద్రావి యెప్పటిచొప్పున నడుగు లొత్తుచుండ మఱియు దినంబు లిరువది యొక్కటి సనినం బ్రబుద్ధుండై. అను. 2-307

**ఎప్పటియట్టులు; ఎప్పటియట్లు**

యథాప్రకారము.

సీ. దనుజేంద్రు నిలుచుట గని సైన్యమెప్పటి, యట్టుల వురికొని. విష్ణు. 3—86

వ. దామోదరుండు ధృతరాష్ట్రనందనునకుం జొచ్చెఁగూడ నతని కన్ను లెప్పటియట్ల కావించి నిజ విశ్వరూప ప్రపంచంబు నుపసంహరించి. ఉద్యో. 3-411

**ఎప్పటివారలు**

పూర్వమెవరుండిరో వారు.

వ ధృతరాష్ట్రుండును మగిడి కొలువు కూటంబునకు వచ్చి యెప్పటి వారలు పరివేష్టింప నుండె. ఉద్యో. 4-21

**ఎప్పుడు ఎపుడు, ఎప్డు**

వి. ప. బొ.

(దీని రూపాంతరములగు 'ఎపుడు' 'ఎప్డు' అనునవి ద్వితీయాది విభక్తులతోఁ గూడి యుండవు.

1. ఏ వేళ, ఏ సమయము.

చ. ... ఎవ్వరిచేత నెప్పుడే తలఁపు వచ్చునో యీతని కంచుఁ జూడ్కి సుస్థిరముగఁ దన్ముఖంబునన చేర్చుచు నుండుట నీకు కొల్వునన్. విరా. 1-129

2. యదార్థకము (ఇది 'అప్పుడు' అను దాని నపేక్షించును)

ఆ. ఒడలితోడ నీకు నూర్ధ్వలోకమునకు, నరుగవచ్చు నెప్పు డరుగు తలఁపు, దోఁచె నప్పు డదియుఁ దోడ్పడనై ప్రీతి,నరుగుచెంచు ననియెఁ గురువరేణ్య. అను. 1-80; అశ్వ. 1-68

3. ఎల్లప్పుడు, అన్ని వేళల.

(ఈ యర్థమునఁ దఱచు సముచ్చయముతోఁ గూడియే యుండును)

ఉ. ఎప్పుడుఁ దాను బల్కు నెలుఁ గేర్పడ ద్రౌపదితోడ నిట్లనున్. విరా. 2-147

క. నీ మాట మెయిన చేయుదు, మేమెయ్యదియైన నెందు నెప్పుడు మాకున్, దామోదర యశుభస్థితి,లేమి శుభము కలిమి నీదు లీలయ కాదే. భీష్మ. 2-9

4. పూర్వము, మునుపు

వ. ఎప్పటి పొలికలనికిం బోవుదమనిన నతం డాద్వైపాయనహ్రదం, బాసీమలోనిది గామియొఱుంగుం గావున నన్నూ మ్రొటకియ్యకొని. శల్య. 2-229

5. మొదటి నుండియు, చాల కాలము నుండియు.

క. గదఁగయ్య మెన్నఁడొకో చేయుదు భీమునితోడ ననుచు నుల్లంబునఁ గోరుదు నెప్పుడు నిప్పుడు నాకది యొదవెన్ విధికృతిం గృతార్థుఁడనైతిన్.

శ్లో. చిరకాలేప్సితం దృష్ట్వా హృదయస్థమిదం మమ,
త్వయా సహగదాయుద్ధం త్రిదశైరుపపాదితమ్
సం. భా. శల్య 57-40

**ఎముక** దే. వి. ఎమ్మ

అస్థి, బొమిక, బొఁకె

ఉ కొన్నిటి నవ్వశించుకొని కోవెముకల్ నుఱుమాడు. సౌప్తి 1-18

వ. ఆ భూపల్లభుం డతని బరియెముకల గల వ్రేసిన, శల్య. 2-267

**ఎముకయూటు** దే. వి.

మజ్జ, మూలగ, ఎముకలయందుఁ బుట్టు నొకానొక జిగురు పదార్థము. దీని నుండియే సంతానోత్పత్తి కారణభూతమగు శుక్రము పుట్టును.

సీ. ఎముక యూటి, చవిగొని యానుచు. స్త్రీ. 2-9

**ఎమ్ము** దే. వి.

ఎముక.

సీ. చతురంగములును జర్జరితంబులై యవయవ భేద మెఱుఁగని
యట్లుగాఁగ, దుసిసిన నెత్తురు నెఁడుచు నెమ్ములు, నెఱచియుఁ
గండలు నెనసి సమరతలంబు ఘోరంబుగా. ఉత్త. 2-144

**ఎంపనుగ్గు** దే. వి.

ఎముకల పొడి.

ఉ. ఎంప నుగ్గు లొం,డొండ ధరిత్రిపైఁ దొరఁగ. ద్రో. 2-122

**ఎంపపొడి** దే. వి.

ఎముకల పొడి.

క. కినిసి ఒక మర్దనుఁడు... క్రుమ్మెం, గనుకని నెంపపొడినెరఁ
గాలంగేలన్. ద్రో. 5-62

**ఎయిదించు** దే. స. క్రి.

ఎయిదఁజేయు.

తెలుపు, ఎఱిఁగించు

క. చని యాక్కమారుఁడేమయ్యెనో యత్తెఱఁగెఱిఁగి మాకు నెయి
దించుము పుట్టిన కార్యమునకుఁ గీడొదవు, విధియుటు విధిగెలువ
వసమె బ్రహ్మకునైనన్. విరా 6-287

**ఎయిదికొను** దే. అ. క్రి.

1. కూడుకొను, ఒక చేటికిఁజేను.

వ. మనుజపతి కనుజనహితుఁడై సహస్రసంఖ్యంబు లొక్కెడ యెన్ను
దన్ని నిలిచెనంతఁ దక్కటి బలంబులు నెయిదికొని యిమ్మెయిన
దళంబుగాఁ గవిసిన. శల్య. 6-2

2. డగ్గఱు, సమీపించు.

వ. పాంచజన్య రవం బాకర్ణించి సవ్యుడు వేగం బెయిదుకొనుమనిన
దారుకుండు. ద్రో. 2-364

3. మార్కొను, ఢీకొను.

వ. అట్టియెడ నర్జునుండు కిరీటి వాలోకించి.

తే. నీవు భీమ్మునకరిగినఁ దోఁపదేను, గలుగ నెఱపెం యతనిపైఁ

గవియు మెయిది, కొని మదీయ బాణంబులఁ గుప్పఁగూరఁ బఱపి
కూల్చెద నీతనిఁ బటురయమున. భీష్మ. 3-333, 334

ఎయిదు దే. స. క్రి.

1. వెంబడించు, వెన్నాడు.

వ. అట్టి యెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరంబగు
చిత్తంబుతో మత్స్యవిభుని వలను నూవుచు నిట్లనియె.

తే. ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రదికి, యున్నవారము గావున
నుగ్రరిపుల, పాలువడకుండ విడిపింపఁ బాడి యితని, నెయిదు
మెయిదుము రథరయ మెసక మెసఁగ. విరా. 3-202, 203

2. తఱుము.

వ. ...సువర్మ లోనైన బంధుజనంబులు వాదిగాఁ గల పరివారంబు
పలాయన పరాయణం బగుటయు వెనుకొని యెయిది గోధన
వర్గంబు మరల్చి. విరా. 3-219

3. అందుకొను, చిక్కించుకొను.

అ. ఇట్లు పఱచుటయును నంతయు రయమున, నమ్మృగంబు వెనుక
నరిగి యరిగి, యెయిద లేక ధాముణీకుండు సారథిఁ, బనరి తేరు
వేగ పఱవు మనియె. అర. 4-337

4. చేరు, సమీపించు.

వ. అలోన సైంధవుండు సంభ్రమంబున శాత కృపాణ చర్మంబులు
గొని రథంబుడిగ్గ నుఱికి రయంబున నెయిది యదల్చినంగని జనక
ద్వేషియగు నతని రోషంబగ్గలింప వాపురందర పౌత్రుండు పౌర
వుని విడిచి యడ్డంబకు లంఘించి కవిసె. ద్రోణ 1-170

వ. నిరామిషంబైన యీ పేరతో వనిసేయం బనిలేదు. వీర లెయిది
యడ్డపడి తడవు సేయకుండు నట్లుగా ముట్టికొని పసులం బెట్టించి
దొరయును నెలగడవం బోవక యుండఁ బొమవవలయు.

విరా. 4-250

**ఎయ్దు** దే. స. క్రి.

ఎయిదు.

1. పొందు.

ఉత్సాహ వృత్తము: ... ఏను శో,కావిలత్వముడుపఁబూని యరుగు
దెంచితిన్ సుతా, భావజనిత దుఃఖా వార్ధి పారమెయ్దు పుత్రకా.
స్త్రీ. 1-66

2. పైకెత్తు.

ఉ. అంతకు భీమసేనుఁడు రయంబెసఁగన్ గద నెయ్ది పట్టి య,త్యంత
రయంబుమైఁ బిటీఁది కాతని ద్రోచిక నద్గదాపరి, భ్రాంతి వెలుంగ
నిల్చిన. ద్రోణ. 1-181

3. చేరు, సమీపించు, డగ్గఱు.

ఉ. అతఁడు సిక్కెనేని బలమంతయు విచ్చు మరల్పవచ్చు గో,వ్రా
తము నట్లయైన సుకరంబుగ నంతట నెల్లఁదీఱు నీ, యాతతసేన
యందతని నారసి కానకయున్న వీరి ని,ట్లీతలడించి యాకదుపు
నెయ్దఁగఁ బోదముగాక వ్రేల్మిడిన. విరా. 4-247

అ. క్రి.

1. తప్పించుకొని పోవు.

ఉ. ధరణీశ్వర యింతకు మున్ను వీటికిం, బోవవు శత్రునే పుడిపి
పోయెదు వాఁడవు గావు నీవు సై,న్యావలి యైనఁ జేడ్పడక
యాతల కెయ్దుట లేదు నేనియున్. విరా. 4-192

2. తోడ్పడు.

(అభిమన్యుని మరణమునకు దుఃఖించుచు అర్జునుఁడు.)

చ. పలువురు సుట్టు ముట్టికొని బాణ కృపాణముఖాస్త్ర శస్త్ర పం,
క్తులఁ గడు నొంపఁగా దనకుఁ దోడ్పడువారలు లేక నన్ మదిం,
దలఁపఁడ యత్తఱిన్ రిపువధంబున కెయ్దుము తండ్రి యేను గొం,
దలమునఁ బొంపకుండనని తాఁ బలుమాఱును జీరకుండునే.
ద్రోణ. 2-247

3. చను, పోవు, వెళ్ళు.

చ. సచివులఁ జూచి యిప్పుడు వెసన్ మన మెయ్దక తక్కినం బఱు,

ప్రచయము దప్పిపోవుఁ దుది భంగము నేగియు వచ్చు.
విరా. 8-140

క. విను పాంచజన్య పటునిస్వనము దెలియది మఱఁది యొడరు సైకిం
పక కృష్ణుని రణముసేయు రథముం బనిచె నెయ్యు మెయ్యు
మధికరయమునన్. ద్రోణ. 4-141

శ్లో. గచ్ఛ గచ్ఛేతి గురుణా సో౽నుజ్ఞాతో వృకోదరః.
సం. భా. ద్రోణ. 1-127, 26

**ఎయ్యుకొను** దే. స. క్రి.
తఱిమికొను.

ఆ. అప్పు డర్జునుండు తప్పక చూచి యీ బలము పసుల నడ్డపడక
యుండ, నెడ సొరంగవలయు నిట నెయ్యుకొనుము, పనిచె మత్స్య
భూమిపాలసుతుని. విరా. 4-287

**ఎయ్యది** దే. సర్వ. (ఏ + అది) ఏయది, ఏది, ఎది, ఎట్టి

1. ప్రశ్నార్థకము,

ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్కిచోటు
వే, రెయ్యది మీర కోరుదురు నిచ్చలు వచ్చిన దానిఁ గొంచు,
నెయ్యది నాకు నంతయును నేర్పడఁగా నెఱిఁగింపుఁ డీ.
విరా. 1-190

2. కాక్వర్థము ('లేదు' అను తాత్పర్యమిచ్చును)

వ. ఇంతకంటెను పెంపెయ్యది (పెంపులేదు అని తాత్పర్యము)
ఉద్యో. 8-149

ఆ. శోకమునకు నెయ్యది తుది (తుదిలేదు అని తాత్పర్యము)
స్త్రీ. 1-6

3. యచ్ఛబ్దార్థకము (ఇది యచ్ఛబ్దార్థము నపేక్షించును)

వ. ఎవ్వరికి నెయ్యది యిష్టం బయ్యది యెల్లం దనమాయాబలంబున
మయుం డొదవించుచుండు. సభా. 1-283

క. మన మందఱమును ధృతరాష్ట్రుని కడకుం బోయి భాగ్యమూర్తి
మతనిచే, వినవలయు నాతఁ డెయ్యది, గని పలికిన నదియ మనకుఁ
గర్తవ్యమగున్. శాంతి. 1-41

ఎయ్యేని ఏ[1] (ఏ+ఏని) యచ్ఛబ్దార్థకము (తచ్ఛబ్దార్థకము నపే క్షించును)

వ. ఎయ్యేనివేల్పు నాహ్వానంబు సేసెద నవ్వేల్పు సనుదెంచి నీ వశం బున నుండు. అర. 7–323; ఆది. 5–18

2. ఏదియో, ఎవరో – అని నిర్దేశార్థమును సూచించును.

వ ఇతండు కిరాతరూప ప్రచ్ఛన్నుండైన యెయ్యేని యొక్క దివ్య పురుషుండు గావలయు. అర. 1–315

వ. ఏము వసిష్ఠ మునివరు శాసనంబునం జేసి మర్త్యలోకంబునం దె య్యేనియు నొక్క స్త్రీయందు జన్మింపం బోయెదము. ఆది. 4–127

వ. ఇవి యెయ్యేనియు నొక్క ధనుర్వేదవిదుం డయిన బ్రాహ్మణు నపత్యం బగునని శంతనునకుం జూపిన. ఆది. 5–183

ఎర దే. వి.

1. (భూతాదులకు వేయు) బలి, ఆహుతి.

క. నరపతుల నెల్ల భీష్ముని, కెరగా నొప్పింపఁజాల నే నడవులకున్, మరలం బోయెద. భీష్మ. 2–8; ద్రోణ. 3–185

2. పశుపక్ష్యాదుల యాహారము, మేఁత.

తే. భయము దక్కి యచ్చోటన పలితు లెరకుఁ, గ్రుమ్మరఁగ. శాంతి. 3–203

వ. ఎరలకై వచ్చి యట్లు దోఁచిన వయ్యెలుక. శాంతి. 3–204

వ. ఎరకుఁ బెనంగు డేగల చందంబునఁ జిత్రగతులం బోరి పోరి. ద్రోణ. 3–268

క. ...ఎరకై, వెరవునఁ గాకులుఁ గ్రోఁతులుఁ, బరువడిఁ జీకాకు పఱుచు భంగి నలఁచుచున్. ద్రోణ. 1–258

3. ఆహారము.

చ. ఫలము దళంబునుం దొడిమఁ బాయుట రాలినవానిఁ గొంచు నాఁ, కలి కెర నేసి గోరసము కార్యము నట్లుల నిర్వహించి. అను. 5–56

4. వ్యసనము.

చ. తిరుగుచుఁ బుట్టలం దొదలఁ ద్రిమ్మరు పాముల రోసిరోసి విస్మరతర దీర్ఘదండమున డొల్లఁగ వేయుచు వచ్చివచ్చి యప్పెద్ద నొక డుండుభంబను నహిం గని వ్రేయఁగ దండమెత్తుఁడున్, హరి హరి యంచు డుండుభ మహాహి భయంపడి పల్కె భార్గవున్.
ఆది. 1-152

ఎరఁగు దే. అ. క్రి. ఎఱఁగు

1. క్రిందికి దుముకు, దిగ్గనుఱుకు.

క. సహదేవుండును గదగొని, మహి నెరఁగినయప్పు డొప్పె.
ద్రోణ. 1—161

2. ఉఱుకు, లంఘించు.

సీ. మృగంబు పై నెరఁగు సింగము పోలెఁ గిట్టి సర్వేమని గిటదంచి.
శల్య. 1—379; కర్ణ. 8-256

3. నమస్కరించు.

ఆ ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు,రరుగుదెంచునప్పు డధిక భక్తి, నెరఁగి ప్రియము పలికి తెరువిత్తురు. ఆది. 7-111

ఎరగలి దే. వి.

ఉల్క. ఆకాశమునుండి రేఖాకారముగాఁ బడు తేజఃపుంజము.

చూ. ఎరగళువోవు.

ఎరగలిచిచ్చు వి.

దావాగ్ని, కార్చిచ్చు, అగ్ని.

చ. ఎరగలిచిచ్చుకాఱడవి యెల్లను గ్రొల్లున నొక్క పాయగా, దరికొని రూపడంచిన విధంబున. భీష్మ. 2-5

వ. ఇట్లెరగలిచిచ్చు గవిసి చుట్టుముట్టిన నమ్మనుజనాథుండును నన్నాతులు నిరాహారులై యునికిం జేసి యొక్కచోటఁ దఱియ నుఱికి తొలంగిపోవ లేరైరి. ఆశ్ర. 2-152

ఎరగళ్లువోవు

ఉల్కలు పడి మండు.

వ. మిగిలిన మాతంగంబులు పెనంగిన కనక లిప్తకాండంబు లూడు
కొనం దాఁకిన నెరగళ్లువోవు కొండల కైవడిం బోలుచు నవి
యును. కర్ణ. 2-227

శ్లో. శరైః కనకపుంఖైశ్చ చిత్రా రేజు ర్గజోత్తమాః
ఉల్కాభి సంప్రదీప్తాగ్రాః పర్వతా ఇవ భారత.
సం భా. కర్ణ. 52-17

**ఎరగొను** దే. స. క్రి. (ఎర + కొను)

1. ఎరగాఁగొను, ఆహారముగాఁగొను, ఆహుతిగాఁగొను.

తే. కురుకుమారులు దమయంతఁ గుడిచి క్రొవ్వి, మీఁ దెఱుంగరు
మాకేమి మేలుకాక, నాలుకలు గ్రోయు నర్జునానలము దఱిసి,
యెరగొనం గని సంతృప్తి యెసక మెసఁగ. ఉద్యో. 4-12

2. మేఁత మేయు.

సీ చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నాసీనుఁడై యుండఁ బిచ్చికలు
గూఁడు, గావించెఁ దన్మస్తకంబున నమ్మిథునము గారణముగ
నండములు గలిగి, పిల్లలై వర్తించి యెల్లెడ కెరగొన నరుగుచు.
శాంతి. 5-224

**ఎరవగువాఁడు** దే. సర్వ.

భేదబుద్ధి గలవాఁడు, అన్యుఁడు.

క. వైరుల దూతలు నెరవగు, వారు నిరాకృతులుఁ బాపవర్తులుఁ
దమకుం, జెరువగా వర్తించుట, నేరమి తుదఁబోయి చేటునిందయు
వచ్చున్. విరా. 1-138

**ఎరవలి** దే. వి.

ఎరగలి, కార్చిచ్చు, దావాగ్ని.

తే. కనక భూషణ జాలంబు కతన గజము, లెరవళులప్రోవు కొండల
నెనసియొప్పె, వల్గనంబుల హేషల వలన నబ్ధి,ఘనతరంగంబులను
దురఁగములు వోలిచె. భీష్మ. 1-88

('ఎరవళులు వోవు' - అని పెక్కు ప్రతుల పాఠము)

**ఎరవళ్లువోవు** దే. అ. క్రి.

ఉల్కలు పడి మండు.

చూ. ఎరవి ('ఎరవళులపోవు' - అని కొన్ని ప్రతుల పాఠము)

**ఎరవు** దే. వి.

కొంతకాలము వాడుకొని తిరిగి యిచ్చుటకు అడిగి తెచ్చుకొను సొమ్ము.

క. ఇమ్మై నరేశ్వర మాతురశ్రమమ్ముల నీ కార్యమయ్యెఁగాదే కడు లోభమ్మున నొండ్లవి సొమ్ములు, రమ్మనఁగన్ వచ్చునే యెరవు సతమగునే. అర. 4-847

క. తన యొడ లెరవని యును మను, జనకును బంధులని యతమె శోకించిన వచ్చునె చచ్చిన జంతువు నెమ్మన మధికము నొచ్చుఁగాక మహిత వివేకా. శాంతి. 1-220; స్త్రీ. 1-88

(ఇక్కడ 'ఎరవువంటిది, అనిత్యము' అని భావము)

2. భేదము, అరమరిక.

క. గురుభీష్మాదుల మనములు, దురమునకుం గొరయకుండ దుర్యోధనుఁ డాతురుఁడై యొడఁబఱుపఁగ నిప్పరుసున నెఱవైన యిచ్చు వడు బలమెల్లన్. ఉద్యో. 1-58

విశే.

1. ఎరవయినది.

చ. హరి గలుగంగ నేటికి భయంబున వచ్చితి నీదుగాండివం, బెరవుగ నిచ్చి నీవు తొగలెక్కి హరిన్ రథిఁ జేయఁగన్న నిష్ఠురభుజ విక్రమోగ్రుఁడగు సూతతనూభవుఁ దర్పవాయులం, బొరిగొనఁడే సుయోధనుని పోడిమి దూలఁగ నొక్కమాత్రలోన్. కర్ణ. 3-65

2. అన్యము, లాఁతి, తనదికానిది.

వ. మమ్మెరవుగాఁ దలంచి యిచ్చోట నిట్టట్టన వలవదు పురంబున కరిగి యచ్చోట నీకెట్లు ప్రియం బట్ల మన్నింపుమని రందుఁ గంకుండు మఱియు నిట్లనియె. విరా. 3-284

క. తనకుం దా నెరవని నను, వీను బంధులు సతమె యన్ని వేళంబునవే జనుఁడయిఁ జేయ నర్థిలి, వను తగ నొంద రతి కారణముగన రేంద్రా. శాంతి. 4-11

శ్లో. ఆత్మాపి చాయం న మమ సర్వా వా పృథివీ మమ
యథా మమ తథాన్యేషా మితి చింత్య న మే వ్యథా.
సం. భా. శాంతి. 174, 14

క. వరనాయక నీ యేలెడు, పురమున భూమిని మమత్వబుద్ధిగలుగకి.
స్థిరవై యుండుటకుఁ గతం,బరయఁగ నెద్ది వినుపింపుమది విశదము
గన్. ఆశ్వ. 2-91

ఎరవుపడు దే. అ. క్రి. (√ఎరవు)

కలహించు, భేదపడు, ద్వేషించు.

వ. అట్టియెడ సహదేవుం డాశైనేయు నుద్దేశించి...మీలో మీరెరవు
పడం దగునే యలుకదక్కు మనునెడ. ద్రోణ. 6—371

ఎరవుమాట దే. వి.

ద్వేషపుఁబలుకు.

వ సురనదీసూను దిక్కు మొగంబై సుయోధనుండు నీకుం గోపింప
నగునే నన్నును గార్యభారంబునుం జూచి నా బ్రదుకునకై సర్వం
బును సహింపవలయునని తేర్చి యంగరాజుం గనుంగొని మీ
రిద్దఱు నొక్కటియై భరంపడి యిప్పని సక్కంజేసి కాక మీలోన
నిట్టి యెరవు మాటలేల యని పొదివి పలికి. ఉద్యో. 4-253

ఎరవుసేయు దే. స. క్రి.

తనదికాని దానిని గాఁజేయు, ఎరవు వస్తువుగాఁజేయు.

క. ధనములు బంధులు భోగము,లనియెడు నస్థిరములెల్ల నాత్మకెరవు
సే,సిన శాంతి యలవడును మన,మున శాంతిశ్రీ సమృద్ధిమోక్షము
నిచ్చున్. శాంతి. 4-346

ఎరసేయు దే. స. క్రి.

1. ఎరగాఁజేయు, బలియిచ్చు.

చ అతని శిఖండి బాణముల కెఱ్ఱెరసేసితి. కర్ణ. 8-120

క. ...అప్పాంచాలో,త్తరు నొక నారసమునకు, నెరసేసె.
శల్య. 1-214

2. ఆహారముగా నొనరించు.

చ. ఫలము దళంబునుం దొడిమఁ బాయుట రాలినవానిఁ గొంచు నాఁ,
కలి కెరసేసి గోరసము కార్యము నట్టుల నిర్వహించి. అను. 6-65

**ఎరియించు** దే. స. క్రి.

తపింపఁజేయు, పీడించు.

వ. బకునితోడంబుట్టువగు నలాయుధుం డను నసురేంద్రుండు వడ
ముడివలని వైరంబు పెద్దకాలంబేనియు మనం బెరియింపం దఱి
వేచికొని యుండి యన్నికా సంగ్రామంబునకు నిసైన్యంబుగాఁ
జనుదెంచి దుర్యోధనుం గని తన్నెఱింగించుకొని యతనితో నిట్ల
నియె. ద్రోణ. 5-209

**ఎరియు** దే. అ. క్రి.

1. దగ్ధమగు, మండు, కాలిపోవు.

సీ. మఱియొక్క చెవ్వగ మనమున జనియించె, వాఁడి కేయుండు
గారగ్గి నెరిసె. అశ్వ. 2-165

క. గురు కర్ణుల యస్త్రాగ్నుల, నెరసిన యరిమున్ను దీని నిటుగాకుం
దం, భరపడి రక్షించితి సం,గరము తెగినఁ దొలఁగి యివుడు గాం
విడిచితిన్. శల్య 2-337

శ్లో అస్త్రైర్బహువిధై ర్దగ్ధః పూర్వమేవాయ మర్జున,
మదధిష్ఠితత్వాత్ సమరేన విశీర్ణః పరంతప.
ఇదానీం తు విశీర్ణోఽయం దగ్ధో బ్రహ్మాస్త్ర తేజసా.
సం.భా. శల్య. 62-18-19

2. పరితపించు, బాధపడు.

క. పరుల ధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు
మనం, బెరియఁగ నసహ్యపడు న,న్నరుడు దెవులు లేని వేదనం
బడు నధిపా. ఉద్యో. 2-58

క. శరవేదన సర్వాంగము, నెరియఁగ గాంగేయుడు పెదవులెండెడుఁ
దృష్ణాతుర ముడువఁదగిన నీరులు, వెరవునఁ దే నేర్తు వీవ చే
తెమ్మనఘా. భీష్మ. 3-428; ద్రోణ. 4-286.

8. నశించు. చచ్చు.

క. కౌరవులు దమదురితమునఁ, దా రెరిసిరి కల్మషంబు దానఁ గలదె
భూ,భారము వహింపు బహు య.జ్ఞారంభణ మాచరింపు మఖిల
హితముగన్. శాంతి 1-105

తోటక వృత్తము: తమతమ తప్పులఁ దా రెరియంగా, విమలమతీ
యిటు వీరికినై శో,కమున దహింపఁగఁ గాదు మనంబున్, సము
చిత మి త్తఱి శాంతము సుమ్మీ. స్త్రీ. 1-81

శ్లో. ఆత్మాపరాధాత్పుత్రాస్తే వినష్టాః పృథివీపతే,
మా తాన్ శోచస్వ రాజేంద్ర న హి శోచకే స్తికారణమ్.
సం. భా. శాంతి. 8-35

ఎఱ దే. విశ.

ఎఱ్ఱనిది, అరుణము.

క. నిలిచి మహో స్త్రం బెఱమం,టలు గ్రమ్మఁగ నేయుటయు
భీష్మ. 8—117

ఉ. నెత్తుటఁ దోఁగి నేల యెఱనింగి తెఱంగున నుండె నక్కమా
రో త్తముఁ డందుఁ జంద్రుక్రియ నొప్పె. ద్రోణ. 2-127

ఎఱుంగు; ఎఱఁగు దే. అ. క్రి.

1. వ్రాలు, దిగు.

ఆ. దానిమీఁద నుండి వాని రెంటిని భుజం,పంగ మదిఁ దలంచి పంచ
యోజ,నములు నిడుపు గల్గు రమణీయ శాఖపై, గరుడుఁ డెలమి
నెఱఁగెఁ గురువరేణ్య. 

క. ఎఱఁగిన యప్పెను వ్రేఁగున విఱుగుటయును. అను. 1-236, 237

వ. కోలంకుల చందంబు నొంద వాని కెఱఁగెడు కౌదమతుమ్మెద
పదువుల పగిదిఁ దొరఁగు నాఖండలతనయ ఖండిత పరవీర శాలా
యస నారాచశకలంబుల వలనను. విరా. 5-60

2. పడు, రాలు,

వ. క్రుతవర్మ శిరంబు ఖల్లంబునం ద్రుంచిన నది ముఖకాంతి మెఱయం
జంద్రమండలంబు మహిఁ కెఱఁగు తెఱంగుఁదోపం బడియె.
కర్ణ. 2-218.

8. నమస్కరించు.

క. మహోదారుఁడు గుంతీ చరణాం, భోరుహముల కెఱఁగి వినయ భూషణుఁ డగుచున్. ఉద్యో. 4-9

సీ అనఘు సుఖాసీనుఁడైన వసిష్ఠ సంయమిఁ గాంచి భక్తిఁ బాదముల కెఱఁగి. శాంతి 6-8

వ. వేదవ్యాస మునివరు పాదంబుల కెఱంగి. ఆశ్వ. 1-137

వ అన్సరపతి చరణంబుల కెఱఁగి. ఆశ్వ 3-139, ద్రోణ. 5-428

**ఎఱక** దే. వి.

పక్షి ఱెక్క.

క. ఎఱకలు విచ్చుచుఁ దుందము, గెఱచుచు వేఁగడగి పోసి వెళ్లి విపక్షుఁడై, యఱచిన నోడకు మని హరి, చెలి సొక్కఁగఁ ద్రోచి యొత్తె నెగయంగఁ గృపన్.

ఉద్యో. 8-301; విరా. 2-240 కర్ణ. 2-72

('ఎఱకలు' — అని బహు వచనమువంటి ప్రయోగము.)

**ఎఱచి** దే. వి.

మాంసము.

సీ. ...నెనడును నెమ్ములు నెఱచియుఁ గండలు నెనసి మర -తే- తలము ఘోరంబుగా. ఉద్యో. 2-144

క. ఉఱవగు సారుగ పంటలు, గోతీయుల పాడియును గఱచగుం బురుషులకుం, దెఱవలు చుట్టము లయ్యెన, రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్. అర. 4-295; ఆది. 6-58; స్వర్గ. 82

**ఎఱింగించు; ఎఱిఁగించు** దే. స. క్రి.

ఎఱుఁగఁజేయు.

1 ప్రకటించు.

సీ హయ మదద్విరద రథా రూఢ దక్షత, ప్రకటించువారును ప్రాస శక్తి, కుంత తోమర గదా కుశలత్వమెఱిఁగించు,వారుమగా నిట్లు వసుధలోన -ఆ- రాజసుతులతోడ రమణఁ బాండవ ధృత

రాష్ట్రసుతులు వృద్ధ రాజులొద్దఁ, దద్దయును ముదమునఁ దమ
తమ విద్యలు, మెఱసిరెల్ల జనులు మెచ్చి పొగడ. ఆది 6-11

క. కుంతీ తనయులు సమయము, శాంతతమై నడపి తమ భుజాబల
మును దుర్దాంతోద్యమ శౌర్యము నెఱిఁగింతుమనుచు నున్న
వారు గినుకెంచ గదుంన్. విరా. 1-13

2. తెలియఁజేయు.

క. అన విని తగుమాటల నాతని కొందలపాటు పాండు తనయుండు
గ్రమంబున డిందుపఱచి యరదము, సనఁగా నెఱిఁగించి పట్టె
శంఖము మఱియున్. విరా. 4-178

తే. ఊర్ధ్వగతి కేఁగు మానవు లుండునట్టి, నెలవు లార్యులు శాస్త్రను
నిశ్చయమ నఁ, గని యెఱింగింతు రవి నీవు వినుము నీకుఁ, దెలియు
నట్లుగఁ జెప్పెద ధీసమగ్ర. ఆశ్వ. 1-182

ఎఱుఁగఁబడు దే. స. క్రి.

తెలిసికొనఁబడు, కనఁబడు.

ఆ. వివిధ దుర్నిరూప వేషముల్ గైకొని, నిఖిల దిశల యందు
నిపుణ వృత్తి నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన, నెల్లి నేఁటిలోన
నెఱుఁగఁబడరె విరా. 8-93

ఎఱుఁగమి; ఎఱుంగమి దే. వి.

అజ్ఞానము, అవివేకము.

క. ఎఱుఁగమి చేఁసిటి నీ పెద్దఱికంబు దలంప నేమి తప్పు గలిగినన్,
మఱచి దయఁజూడు మిట్లంటఁబు నీకుం బనులు సేయఁ దగుదురు
వీరల్. విరా. 5-357

చ. తన ముసు పెద్ద బన్నములుఁ దమ్ముని పైఁగల కూర్మి పేర్మి నీ,
జనపతి సైపకున్నె యది నక్కని రాజ్యము పాలు లేని తీ,ఱున
కొడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె చాలరైరి వీ,రన రాకొ
వానలేమి యని యాడరె లోకము వారు కేశవా. ఉద్యో. 3-102

ఎఱుంగు; ఎఱుఁగు దే. స. క్రి.

1. తెలియు, గ్రహించు.

వ. తన దివ్యచిత్తంబునం గల యక్కారుణ్యంబు తెఱంగెఱుంగు నట్టి శక్తిం బ్రసాదించి. విరా 1—11

వ. అని యుపలాలితుండగు డింభకుండు దనకొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున. విరా. 1-22

క. ధర్మం బెఱుఁగుచు నెఱిఁగిన దానిని, మఱవ కనుష్ఠించునది సమం జసబుద్ధిన్. ఆది. 3-288

**2.** అభ్యసించు, నేర్చు.

శా. దేవా నాలవజాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్, సేవా దక్షత యొండుమై నెఱుఁగ నీ చిత్తంబునన్ మెచ్చున, ట్లేవండం గడునేర్తు బానసమునం దిచ్చోటనే కాదు న,న్నేవిటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డెబ్బంగులం జూచినన్. విరా. 1—218

**3.** కనుఁగొను.

క. కీచకుఁడు ప్రేటువడి తన, నీచపుదెఱఁ గొరు లెఱుంగనేరకయుం డన్, లేచి వెనుకఁజని విస్మయ, గోచరుఁడై యసురకతనఁ గుం ఠితు డగుచున్. విరా. 2—180

**4.** గుర్తుపట్టు.

వ మంద మంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణిగ్రహ ణంబున మేలుకని యిది యెవ్వరనవుడు నేనను నమ్మాటని యెఱుం గెఱింగి భీమసేనుండు. విరా. 2-167; అర. 1-327

**5.** జ్ఞప్తియందుంచుకొను.

క. కృతమెఱుఁగుదు రుపకార, వ్రతమున వర్తింతు రెప్పుడు వసంయు కరుణాన్వితు లవరపతికి శుభ, ప్రతిపాదకులగుదు రేమి ధంగుం డైనన్. విరా. 3-63

**6.** వెదకి తెలిసికొను.

ఆ. వివిధ దుర్నిరూపవేషముల్ గైకొని, నిఖిల దిశలయందు నిపుణ వృత్తి, నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన, వెల్లి వేఁటలోన నెఱుఁ గఁ బడరె. విరా. 3-93

7. విచారించు.

తే వాలి యజ్ఞాతవాస సంవత్సరంబు, నిండకుండంగ మున్న పార్థుండు బయలు, మెఱసి సమయంబుదప్పె నీవెఱిఁగి దీని, కేది దగు నది సేయుము మేదినీశ. విరా. 5-368

8. అనుభవముచే గ్రహించు, అనుభవించు.

క. హరి కులిశక్షతి యెఱుఁగని, గురుతర పక్షములతోడి కులగిరి వోలెన్, గరుడుండు గగన గతి నురు, తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్. ఆది. 2-41

ఉ. ...వీఁడు నీ, చేతుల లావెఱుంగఁడు విశిష్టశుభం బిది నీకు ఫల్గునా. ద్రోణ. 3-188

9. క్త్వార్థకముపై వ్యతిరేకార్థక క్రియారూపమునఁ జేరి 'లేదు' అను నర్థము నిచ్చును,

వినియెఱుఁగఁడు = వినలేదు; చూచి యెఱుఁగఁడు = చూడలేదు.

క. ...ఇట్టి సభన్, మానవ లోకేశ్వరులం, దే నెన్నడుఁ జూచి వినియు నెఱుఁగ ధరిత్రిన్. సభా. 1-58

చొచ్చియెఱుఁగఁడు = చొచ్చుట యెఱుఁగఁడు - ప్రవేశించినవాఁడు కాఁడు - ప్రవేశింపలేదు.

క బాలుఁడు సుకుమారుఁడు పెం, కాలములం జొచ్చియెఱుఁగఁడనక మొనసొరం, జాలుదు చొరుమని పనిచితి. ద్రోణ. 2-141

ఎఱిఁగి ఎఱిఁగి = బాగుగా దెలిసికొని.

ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను నే కార్యసముపేతుఁ, బాడియయ్యె యిట్టి పనికిఁ బనుప. అర. 2-86; అర. 3-321

ఎఱుక దే. వి. (√ఎఱుఁగు)

1. జ్ఞానము, తెలివి.

తే. క్రీడదెసఁ గౌతుకం బరియాడ రతుల, చవులు గొనియాడ వారు దీని సుఖంబుగాఁ గోరరెందు. విరా. 3-70

తే ఏన నీవను నైక్యంపు టెఱుక వొడముఁ, గాత గమనాగమనములు

గ్రాఁగిపోవ. శాంతి. 4-248

2. స్మృతి.

ఆ. ఎల్లవారు నెఱుక లెడలి చొక్కి నిద్రాతిశయము గూరినట్టు లైరి. విరా. 5-208

3. ప్రజ్ఞ.

వ. వనట యనియెడు నగ్ని నెఱుకఁ యనియెడు నీట నార్పుము. స్త్రీ. 1-92

శ్లో. పుత్రశోక సముత్పన్నమ్ హుతాశం జ్వలితం తథా।
ప్రజ్ఞాంభసా మహాభాగ నిర్వాపయ సదాప తవ॥ స్త్రీ. 8-49

4 ఆత్మానాత్మ వివేకము.

సీ. తారు గొందఱకు బాధకులయి నడచుట నరులచే బాధలఁ బడుట గలుగు, నివి కాలభావ్యంబు లెఱుక నగ్గిన నోరుఁ బతివిలి నోరు నిచేఁ బడితి ననుచుఁ, బురుషుండు ప్రియశోకములఁ బొందఁడు. శాంతి. 1-158

5. ప్రసిద్ధి.

సీ పాండు కుమారులు...భూసురవరుల వలన, వేదములును ధనుర్వేదాది విద్యలుఁ, గఱచుచుఁ గడలేని యెఱుకఁ గాంచుచున్నఁ దివ్యపుల గుణోన్నతి సైపక. ఆది. 8-12

ఎఱుకచే(సే)యు దే. స. క్రి.

తెలియఁజేయు, తెలుపు.

ఆ. ద్వారపాలు రచట వారింప శాంతిమై, నూఁగఁగొన్న వారు వెలిచి, లోని కెఱుకచేసి లోఁగుచు వారు సన్నిముః గాలిగ నృప గృహాంబుఁ జేర. శాంతి. 8-288; ద్రోణ. 4-188

ఎఱుకపడు దే. అ. క్రి. (√ఎఱుక)

1. తెలియు, బోధపడు, స్పష్టపడు, ప్రకటితముగు.

క. హరి పలికిన విధమెంతయు, నెరవై యున్నయది వింటి యిమ్మాటల తెఱం, గరయఁదము తొలుత నీ వెనువరి చందం బెల్ల నెఱుకపడి యెదుఁ బిదపన్. ఉద్యో. 3-214; స్త్రీ 2-167

ఆ శాపమిచ్చువాఁడు జనని యుత్సంగంబునందు నిద్రపోయినట్లు యుండి, యమరవరుల కఱునకైన యన్యోన్య సంభాషణంబు లెఱుకపడఁగ వింటి. ఆది. 2-131

2. అనుభవించుచున్నట్లు తెలియఁబడు.

గీ. అధిక దుఃఖరోగార్జున కౌపథంబు, సురచిరంబుగ సౌఖ్యంబు చూవె యెందు, నొనర భార్యాసమేతుఁడై యున్న వాని కెంతల య్యును నాపద లెఱుక వడవు. అర. 2-72

ఎఱుకు దే. వి.

కిరాతుఁడు, నిషాదుఁడు.

తే. పఱప నోపకయున్న మైమఱచి పెంటిఁ, బెనఁగియున్నను బ్రసవింప మొనసియున్నఁ, దెవులుగొని మృగములఁ దివిరి యేయ, రెఱచి యాహారముగ మను నెఱుకులయిన. ఆది. 5-౮౪

క. ఎఱుకని యెఱుఁగక నిన్నున్, మఱుకువ నెదిరితిని దీని మఱవుము నన్నుం, గఱకంఠా క్షమియింపుము, నెఱి నెవ్వరి కెఱుఁగ నగునె నీ చరితంబుల్. అర. 1-827

ఎఱుకువ దే. వి. (√ఎఱుఁగు)

అనురాగము, ప్రేమ.

తే. అవయవ భంగులందుఁ, దగిలి మఱపునఁ దడయు సిద్ధుల పిశాల, నయన దీప్తుల నెఱుకువ బయలువడఁగ. విరా. 6-895

క. ఎఱిఁగినఁ జేరఁడు చేరుట, యెఱుకువమై మనకు దైవ మిచ్చినసిరి యిట్లఱిమిన యీలో గ్రక్కున, నఱకు మితఁడు దెగిన మన మనః పీడ దెగున్. ద్రోణ 8-181

ఎఱుగలి దే. వి.

పెరుగుట, పెంపు.

సీ. ...దమం బెఱుఁగలి యధికంబైన, స్తోత స్పర్ధోముఖ ప్రసృతి రజస్సు

ఆ-పెరిగినప్పుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ బొంద నూర్ధ్వ వృత్తిఁ బొందు. అశ్వ. 2-125.

**ఎఱ్ఱని చూడ్కి దే. వి.**

కోపముగల చూపు, కోపదృష్టి.

ఉ. క్రోధవేగ సముదగ్రత నెఱ్ఱని చూడ్కిఁజూచి. విరా. 5-193

**ఎల దే. విశే.**

(వృత్తియందు 'ఎలమి'లోని 'మి' వర్ణము లోపించిన రూపము).

1 లేఁతది, కోమలము. చూ. ఎలదీఁగ.

2 అభినవము, నూతనము. చూ. ఎలజవ్వనము.

3. స్వల్పము. చూ. ఎలనవ్వు.

**ఎలచన్నుఁగవ వి.**

లేఁతచన్నుల జంట- బిగుతుగల చన్నులజంట.

సీ. మారేడుపండుల గారాము సెఱచు నీ, యెలచన్నుఁగవ వేడుకల నొసర్చె. అను. 1-5,

**ఎలజవ్వనము దే. వి.**

నూతన యౌవనము.

తే. శ్రమములేదు ప్రతోదవ్రణములులేవు, నాతియును నేను నెల జవ్వనంబుఁ గంటి, మిది మహాద్భుతతర మందుమే భవన్మహాను భావత్వ మేమి సేయదు మునీంద్ర. అను. 2-314; ఆది. 3-27

**ఎలదీఁగ; ఎలదీఁగె; ఎలదీవ దే. వి.**

లేఁత తీఁగె.

సీ ఎలదీఁగఁ గప్పిన లలిత పరాగంబు, క్రియ మేన మేదినీరేణు వొప్ప విరా. 2-188

సీ. సోలెడు నెలదీఁగెలీలఁ గ్రాలుచు వింత, చెలువంబు దలకొనఁ జేరి నిలిచి (సం.ము ప్రతి, ఆ కా-ప్రతి) విరా. 2-64

సీ. మావి మ్రోకల నెలదీవలఁ జెన్నొందు తోఁటలకడ నలి తోడఁ జెందె. శాంతి 3-332

ఉ. ...సుయోధనుం డదె యహీనబలంబులఁ గూర్చెఁ గర్ణుతో,
మత్తగజంబు లీల నెల మామిడిఁ గూర్చిన భంగిఁ బాండుపుత్త్రో
త్తమ వీనిఁ గూల్చు మతఁ డొంటిగ రాజ్యము నీకు జేకుఱున్.
కర్ణ. 2-350

ఎలమావి దే. వి. ఎలమామిడి

తేమామిడి (తియ్యమామిడి అని సూ. అ ని)

వ. అస్నరపతులు నఱుకుడువడిన యెలమావి జొంపంబుల చందం బగుటయు ద్రోణ, 2-85

ఎలమి దే. వి.

1 సంతోషము.

క. ఎలమియు నచ్చెరువును సరి, నెలసిపొదలు మానసమున నెంతయుఁ బ్రొద్దేఁ, గలలోనఁ గన్నచందము, ·లంచుచు నంగితిని భక్తి తాత్పర్యమునన్. విరా. 1-25 (చూ. 28)

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి. ఉద్యో. 4-159

2 ప్రేమ, అనురాగము.

సీ. ఎలమి నమ్మోలఁత నన్నెలయింపఁ దివిరినఁ నెడఁద కానందంబు నిక్కగాదె. విరా. 2-86; 1-10

3, అనుగ్రహము, దయ.

తే నామనంబు నానంద మగ్నమునఁ జేయ, నెలమి సన్నిధిసేసె సర్వే శ్వరుండు. విరా. 1-12

4. వికాసము.

క. అని పలికి గాఢనిశ్చయ,మున వదనం బెలమిఁబొంద మును కలఁగిన నీ,మొనలెల్ల నొక్క మొగమున, నొనరిచి తలకొలిపె భూసురోత్తముఁ డనికిన్. ద్రోణ. 5-42

క. ఎలమియు వాఁడుటయును దన, వలచినయట్లవి యెఱుంగ వావిధి చరితంబులు బలవంతంబులగుట, వలదె వివేకంబు పెద్ద వారికి నింద్రా. శాంతి. 4-397

4. పెంపు, అతిశయము, వృద్ధి.

క. అలుచైనను బగతుని దెసఁ, దలఁపు గలుగవలయుననిన వరోర్జిత్ల దోఃర్పలులగు కౌంతేయుల మన, మెలమికలిమి వచ్చి లేయిట్టుమఱి నగునే. విరా. 8-107

క. హీనస్థానమున విభవ,హీనత నిట్లుండి రిపుల యెలమిఁగనియు నీ, మానసమున శోకింపమి, దానవకులనాథ యెవ్విధంబునఁ గలిగెన్. శాంతి. 4-423

6. ఉత్సాహము.

తే. ఇవ్విధంబునఁ దమతమ యెఱఁగు,లంచఱును జెప్ప విని మరునంద నుండు, దగవిచారించి కార్యంబు తెగువగాంచి, యెలమి వారలఁ గనుఁగొని యిట్టులనియె. విరా. 3-112

క. సమరమునకుఁ దగు నుద్యో,గమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ గౌంతే యులు మత్స్యమహీ నాథుఁడు, నన్నా,హము చేసెన్ ద్రుపద విభుఁడు నాయిత మయ్యెన్. ఉద్యో. 1-49

7. ధైర్యము.

తే. శంఖ భేరీరవంబులు సామజముల, బృంహితంబులు వింత లే వ్పతుం సైన్య, పరిచయోదాత్తులగు నరపాలసుతుల, కెలమి బోదుము దీనికి నింతయేల. విరా. 4-175

8. క్షేమము, సౌఖ్యము.

ఉ. ఏనన వేఱ యొక్కఁడనె యిట్లనఁగాఁ గనుఁగొయ్య బుమ్మెల్లయుం, గానన దేశవాసములఁ గాఱియ కోర్చి యడంగియుండి మీ, పూనిక దీర్చి మీరెలమిఁ బొందుట యెల్లను బుద్ధిదేవతా, మాన దయా సమృద్ధి నను నొందుట గాదె సురేంద్రనందనా. విరా. 5-346

9. సౌందర్యము.

క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి పట్టణంబు విభావరీ, త్సవ మాధవ లక్ష్మికి లలి,తవనంబై యెలమిఁగలిమి కావల మయ్యెన్. విరా. 5-388

10. తెవులులేమి, ఆరోగ్యము

సీ. నైజంబులైన-తే-కుసుమధూపాది గంధముల్ గొనుట నెలమిఁ
దాల్చునని చెప్ప దరువు వేసంబు ఘ్రాణ, ముర్వీశ శక్తి యిట్లయి
దను నల్లసిలుట, వనభూజంబు పంచభూతాత్మకంబు.
శాంతి. 4-88

11. విలాసము. శోభ.

క. అని తెలంచి నీదుఃఖలుకలు. విని మెచ్చితి వరముగోరు విహాగోత్త
మ నీ, వనిన శుకంబు వహీజంబునకుం బేరెలమి వేఁడె భూపవరే
ణ్యా.
అను. 1-157

ఆ అమర వల్లభుఁడు నమ్మృతసేచనమున, భూజమునకుఁ దొంటిపొల్పు
కంటె, మిగుల నెలమిసేసె మేలియాశ్రితు లిట్ల, మనతు రధిపుఁ
గురుత మారవర్య.
అను. 1-158

12 తోడ్పాటు. రక్షణము

(భీముని అర్జున సాత్యకులకు సహాయముగాఁ బంపుట.

తే పెక్కుచోటుల నెటిఁగిన యుక్కులావు. గలుగు నీతనిఁ బనుచుట.
కలకనేల, యితఁడు గలయ నయ్యిరువుర కెలమివచ్చుఁ, బనుతు
నేనటు శోకంబు వాయలయు.
ద్రోణ 4-131

శ్లో. ఇతో గతే భీమసేనే సాత్వతం ప్రతి పాండవే,
సనాథౌ భవితారౌ హి యుధి సాత్వత ఫాల్గునౌ.
కామం త్వశోచనీయౌ తే రణే సాత్వత ఫాల్గునౌ,
రక్షితౌ వాసుదేవేన స్వయంచాస్త్రవిశారదౌ
సం. భా. ద్రోణ. 126-28, 34

**ఎలయించు** దే. స. క్రి.

1. కౌఁగిటఁ జేర్చు, కౌఁగిలించు

సీ. ఎలమి నమ్మోలఁత నస్నెలయింపఁ దివిరిన, నెడఁద కానందంబు
నిక్కఁగాదె.
విరా. 3-86

2. వశమగునట్లుచేయు, లోఁబఱచు.

ఉ. చయ్యన నేగి యంబుజ విశాల విలోచనఁ గాంచి ప్రీతిమై, నయ్యెడ

నేకతంబ హృదయం బలరం దగఁ బొగ్గి యొక్కమై, నియ్యకొనంగఁజేసి యెలయించెద నిక్కకు దార్ఢ్యి చేర్పఁగన్, శయ్యకుఁ దెచ్చెదన్ కుసుమ సాయకు పూనికి నేఁడ తీర్పఁగన్. విరా. 2-245.

క. విను విషయ జ్ఞానమునకు, ననయంబును మనసు మూలమది కామ క్రోధనిరూఢమగుచుఁ బురుషుని, నవశము నెలయించు నింద్రియార్థంబులకున్. అర. 5-80

3. ఉన్ముఖమగునట్లు చేయు.

తే. ...ఇంతి, వింతభంగుల కెలయించి వెఱలఁజేసి, యభిమత క్రీడనములకు నలవరించు. విరా. 2-810

4. కలిగించు, సమకూర్చు.

క. మానుషము దైవమును సరి,నే నేనని కార్యసిద్ధి నెలయింపఁగ ని, త్యానందుఁ డయ్యె ధర్మజుఁ,డీ నిర్మల భాగ్యమహిమ యేరికిఁ గలదే. అశ్వ 4-162

5. తీసికొనిపోవు.

వ. ఇట్లతిదూరంబుగా నెలయించి యేఁగుచున్న నతి రాఘవుఁ మాయమృగా నూహించి రాఘవుం డమోఘబాణంబు దొడిగి నడుమునకు గుమ్మృగంబు సేసిన. అర. 6-828

ఎలయు దే. అ. క్రి.

1. అస్తమగు, తగు, క్షీణమగు.

తే. రాజభావంబు తొడుసున గ్రుచ్చుకొన్న, మనసుతో మండ కెన్నఁడో, మరచి యింద్రియముల నిగ్రహించి సత్త్వాదు లపుడు ద్రోచి, యేము శాంతిసుఖంబున నెలయు టనఘ. శాంతి. 5-826

2. సిద్ధపడు.

తే. ...శోణిత ప్రసరణంబు, నిరతిశయమైన వెడవోలి నిలిచి గదలు. వామకరముం నూఁదియు వారు మగుడఁ, బోరి నెలయుట నిర్భరాద్భుతము సేసె. శల్య. 2-282

3. ప్రవేశించు, ఆవేశించు.

సీ. విను తొల్లి ధర్మవర్తనము లసహ్యంబులైన దానవులు మహోగ్రవా మున,నరు లయం దెలసిన నరవర వారలు దర్పరోషముల నధర్మ వృత్తిఁ, దగిలినఁ గలఁగె వేదములు క్రతువులు శాంతి. 5-496

4. వర్తించు, మెలఁగు.

క. విను సత్త్వరజస్తమముల, యనుసరణము వలన వివిధమగు యోనిగణం,బున నెలసిన యాతత్త్వము, దనుఁ జూడగ లేక యవియ తానని యుండున్. శాంతి. 6-12

5. కలుగు, పుట్టు.

క. ఎలమియు నచ్చెరువును సరి, నెలని పొదలు మానసమున నెంతయు ప్రొద్దేఁ, గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితిని భక్తి తాత్పర్యమునన్. విరా. 1-25

చ. ...హో యని కిన్నర యక్షసిద్ధ సాధ్యులు దివినుండి యార్చు చును దూర్యరవంబు నెలంగ నద్భుతం, బెలయఁగఁ బుష్పవృష్టి గురియించిరి కర్ణుపయిం బ్రియంబునన్. అర. 7-378

6. ప్రవణమగు, ఉన్ముఖమగు.

సీ. ఇంపారు బోఁకున ని గురోత్త చిత్తంబు, లెలసి యొండొరులపైఁ బొలయు చూడ్కు, లాదట నుపకరణావళి వెడవెడ, యాదరిం చుట రాగమడరఁ దొడరి. విరా. 2-238

వ. వాఁడు (ఘటోత్కచుఁడు) నాకు భక్తుండేమను (యుధిష్ఠిరుఁడు) సహదేవు కంటెను వానికిఁ గూర్తునట్టి పట్టిలేకున్న నాకు శోకంబు గాకుండునే యని తత్ప్రతివీరుని దెసకు నెలసిన యంతరంగంబు రోషాక్రాంతంబగుటయు. ద్రోణ. 5-257

సీ. పోటులనొచ్చి మేనును దప్పి గూరి చిత్తంబును బోరికెలయ-తే- కునికిఁ జేసియుఁ దొలఁగితి నొదిగి సేద, దేర్చుకొని రణమునకు నుదీర్ణ వృత్తి వచ్చువాఁడను. శల్య. 2-64; అను. 3-138

7. లోనగు, వశమగు

కీ. లలిత వివిధ విహారంబులకు లతాంగి యెలసి నొలసిన యట్టైన

నెలమిఁగలసి, యభిమత క్రీడ సలుపంగ నప్పళించి, వెనకి రిత్త
బయల్ గని విహ్వాలించు విరా. 2-301

సీ. ఇంద్రియార్థంబుల కెలసిన పురుషుండు, గాఢ రాగంబునఁ గరఁగు
చుండు. అర. 5-81

8. ఒలయు, వ్యాపించు, ప్రసరించు.

క. ఎలసి పయివారి దంత ఘటల మదముల రావులు వెట్టుటయుఁ
గౌరవ సేనల యేనుంగుల మద ధారలు దొంగం బోలయు మధ
కరము లుబ్బడఁగన్. భీష్మ. 1-141

వ. అని యిట్లు శరణాగత రక్షణ ఫలంబు లేమ ప్రకటంబగు లుబ్ధ
కపోతాఖ్యానంబు సెప్పిన విని యప్పితామహులని మీఁదం బ్రీతి
వినయ విస్తారవిలోకనం బెలయ నప్పాండవాగ్రజుండు.
శాంతి. 3-342

9. ఉండు.

చ. కలభము వహ్నిమీఁదఁ జను చందము గాదె నృపాలుఁ దగ్గునం,
దలపడఁబోక యాతని శిరఃపదరంబుల వారి నగ్గమై, గొలిసినఁ
గావఁగావశమె యీతని నీవును నేను నుండి ముగ్గలముగఁ
బోవనీఁదగదు గ్రమ్మఱిన జెర్దగాము నిల్పు మవిప్పుడున్.
ద్రోణ 5-119

సీ. మృతిఁబొంది వేగ జన్మించినఁ బూర్వ దైహికము లన్నియు బుద్ధి
నెలయు వాఁడు, జాతి స్మరుం డనఁ జను. అను 5-151

10. చేరు, ముసరు.

సీ. వనిక మదమున కెలయు తేఁటుల మొత్తములు వెలిగొడుగుల
చెలువుగొలుప. భీష్మ. 1-104

11 నెలకొను, నిలుచు.

క. శరతల్పగతుం డతఁడె, శరణంబుగ నాశ్రయించి సర్వావ వ్యాప్తి
రతుండగుటను వినుత,శృగత నతనియందు వారు భావం బెలసెన్.
శాంతి. 2-14

12 సక్తమగు.

తే ఇంద్రియములెల్ల నట్టివ యెలసి యుండు, వలన మనసున్న దమ తమ వర్తనముల, నిగుడనేరమి దెల్లంబు నృపవరేణ్య, యిట్టు లగు టజ్ఞులకు నైన నెఱుఁగవచ్చు. శాంతి 6-85

13. పొందు

సీ. వినుము మూర్ఖునఁ జవిగొన దర్శన స్పర్శనము లాచరింప వినంగ నెలయ, నేమి సంకల్పంబు నెడఁజేర్చు నిష్టార్థములను ననిష్టార్థములను గోర,టయును నొల్లక. అశ్వ. 2-64

సీ నెలయేఱులందలి తెలినీటఁ దనువునొంపెలసిన గిరుల తెప్పలకుఁ జేర్చి. శాంతి 8-382

14 చను, పోవు

సీ. (రాజులకు) వేటకు నెలయు టఘము, గాదు. అను. F-66

ఎలరారు దే. అ. క్రి. (√ఎలరు + అరు)

1. అతిశయించు, అధికమగు.

క. ఇవ్విధమున నాయితమై, క్రొవ్వెలరారంగ నిలిచి కురుపాండ వులం,దెవ్వరు మును గడగిరి. భీష్మ. 1-232

2. ప్రకాశించు, ఒప్పు.

క. మునివర నాదగు చిత్తం,బునఁ గౌతూహలము సాల మొలకెంచె. తలి,ద్పున నెలరారెడు నేర్పడ, వినిపింపుము మీఁది కథ సవిస్తార ముగన్. అను. 4-447

ఎలరు దే. వి.

1. అతిశయము, 2. ప్రకాశము. చూ. ఎలరారు, ఎలర్చు, ఎలర్పు.

ఎలర్చు దే. అ. క్రి.

1. అతిశయించు.

ఉ. ఇట్టి ననన్న నీ, వివ్మెయిఁ దూఁపు త్రై యని యాతఁజరోచుఁజఁ గెంపెలర్పఁగన్. ఉద్యో. 8-298

ఉ. ...పాండవ బాహా సంపదల్, పేర్చు నెలర్చు నింకఁ గురుబృం

వ. అనుచు నెలుంగు రాలువడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్త చిత్తుండయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి.
ఉద్యో. 3-119

వ. వారలలోన సుభద్రాసూనుండు తేమియుం జూవి సవ్యసాచి యడుగులు దొట్రుపడ నక్కొలువులోనికిం బోయి కలయం గనుంగొని యెలుంగు రాల్పడ నిట్లనియె ద్రోణ. 2-282

వ. కొండొక సేపునకు మూర్ఛదేఱి యన్నరపాలుం డెలుంగురాల్పడ నిట్లనియె. సౌప్తి. 2-12; అర. 4-386

ఎలుంగెత్తి దే. అ. క్రి. క్త్వార్థకము

బిగ్గరగా, ఉచ్చైస్స్వరముతో.

వ. సంశప్తక సమితితోడం దమకించి పోరిపోరి కౌరవ సైనికుం సింహనాదంబులు వింటి నప్పు డెలుంగెత్తి యుయుత్సుం డాడిన మాటలు నాకర్ణించితి. ద్రోణ. 1-258

తే. ఏమి యీ కొండి నెలుఁగెత్తి వర్గసమితి, యచ్చుపడఁగ నశ్వత్థామ చచ్చెనని... అని పదంపడి యల్లన యతని చెవికి, వినఁగ రాకుండఁ గుంజర మనియె నధిప. ద్రోణ 5-16

ఎలుఁగెత్తిచెప్పు; ఎలుగెత్తి పల్కు దే. స. క్రి.

బిగ్గరగాఁ బలుకు, ఉచ్చైస్స్వరముతోఁ బలుకు.

చ. తనుఁగొని సైన్యముల్ విఱిగి క్రందుకొనన్ వెసఁ బాఱ నాపగా,
తనయుఁడు సేననాఁగ యివి దైత్యుల మాయలుగాని బొంకు బోం,
కని యెలుఁగెత్తి చెప్పఁగ భయంబున నమ్మక పోయె నట్లవో, యిన
నరుదెంచెఁ గౌరవ మహీశుఁడు దీన భీష్ముపాలికిన్.
భీష్మ. 3-136

ద అని యెలుగెత్తి పల్కినవి నాఁడు మదోద్ధతిఁ ద్రుళ్లు
కర్ణ. 3-217

ఎలుగుఁగుత్తిక దే. వి.

డగ్గుత్తిక.

తే. .. ధర్మనందనుని యాననంబు వీక్షించి నిర్జరనాథ తనయుఁ,

4. ప్రతి, ఒక్కొక్క.

చ. ఒకరుని చేతి ప్రోవును దదున్నతి ప్రావును గాంచి యెల్లవెంట
కును గొలంత లేక పొగడంబగు సంపదవొందె. ఉద్యో. 2-77

**ఎల్లది; ఎల్లయది** సర్వ. (ఎల్లన్ + అది)

సమస్తము.

క. సతికిం బతిపనుపు సేయఁ జను నెల్లదియు. అను. 1-68

తే. ఎల్లయందును దావసియించు నెల్ల, యదియుఁ దనయందు వసి
యించుటం బ్రదు వాసు, దేవుఁడను పేరి కర్థంబు. ఉద్యో. 2-326

**ఎల్లనాఁడు** వి.

ప్రతిదినము.

సీ. ...ఇట్టులు షోడశంబు నాఁట నెల్లనాఁడును ఋతుస్నాత యొదల
కుండ, నెట్టి కార్యము గల్గిన ఋతుమతిఁ, మాగమము సెప్పని
తిన్న నాయు వెక్కు. అను. 4-26

**ఎల్లప్పుడు** వి. ప్ర. (ఎల్లన్ + అప్పుడు)

సర్వకాలము.

క. చుట్టము పగతును లేఁడఁ, బెట్టిదనులవలనఁ దగుల దెల్లప్పుడు
నెప్పట్టున సద్భావను మదిఁ, బుట్టదు సంతోషవాంఛ బుద్ధాత్మున
కున్. శాంతి. 5-26; ఆశ్ర. 1-74

**ఎల్లప్రొద్దు**

ఎల్లప్పుడు

ఉత్సాహవృత్తము- ధరణినాథ వినుము మధువుధార యెల్ల ప్రొద్దునుం,
దొరఁగుచుండ నగఁడు దాని దోషాలమున నానుచున్.
శ్రీ. 1-48

**ఎల్లభంగులు**

అన్నివిధములు. సర్వథా.

క. అనుడు బృహన్నల యిట్లను, జనపాలక నందనుండు
చే,కొనుసెలు చీరలు దెచ్చుట పనియె యటుసూడఁ దెల్లభంగులఁ
దెత్తున్. విరా. 4-48

**ఎల్లి[1]** దే. వి.

ఛత్రము, గొడుగు.

ఉ. అల్లదె కంటె పాండుతనయాగ్రణి తేరు సితాశ్వయుక్తమై, వెల్లఁ యెల్లి నొప్పెడిది. శల్య 1-138

క. ...మణిమయంపు టెల్లులు మెఱయం, గా నీ వేతెంతువు. శాంతి 4-339

**ఎల్లి[2]** వి. ప. జా. అనా.

1. నేఁటికి మఱునాటి దినము, రేపు

తే. ఎల్లియెల్ల విధంబుల నెందుఁ జొచ్చె, నేని నా ధర్మతనయుండు తాన వచ్చి, యడ్డపడెనేని నీవ పెంపారు కరుణఁ, గాచితేని నాచేఁ బాపుఁ గీచకుండు. విరా 2-182

వ. నీకు నేఁడు రోహిణిగా యెల్లి రేవతి నీకుఁ జంద్ర తారాబలంబులు గలవు గమనంబునకు రేపు దగు మేలు. ఉద్యో. 8-180; ఆన. 2-168

2. సమీపములో జరుగనున్న దానిని సూచించుటకు ప్రయుక్తమగును.

క. మొనలం బడియెడు నీచెప్పిన యట్టుల నడవుతేము విరుదులరై నీవును వీరు నిలువుఁడిదె దండన మెల్లిగ వచ్చె నూఱుకులు గమఁడింకన్. ఉద్యో. 8-365

**ఎల్లిదము** దే. విశే. ఎలిదము

1. లఘువు. తేలికయైనది. చులకనయైనది. గౌరవము లేనిది.

చ. ...అన్నదమ్ములును బొందిన నేరికసాధ్యములట్లుగా, వెరవయి నిల్చినం గెలని యెల్లిదమై పఱివోదు రెంతయున్. ఉద్యో. 2-88

ఉ. భూమిసురేంద్రులన్ దివిజపుంగవు దాదిగ భక్తిఁ గొల్చుచో, నేమిట నొక్క వాఁడు గడు నెల్లిదమై రిటు నీకు నిచ్చుటన్. అర. 5-16; ఆశ్వ. 1-81; ఆది 8-292

2. అగౌరవము పఱుచునది. అవమానకరము.

తే. వేఁడ దొడివూసి కట్టి యవ్విరటుఁ డుత్తరుండు దోఁజను దేరఁ గొల్వుండు బుద్ధినచటి కేతెంచి కని విస్మయంబు నొంది, యెల్లి

దంబుగఁ దలఁచుచు నిట్టులనియె. విరా. 5-317

వి.

8. పరిహాసము.

క. మృదుభాషణముల దుర్జన, హృదయము ప్రసన్నతా మహిమఁ బొందునె యెల్లిదముగఁ గాని యంతంతకు, మనమెత్తుకొం గాక దురభిమానము పెర్మిన్. ఉత్త. 2-34

ఎల్లినేఁడు దే. వి. ఔ. అవ్య.

రేవు, ఈదినము.

ఆ. ఎల్లి నేఁటిలోన నెఱుఁగఁ బడరె. విరా 8-98

తే. నరుఁడువచ్చు, నిందు మీ పంపునేఁత నెల్లినేఁడ. మా.. 69

ఎల్లుండి దే. వి. ఔ. అవ్య.

రేపటి తావలి దినము.

వ. ...దమయంతీ స్వయంవరం బెల్లియో యెల్లుండియో యయ్యెడు. అర 2-168

ఎల్లెడ; ఎల్లెడలు దే. వి. (ఎల్ల + ఎడ)

అంతట, అన్ని తావులు.

సీ. దమమును సత్యంబు క్షమయును నెల్లెడ వెలుఁగింపవలయు. శాంతి. 5-640

చ. ...అంతరంగ నదరి చింతు మెల్లెడలు రాగిల విగ్రమున గ్రమం బునన్. ద్రో. 2-3

తే. ...గురుని, బ్రబల నెల్లెడఁ జాటించె రాజరాజు ద్రో. 1-114

క. అనుమానము లేక తిరిగె నతఁ డెల్లెడలన్. ఉద్యో. 1-180

ఎవఁడు దే. సర్వ.

కిమర్థకము (ప్రశ్నమును దెలుపును)

సీ. ఆరాము, డెవనితోఁ బోరాడి యిరువది, మూఁడు దినములకు వాఁడి దళిఁగె. శాంతి 2-12

(ఆని తి. వ. ప్ర.కో—ఆనందచారి పాఠాంతరము వి.ముఁలో ఈ పాఠాం తరము లేదు)

**ఎవరు** దే. సర్వ. బహు. (√ఎవఁడు)

కిమర్థకము. (ప్రశ్నమును దెలుపును.)

క. ఆ యిరువుర నోర్వ నెవరికైనను వశమే కర్ణ. 1-41

వ. ఇది యెవరి ఘోషంబని గోపాలకుల నడిగిన వార లిట్లనిరి. అర. 3-116

**ఎవ్వఁడు** దే. సర్వ. (ఏ+వాఁడు) ఎవ్వాఁడు. (బహు) ఎవ్వరు (మహతీ వాచకము గూడ నగును)

1 యచ్ఛబ్దార్థకము.

క. మనలోన నెవ్వఁడెమ్మెయి, పనివెంటను విగటు మనము వడయఁ దమది యెల్లను నేర్పరించి యంగియుఁ, దనతన మది నున్న తెఱఁగు తథ్యము చెపుఁడా విరా. 1-65

వ. ఎవ్వనియేని వీర్యంబున నిక్కానన్ల యీ నుపిల్లె నట్టి యుపరిచరుం డను రాజర్షి. ఆది. 4-188

2 తచ్ఛబ్దార్థము నపేక్షించు సంబంధ సర్వనామము.

క నాయనుచరులం దెవ్వఁడు, మీ యెడ భయభక్తులేక విగిరి మెలఁగె నే,నా యధము నిదండితుఁగాఁ, జేయుదు నతఁ డెంతయుం బ్రోద్ధు డయినన్. విరా. 1-102

ఆ. పెనుపట్టువాలు దాన నాకెవ్వరు, గదువు దూడు వెట్టి కట్టుఁ జీర, యిచ్చి సాకతమున వేలుదు రట్టివారలకుఁ బనులు చేసి మెలఁగు బుద్ధి. విరా. 1-298

3. కిమర్థకము: (ప్రశ్నమును దెలుపును)

వ. మఱియు దుర్వాసనుండు వీరులందఱును గొద్దుపోయిన వారలు పౌరుషంబుగం మానిసి యుండెవ్వం డనియె. ఉద్యో. 1-352

క. ...కురుపాండవులం, దెవ్వరు మును గడఁగిరి. భీష్మ 1-282

వ. అనుచు మందమంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాద స్పర్శనంబున మేలుకని యిది యెవ్వరనవుడు. విరా. 2-167; శాంతి 5-7

మ, త్సాయకముల నినుఁ గూల్చెదఁ, జూ యెవ్వతనైతినేమి
సూచెదు నర్జునన్. భీష్మ. 3-324

వ ఇవ్వనిత యెవ్వత. శాంతి. 4-400; స్త్రీ. 2-81; అర. 7-348

**ఎవ్వరివాఁడు**

ఎవ్వరికి సంబంధించిన వాఁడు, ఎక్కడనుండువాఁడు.

వ. అమ్మహీపతి నీ వెవ్వరివాఁడవని యడిగెనేని పాండవాగ్రజునకు
కానసాఁబు సేయుదు సంగిలవాడ విరా. 1-84

**ఎవ్వాఁడు** సర్వ. (ఏ+వాఁడు) (బహు) ఎవ్వారు, ఎవ్వారలు

ఎవ్వఁడు.

1. ప్రశ్నార్థకము.

తే. అనఘ నన్నెఁడిట్టు లనియె నాయతుల బాహు, బలముఁ జేసయంగ
ద్రుపదీయు పతులు కారు, మూఁడు లోకంబులందు నెవ్వాఁడు లేఁడు.
విరా. 2-56

తే. వైష్ణవియుఁ గల్మష ప్రశుద్ధ్వంసినియును, నైన యీయను
శ్రీలి ప్రాజ్ఞుఁడైన నెవ్వాఁడు పఠియించు యజ్ఞదాన, సమయ
ముల వాఁడు సత్ఫలితము పడయు. శాంతి. 4-250

ఉ. సాగవు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకుచేఁ,
గారమ్ముఁ బొంగలేక చెడఁబాటినదైన యవస్థ గెలుపులె, వ్వారలు
పేటుసేసి రది వారల చేటగుఁ గాని ధర్మని, స్తారకమయ్యె సత్యకుభ
దాయక మయ్యెను దైవముండినన్. ఉద్యో. 3-278

2. కిమర్థకము.

తే. కౌరవులలోన నిప్పుడెవ్వారితోడ, ననికిఁ గడఁగుదునో చూచి
కొనఁగ వలయు. భీష్మ. 1-179

**ఎవ్వి**[1] ఏది బహువచన రూపము.

చూ. ఏది.

**ఎసఁగు** దే. అ. క్రి.

1. అతిశయించు, ఒప్పు.

మా. గ్గమ్మున సద్గుణ సముదాయ మ్మెసఁగఁగఁ జేసె సత్త్రి
యాగము నిష్ఠన్. ఆది. 4-8

(ఎసఁగఁగ-అని న. వ. ప్ర-కోశము-ఇది పాఠాంతరముగ సం. ము మొ-
వానిలోఁ గానరాదు.

**ఎసకము** దే. వి.

1. విజృంభణము.

క. ఆ సన్నిద్ధఘు సైన్యా, టోపసమేతముగఁ గవియుదును పాంచాల, క్ష్మాపాల సుతుఁడు భీముఁడు, నేపారిరి నీదుసేవ యొసకం బడఁ గన్. భీష్మ. 2-378

2. అతిశయము, పెంపు.

తే. ...ఎంతయు వంతఁజొందుఁ, జింత యొసకఁబు వడిగొని చిక్కు-వఱుప. విరా. 2-292; శాంతి. 1-66

3 అవలీల, అనాయాసము.

ఉ. శావలి వారిఁ దోలి యొసకంబున గోవులఁ బట్టికొంటినం,...వెడ మాటలేల ధరణీశ్వర. విరా. 4-192

4. విరమ.

ఆ అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముడై యేటు వాఱతెంచు నొసక మొనఁగ, నప్రమేయ శరము లడరించె నవి సత్వరముగ నేను ప్రతిహతములు సేసి ఉద్యో. 4-324

5. ఒప్పు.

క. ఈ దేశము ప్రజ ధర్మజా, నాదరసంభావనముల నాజ్ఞానిరతిన్, యాదవ వీరుల కలనాఁ, దేది తెఱఁగట్టి మనికి యొసకం బారున్ మౌస. 184

విణ.

1. అధికము, హెచ్చైనది.

క. స్వాతిగతుఁడగు శుక్రుం, డే తెఱఁగునఁ బరఁగఁజేయు నొసఁగు వర్షం, బా తెఱఁగున సాయక వర్షాతిశయం బావహించె నతఁడు

2. నిర్దేశము (చూపుటను) బలపఱచును.

క. నాచేతి బలువుగని నీ,యాచార్యుం డోడి తొలఁగి యరిగెను నీవే, త్రోచి యెదుట నోవువాఁడవు. ద్రోణ 4-9

ఏ[2] అవ్య.

1. ప్రశ్నార్థకము (ఇది సందర్భానుసారముగా ఆశ్చర్య ప్రశంసాదులను గూడఁ దెల్పును)

శా. ఈ దుర్యోధనుఁ డింత గర్వియగునే యీ యున్నవారెల్ల నా,చే దైన్యంబునఁ బొందు టొప్పదని చర్చింపఁడ, ఉద్యో 3-378

(ఇట ఆశ్చర్యమును దెలుపును)

వ. నాయాడిన మాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబు లంత యొప్పుసేయని యగ్గించిన ఉద్యో. 2-117; సభా. 1-7

(ఇట ప్రశంసను దెలుపును)

తే వారు కందమూలంబు లాహారంబులుగఁ, బొదలఁ బుట్టలఁ బడి యుండి పులుఁగు మెకము,ల యవ మేల్కొనుచుండిరే యక్కటకట.

(ఇట దుఃఖమును దెలుపును) ఉద్యో. 3-188

ఏ[3] సర్వ.

1. యచ్ఛబ్దార్థకము (ఇది తచ్ఛబ్దార్థము నపేక్షించును)

క. ...అచ్యుతుఁడే దిక్కునకునుండు నెమ్మినా దిక్కునకు జయము గల్గునని యరుగుఁడిత కరుణన్. శల్య. 2-341

క ఏ నరుఁడు మానసము ధృతిమాన నుచిత వృత్తినుండు నుదిలగొనక యొం,దైనను నెయ్యది యేనియు, వానికి దుర్లభములేదు వసుధాధీశా. శాంతి. 3-161; ద్రోణ. 2-161

2. కిమర్థకము (ప్రశ్నార్థకము)

మ. ఏ జనులు నిశ్చయముష్యులే చెప్పుమా. శాంతి. 1-225

వ. ఈ ప్రబంధమండలి కధినాథునిగా నే పురుషునిఁ జేర్కొను వాఁడనో. విరా. 1-8

ఉ. ...ఇప్పుడ కాలుప్రోలి కేఁగించెదఁ జక్కనైన నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా. ఆది 6-294

క. ...అంతకుపురి కేఁగించితిఁ బౌలోమ కాలకేయాసురులన్. అర. 4-86

(ఎక్కడ కోపఁగించుకొనిపోయినాఁడు - అని వ్యవహారము)

ఏఁగు దే. అ. క్రి.

1. పోవు, వెళ్లు.

క. కొలువుగొన నొల్లకుండుట, గలిగినఁ బొమ్మనుట యంతకంటెను మేలే, వలసినకడ కేగెద నీ, వలఁ పెయ్యాని యానతిమ్ము ధరణీనాథా. విరా. 2-224

క. ...ఇంకఁ విడియుం, జనపసి ద్రోపదికిఁ జెప్పి చయ్యన నేఁగెన్. విరా. 2-361

తే. ఊర్ధ్వగతి నేఁగు మానవు లుండునట్టి నెలవులు. అశ్వ. 1-132

2. నడచు

ఉ. ఇప్పటి థంగి నొక్కరుడు నేఁగను దానికి నోర్వ నెమ్మెయిన్, విరా. 1-148

3. ప్రవేశించు చొరఁబడు

ఆ. ...పెట్టు నతనిఁ జేరుయొద్దప, వానిఁ దలఁప నందు వరుఁడు పెట్టు, వాఁడ యుగుట నిక్కువం బి తనూదక, యిట్లు దివ్యవృత్తి నేఁగ దలఁచు. శాంతి. 1-138

ఏఁగుదెంచు దే. అ. క్రి. (√ఏఁగు)

1. వచ్చు, వతెంచు.

(ఇట 'తెంచు' ధాతువు వ్యతిరేకార్థకమును దెలుపును)

క. ...వేగంబున నమ్మెయ్యెడ నేఁగుదెంచి నారదుఁ, డదపడు టెంచుకయు లేక యిట్లను వాతోన్. ఉద్యో. 4-349

చ. కురుబల మేఁగుదెంచెనట గోవుల బట్టుఁ బట్ట. విరా. 4-10

6. క్రోధమును సూచించును.

క. ...ఏమేమీ నొంచెనె, యినుఁడు నినుం దత్ఫలంబు నిప్పడ కుడువం,గనియెడుఁగా కస్త్రానల,మునఁ బొదివెద నతని నని యెముని గోపమునన్. అను 3-259

ఏమొ; ఏమొకొ; ఏమొకో (√ఏమి)

ఊహను దెలుపును

క. వెడ తంత్రిపాలుం డనఁ, గడుహీనత విరటు పసులఁ గాచితి నొ నీ పుడమిగలదేమొ యను మా,నడి కోర్చితిగాక నీకు శౌర్యము గలదే. ఉద్యో. 4-201 (పాఠాం).

క. ఇట్టివి యెల్లను గనుఁగొను, కట్టిడితన మొందునట్లుగా నేమొకొ తొ,ల్పుట్టువునం జేసితి నీ,చుట్టల నిటు సూడకుండఁ జొప్పడ దయ్యెన్. స్త్రీ. 2-24

సీ. ... మోదమగ్గలమయి మీయందుఁ గానఁబడయెఁ - తే. గారణం బేమొకోయని గారవమున, నాతఁ డడిగిన. అను. 4-348

ఏమో (√ఏమి)

1. సందేహమును దెల్పును.

క. ...మీ,లో నభిమన్యుఁడు లేఁడే,మో నాకుం జెప్పఁడేల యూరక యుండెన్. ద్రోణ. 2-283

2. ఎందుచేతనో.

క సైనికులు నన్నుఁ గనుఁగొని, యాననములు వాంచి తొలఁగి యరిగెద రదియే,మో నేఁడు వేణువీణా,గాన స్వనములును వీటఁ గలుగవు కృష్ణా, ద్రోణ. 2-228

ఏయది ఏది (ఏ + అది)

క. ఏయది భవదీప్సితార్థ మెఱిఁగింపవనా. శాంతి. 3-315.

ఏయించు దే. స. క్రి.

1. బాణములచేఁ గొట్టించు.

వ. ...శిఖండింబురికొల్పికొని మీ తండ్రి నేయించుచు నతం డెన్ని విండ్లెత్తిన నన్నింటిం దోడ్తోన తునుమాడుచుండె. భీష్మ. 3-394

2. చంపించు

క. భూరిశ్రవుఁ డొక్కనితోఁ బోరంగ నేయించితి. శల్య. 2-326

ఏయు దే. స. క్రి.

1. (బాణాదులను) ప్రయోగించు.

సీ. సారథి నొచ్చిన తేరును గడపుచు, నేయుచుఁ గయ్యంబు నేయువారు. విరా. 3-170

2. (బాణములతో) కొట్టు.

క. నదవసరంబున నొక్కఁడ, బదియమ్ములు దొడి త్రిగర్తపతి వక్షంబున్, వదనంబు నేసి విరటుఁడు, మదమునఁ దురగముల నేసె మఱియుఁ బదింటన్. విరా. 3-188

ఏయూరికిఁబోవు దే. జాతి.

ఎక్కడకుఁబోవు, (కనఁబడకుండఁ బోవు, నశించిపోవు అని భావము)

ఉ. శూరుఁడ వంద్రుఁ గన్ మదువు నొచ్చుట శౌర్యము చొప్పె మాన మే, యూరికిఁబోయె. శల్య. 2-55

శ్లో. నతే దర్పో నరశ్రేష్ఠ న చ మానః క్వ తే గతః॥
సం. భా. శల్య. 32-20

ఏరి

ఎక్కడనున్నారు.

వ. ఇతండు ధర్మతనయుఁడ యేని భీమార్జున నకుల సహదేవులుం బాంచాలియు నేరి యని యడిగిన. (పాఠాం) విరా. 5-322

ఏరు దే. వి.

నొప్పి

క. తలయేరును నుక్కినయు నుదల కొనుదెంచెన్.
ఆది 3-191 అర. 7-270

ఏరునేల దే. వి.

రెండుకోసుల దూరము.

ఆ. ఏరు నేల కొలఁది నెడనెడ విడియుచు, బోవవలసియుండె భూమి
భార,వహుల దప్పి యెఱుఁగువాఁడగు నాధర్మ,నందనునకు ధరణి
నాథవద్య. ఆశ్వ. 3-158

శ్లో. గోరుతే గోరుతే చైవ వ్యవసత్పురు షర్షభః,
సా పురాభిముఖా రాజన్నువాహ మహతీ చమూః
కృ(చ్ఛాద్ధ్రివిణ భారార్తా హర్షయంతీ కురుద్వహాన్,
సం. భా. అశ్వ 65-21,22

(ఒకనాగటితో దున్నఁదగిన నేల-అని సూ.ఆ.ని)

ఏర్చికూర్చు దే. స. క్రి.

ఏటిఏటి ఒకచోటికి జేర్చు, వేఱుచేసి యొకచోఁ జేర్చు.

సీ. చందురు నునుఁగాంతి కందేర్చికూర్చి ఫాల్గునకుఁ దెచ్చిన యట్లు
గొమరు మిగిలి. విరా. 2-52

ఏర్చికొను దే. స. క్రి.

ఎన్నికొను, ఏఱి తీసికొను (కావలసిన దానిని)

ఆ. మనము పూఁచిపట్టి మొనలేర్చికొన పోవఁ, పాండురాజ సుతుల
బలము గవిసి, గాసి చేయు. భీష్మ. 3-5; ద్రోణ. 2-270

ఏర్చు[1] దే. స. క్రి.

1. మండఁజేయు.

ఉ. ...ఆతఁడుం, జిచ్చున నేయి వోసిన విశేషము దోపఁగఁ భీమునొంచి
ము,చ్చిచ్చును నేర్చునట్టులుగఁ జేసెఁ దదూర్జిత సేన.
భీష్మ. 2-277

2. దహించు, కాల్చు.

ఉ. ఖాండవ మేర్చె దేవతలు గానని యాశ్వరుఁ గాంచె. విరా. 1-85

క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చు కరణి నేఁడు భీష్ముఁ డేచిన కడి
మిం, బేర్చి మనసేనఁ బొదివె. భీష్మ. 3-277; విరా. 4-37

క. రయమున మ్రింగుడు గాలము,క్రియ నెవ్వఁడు కంఠబలము
క్రిందికిఁ జన క,గ్నియపోలె నేర్చుచుండును. ఆది. 2-90

3 ధ్వంసముచేయు, నాశనముచేయు.

తే. వినుము ప్రాగ్జ్యోతిపాధిశుఁ డనుపమాన, శక్తి యీ భగదత్తుండు సమరరంధుండు, గజమునెక్కి తా నేనికకయ్యమైన, నేర్చు నైరావణము మీఁది యింద్రుఁబోలి. ఉద్యో. 4-232

**ఏర్చు**2 దే. స. క్రి. (ఏఱు)

1. (కావలసిన దానిని) ఏఱు, ఎన్ను, నిర్ణయించు.

సీ. గోడిగ జాతిలోఁ గొదమపెంటుల నేర్చి, మావుల హత్తించు మార్దవంబు. విరా. 1—95

2. తీసికొను, కూర్చికొను.

క. అనుమాటకుఁ గాలానలుఁ,మును బోలెను మండి కయ్యమున కాయితమై, మొనలేర్చి వేగ యిచటికిఁ, జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్. ఉద్యో. 4-310

శ్లో. గృహాణ సర్వం కౌరవ్య రథాది భరతర్షభ.
సం భా. ఉద్యో. 179.48

3. (వ్యూహముగా) పన్ను, నిర్మించు, ఏర్పఱచు.

ఉ. అందఱు నింతకున్ వెనుకనై మొనలేర్చిచనంగ. విరా. 4-184

చ. ...భూ,వర భవదీయమైన బలవర్గము నొడ్డన మేర్ప వీఁకమైఁ, బుతికొల్పుపంగ నిర్భయతఁ బోరెడు నట్లుగఁ దాను ముందరై,తిరముగఁ జేయఁజాలు నొకధీరు నొనర్పుము సైన్యనాథుగన్.
శల్య. 1-75

తే. భీష్ముఁ డొడ్డన మేర్చిన బెడఁగు పొల, నొప్పెఁ గౌరవయోధుల యుబ్బు మెఱసె. భీష్మ. 3-11

5. వేఱుసేయు, తొలగించు.

సీ చందురు నునుఁగాంతి కందేర్చి కూర్చి బాగునకుఁ దెచ్చిన యట్లు గొమరు మిగిలి. విరా. 2-52

6. పొందు, చెందు.

వ, విను దుఃఖంబులఁ దెగద్రోఁచిన పురుషుఁడు సౌఖ్యసక్త చిత్తుఁడు.

గాకా,రిన వైరాగ్యము జెందిన, ననుపమమగు పరమపదము నమ్మెయి నేర్చున్. శాంతి. 4-105

**ఏర్పడు** దే. అ. క్రి.

1. తేటపడు, స్పష్టమగు.

ఉ. ....నీ, విట్టి తెఱంగు సేయుమని యేర్పడఁ జెప్పిన వాని కత్తఱిం, బుట్టిన సంతసంబుననువుం బరికించియు కాదె. విరా. 2-278

వ. అని యేర్పడం బలికిన. విరా. 2-159

క. జననుత కృష్ణ ద్వైపాయన ముని వృషభాభిహిత మహాభార దీయుక్తిమెయిన్. ఆది. 1-16

2. కంటికిఁ గనఁబడు.

ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యొక్కకాంత రూ, పెక్కుడు పెంపుసొంపు మనకేర్పడుచున్నది. విరా. 1-303

క. వడిఁబడియెఁ బిడుగు లుడుగక, వడఁకె మహీతలము పాంసువర్షము గురిసెం, గడునెఱ్ఱనయ్యె దిశ లే,ర్పడకుండె విమండు తిమిరపటలా వృతుఁడై. అర. 3-369

తే. ఊరు మూల మేర్పడఁగ నయ్యువిద వలువ, దొలఁగె ననిలంబు చేత విధూతమగుచు, నమరులెల్లఁ బరాఙ్ముఖులైరి దాని, సాభిలా షుఁడై చూచె మహాభిషుండు. ఆది. 4-122

3. తెలియు

క. ... కీచకుఁడు న,చ్చిన పిమ్మటఁ బుట్టినవ్విశేషము లెల్లన్, విను వేడుక మన మలరెడు, ననఘా యేర్పడఁగఁ జెప్పుమనుటయుఁ బ్రీతిన్, విరా. 2-362

సీ. అభిలాష మేర్పడు నట్లుండఁగా బల్కు, వేడ్కతో మఱుమాట వినఁగఁ దివురు. ఆది. 8-88

వ. ఆక్కేకశిని౦ జూచి యిక్కుమారు లిద్దఱు నా కొడుకునుం గూఁతు నుం బోలిన వీరి నెత్తికొని దుఃఖించితి నని తన్నేర్పడకుండం బలికి దాని కిట్లనియె, అర. 2-199

4. వాసన గొలుపు, పరిమళించు.

వ. దాని శరీర సౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు నేర్పడు నట్లుగాఁ బ్రసాదించిన నది గంధవతి యనియు యోజన గంధి యనియుఁ బరఁగి. ఆది. 3-41

5. ప్రకటితమగు, బయల్పడు.

క. అడరిపడి రథచతుశ్శతి, పొడిసేసి పరాక్రమం బపూర్వంబై యే, ర్పడఁ గరి హయ నర నికరము, బడలువడం దటిమె నలి నథశ్చరు లార్వన్. విరా, 3-174

వ ఇల్వలుండును మునివరు శక్తికి భయంపడి విషణ్ణుండయ్యును బ్రస న్నుండ పోలెఁ దన వంచన యేర్పడకుండఁ గృతప్రణాముండై తదాగమన ప్రయోజనం బడిగిన వానికి నగస్త్యుం డిట్లనియె. అర. 2-343

6. కలుగు సంభవించు.

చ, ...కౌతుక, స్ఫురణఁ గరంబు దత్కరముఁ బొంద నయంబునఁ జేర్చి వాక్య వి, స్తర చతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు నర్థితో. విరా. 1-209

వ. గర్భయోని యందు ఋతుపుష్పరస సంయుక్తం బగుచు రేతంబు గాడ్పుచేతం బ్రేరితం బయి కలసిన నందుఁ బంచతన్మాత్రలు పొడ వయి క్రమంబున నవయవంబు లేర్పడి లబ్ధజీవుండయి యుద్భవిల్లి ఆది. 8-221; శాంతి. 6-209

7. ఒప్పు.

క. రాజవాహనములగు, వారువముల నరయ నేర్తు వల నేర్పడఁగన్ విరా. 1-261

8. సందేహము తీఱు, అనుమానము తొలఁగు.

ఆ. అనిన నీ తలంచినట్లు కాదేర్పడ, వినుము నాదుపతులు వెరవులావు నలఘు విక్రమంబుఁ గలుగు గంధర్వు లేవురు నన్ను నొక్క మాత్రమైన. విరా. 1-328

9. వేఱుపడు, వేరుగాఁ గనఁబడు.

వ. కృష్ణ ద్వైపాయనుం డను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతం బులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి.
ఆది 1-30

10 ప్రతిబింబించు.

వ తన విమల విజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుఁగు చుండు
ఆది. 1-30

**ఏర్పడుదెంచు** దే. అ. క్రి. ఏర్పడు (ఏర్పడు + తెంచు, స్వార్థమున 'తెంచు')

1. స్పష్టపడు

సీ వెడవెడ నూఁగారి వింతయై యేర్పడు దేరని వళులలో నారు నిగుడ.
విరా 1-145; శా ని 1-248

2. కలుగు

వ. ...వసంత సమయంబు నఖిల జీవలోకానంద జననంబై యేర్పడు దెంచిన.
ఆ౦ 5—187

**ఏర్వరించు** దే. స. క్రి. (√ఏర్పడు) ఏర్పఱచు

1. నిరూపించు, నిర్ణయించు.

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటు మనము నడపఁదగుదని మెల్లను నేర్వరించి యందఱుఁ, దనతన మదినున్న తెఱఁగు తథ్యము చెపుడా.
విరా. 1-65

క. వినుమా భూతం బిట్టిది, యని కల రూపేర్వరింప నమరులకు వశం,బె నరేంద్ర శదాకృతిఁ, గనుఁ గొనినన్ భేదిల్లవలయుఁ గొండకునైనన్.
సౌప్తి 1-96

ఉ. ... బంధు సంఘము న్మలల నిందుఁదెత్తమొ విచార విదూర యుపేంద్రు భవ్యదే, హమ్మట గొంచుఁబోదమొ సమర్థ విధంబొకఁ డేర్వరింపుమా.
మౌ౦ 167

2 విభజించు, వేర్పఱచు

క. తను నేర్వరించి కేవలమును శాంతమునైన తత్త్వమును సంత

తముం,గనుచున్నఁ దన్ను నెఱుగం, గనఁజీఁకటిఁ బాపు వెలుఁగు గలుగుం బు|త్రా. అశ్వ. 1-224

3. వివరించి చెప్పు.

తే. విధివశంబున మృతిఁ బొందు వివిధజంతు, నిచయమం దనహంకార నిష్ఠఁ డైనఁ, బురుషుఁ గల్మషమేమియుఁ బొందనేర, దెట్టుల చేని వినుమది యేర్పరింతు. అను. 6-57

4. విమర్శించు, యోజించు,

మత్తకోకిల. ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పరించి యథా విధిన్, దేవమం|త్రియ పోలె ధర్మపుఁ దెల్పె. సభా. 2-236

5. ఎఱుఁగు, గుర్తుపట్టు.

సీ. నలువురు వేల్పులు నలుఁదొట్టి యప్పు డే,కాకారులై యున్న నందు నలుని, నేరర్పింపఁగ నేర కిం|ద్రాదులను నలు, వెఱుఁగు ను పాయ మింకెద్ది యొక్కొ. అర. 2-58

ఏర్పఱచు దే. స. |క్రి. ఏర్పరించు

1. విభజించు.

తే. క్షరము నక్షరమును ననఁ గలుగు రెంటి, నేర్పఱచి మున్ను సెప్పితి నింక నొకటి సెప్పఁ గలదు. శాంతి. 6-46

2. నిర్ణయించు, స్థిరపఱచు.

క. మొగమొప్పదు నాదెస నీ, జగతీనాథునకు నే విచారించియుసుం, దగ దీనికిఁ గారణ మిది, యగునని యేర్పఱుపనేరనయ్యెద నెట్లున్. విరా. 5-306

3. కనఁబఱచు, చూపు, తెలియఁబఱచు.

ఉ. ... అ,జ్ఞాననఁ బట్టితెచ్చి హృదయం బలరంగ ననంగతం|త వి,ద్యా నిపుణత్వమేర్పఱిచెదం |బ్రమదాంబుధి నోలలార్చెదన్. విరా. 2-298

4. చక్కఁబఱచు.

క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, నెడమడువై కలఁగినప్పు డేర్పఱుపఁగ

నేఁ, గడునేర్తుఁ బేర్చునాదగు, కడిమియు నీ సైన్యమునకు గానెన గాదే. ఉద్యో. 4-214

5 (వ్యూహము) పన్ను.

క. ... మొనలేర్పఱచెఁ గౌరవాన్వయముఖ్యా. భీష్మ, 2-26 (పాఠాం)

(ఏర్పఱిచె — అని పాఠము)

6. పంచు.

వ వారల జీవనంబునకుఁ గొన్ని యలంతి పల్లియలైనను దుర్యోధను నొడంబఱచి యేర్పఱచి తెఱంగు పఱచిన లెస్సయని చూచెదు. ఉద్యో. 2-91

ఏఱు² దే. స. క్రి.

1 మంచివిగాఁ జూచి గ్రహించు.

చ. వనిత మనోహరంబులగు వస్తువులెల్లను వేడ్కనేఱి పీ, కని నియమించి తెచ్చితి, విరా. 2-384

2. ప్రోవుసేయు.

వ. అక్కుసుమకోమలి సని యమ్ములేఱికొని వచ్చి యిచ్చుచుండు. అను. 3-255

3. (క్రింద నుండి గింజలు మున్నగు చిన్నచిన్న వస్తువులను)ఒక టొకటిగా ఎత్తు

గీ. తారు నలువురుఁ జని తృణధాన్య మల్ప, మేఱికొని వత్తురాఁకలి దీఱకుండు. అశ్వ. 4-220

సీ. ... కొంద ఱాకులెండినవి యేఱికొని అను. 5-28

4. (కావలసిన వానిని) ఎన్ను, ఎంచు, గ్రహించు.

తే. ఏఱికొను మీవు నొకని మూయేవురందు, వాఁడు నీతోడఁ దగఁ బోరువాఁడు వానిఁ, జంపి మహి యేలు వానిచేఁ జచ్చి త్రిదివ, సౌఖ్య మొందుము చేసితి సమయ మేను. శల్య. 2-108

వ. మన బలంబులలో మేలేఱి పదునాలుగు వేలేనుంగులును......

గై కొనుండు, ద్రోణ. 3-31

5. ఎంచి ఖండించు, నఱకు, ఛేదించు,

(ఈ యర్థమున 'తలలు' అను పదముతోఁగలసియే ప్రయోగములఁ గన్పట్టుచున్నది.)

సీ. ... అడియాస దొద్దకుఁ జొచ్చినఁ, దలలేఱి యుర్వికి బలియొసర్తు. మాస. 165

సీ .... మనమోపి సర్వ పాండవులకు జంపితిమేనిఁ బ్రచండ చక్ర, ధారఁ గౌరవకోటి తలలేఱి రాజ్యంబు గోవిందు డీకున్నె గొంతి కయిన. ద్రోణ 1-111

**ఏఱు$_2$ దే. వి. బొ.**

నది.

క. అనదతనంబును బెడిదపుఁ,దనమును లేకుండఁ బరఁగి దరియొత్తెడు, నేఱునుబోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురం గ్రమంబున నధిపా. శాంతి. 8-24; శాంతి. 4-356

**ఏఱుపఱుచు; ఏర్పఱుచు దే. స. క్రి.**

ఏర్పరించు. ఏర్పఱచు.

1. వేఱుసేయు, విభజించు.

తే. అర్జునుం డను పర్జన్య నస్త్రవృష్టిఁ, బల్లమును మిఱ్ఱునని యేఱు పఱుపరాక, యుండ నెత్తురువెల్లు లొండొండ పెరిఁగె, నుబ్బి భూతబేతాళంబు లోలలాడ. ద్రోణ. 3-103

2. కల్పించు, కూర్చు.

క. విను మా బీజము పిండము, తనువునఁ జైతన్యరూపతం బరఁగి శిరంబును గేలుఁ గాలు నుదరం,బు నురము వెన్ను నంగముల నేర్పఱుచున్. అశ్వ. 1-188

శ్లో॥ తతః స్పందయతేఽంగాని సగర్భశ్చేతనాన్వితః.

సం. భా అశ్వ. 18-8

నూ. తం చేతనావస్థితం వాయుర్విభజతి తేజ ఏనం పచతి ఆపః క్లేదయన్తి పృథివీ సంహన్తి ఆకాశం వివర్ధయతి, ఏవం వివర్ధితస్స యదా

హస్తపాద జిహ్వా ఘ్రాణ కర్ణ నితంబాదిభి రంగై రుపేత స్తదా శరీర మితి సంజ్ఞాం లభతే.

సుశ్రుతము – శారీరస్థానము – పంచమాధ్యాయము 2వ సూత్రము.

8. నియమించు.

సీ. అమరాధిపతి దొల్లి యాగంబుసేయంగఁ దొడఁగ మహాముని స్తోమములును, సురసంఘములుఁ గూడి కురుముఖ్య ఋత్విగ్గణ ములఁ నేర్పఱచి సొంపడర వేదిఁ గల్పించి. అశ్వ. 4-255

**ఏఱుపాటు** దే. వి.

విభజనము, స్పష్టపడుట.

వ. కాలు చేయి తల డొక్క యని యేఱుపాటు లేక వండం దఱిగిన యట్లున్న యొడలును. భీష్మ. 3-248

**ఏల[1]; ఏలా** దే. అవ్య. ఎందులకు

1. ఏకారణముచేత.

శా. ... నీవ పాండు సుతులం గుందింపఁగా సత్యముం, బాడిం దప్పఁ దొకప్పుడుం గినియరా బంధుత్వ మే లొల్లవో.

ఉద్యో. 3-384

క. ... మీ, లో నభిమన్యుఁడు లేఁ డే,మో నాకుం జెప్పఁ డేల యూరక యుండన్. ద్రోణ. 2-283

వ. వారలట యెవ్వలనికిం జని రేల మగిడిరి. స్త్రీ. 1-8

2. వలదు, కూడదు, అనావశ్యకము మున్నగు భావములను దెల్పును.

ఉ. కావలివారిఁ దోలి యెసకంబున గోవులఁ బట్టికొంటినం, చీవెడ మాట లేల ధరణీశ్వర యింతకు మున్ను విటికిం, బోవవు.

విరా. 4-192

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నాకొరులేల సద్భటా, కీర్ణ విరోధి సైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము. ఉద్యో. 2-295

క. జనములకు స్మృతిఁ జదువఁగ, విని మొక్కిన యంత్యజునకు విశ్రుత గతి గ,ల్గుననిన సద్భ క్తి జపిం,చిన యుత్తమ జాతిజునకుఁ

జెప్పఁగ వేలా, శాంతి. 4-258

3. ఏమి, ఏమిప్రయోజనము.

తే ఇంత ప్రొద్దేల యిచ్చోటి కేఁగుదేరఁ, గారణం బేమి యెవ్వరుఁ గానకుండు, నట్లుగాఁ జనుదెంచితె. విరా. 2-168

ఉ ... పతిసెప్పెడు వారల బుద్ధి నాఁడ మ,న్నింపఁడ యింక నేల యగు నీ వడియాసల ఎచ్చి రిత్తగా,రింపక సూనుము. ఉద్యో. 1-314

ఆ. నీచేతఁ, భంగపడితి మింకఁ బలుకు లేల. భీష్మ. 2-121

తే. ఎవ్వరికిఁగాఁగ రాజ్యంబు నెల్ల భోగ,ములును గోరుదు రక్కుమారులును నాదు, తమ్ములును లేరు తురగరథద్విపప్రహీన యయ్యె నీక్షోణియు నేల పెనఁగ. శల్య. 2-68

ఉ. ఈమునిపల్లె నుండు టిదియేల కరం బనురాగ మొప్పఁగాఁ, భామిని నాకు భార్యవయి...సౌఖ్యముల మేలుగ నందుము ఉద్యో. 4-58

4. ఎట్లు.

తే. కొయ్య, కోలఁద్రవ్విన మాత్రఁ బాతాళయాన, మేల సిద్ధింప నేర్చు. ఆశ్వ. 3-105

ఏల2 సం. వి.

ఏలకి, ఏలకుల తీఁగె.

మ. వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలా వనై లావలీ, లవలీలుంగ లవంగసంగతలతాలాస్యంబు రతించుచున్. ఆది. 2-30; సభా. 2-110

ఏలకో దే. అవ్య. (√ఏల)

ఎందులకో-

క. కురుసతికి జయముగోరెడు గురుపుత్రుఁడు మున్నయేలకో యిటు తలఁకిం జొరక. సౌ 1-207

వ. ఏడ్చుచున్నం జూచి యేలకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్న యది. అర. 2-145

**ఏలాపుత్రుఁడు** సం. వి. అ. పుం.

నాగరాజునకు తమ్ముఁడు.

వ. అనిన విని నాగరాజానుజుండైన యేలాపుత్రుం డిట్లనియె. ఆది. 2-133

**ఏలించు** దే. స. క్రి.

పరిపాలింపఁ జేయు.

క. గురుఁడును నీవును నద్రేశ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు సౌబ
లుఁడు ననున్,ధర యేలింపఁగనున్నా, రరు. ద్రోణ. 5-111

**ఏలిదము** దే. వి.

ఎల్లిదము.

ఉపేక్ష, నిరసనము.

క. బాలుఁడని నమ్మి రిపుతో,నే ఏధమునఁ గలసియునికి యిదికార్యమె ఆది. 6—116

శ్లో. బాలవత్కురుతే మూలం బాలః శత్రురుపేక్షితః,
గహనేఽగ్నిరి వోత్సృష్టః క్షిప్రం సంజాయతే మహాన్. ఆది. 1:8-103

**ఏలినది** (√ఏలు)

యజమానురాలు, ప్రభ్వి.

వ. ఇన్నాతిం దక్కటి యెలనాఁగ లేలినదానిఁబోలెఁ బొదవికొని
యున్నవారు, స్త్రీ. 2-185

**ఏలినవాఁడు** వి. (√ఏలు)

ప్రభువు.

వ. సుశర్మయు నేలినవాని పనిఁబూని. విరా. 8-131

**ఏలినాతఁడు** వి. (√ఏలు)

ఏలిక, రాజు.

ఉ. ...ఏలినా,తండొక చాయ చూపినను దత్పరతం బనిసేయు
టొప్పగున్. విరా. 1-185

**ఏలిమాట** దే. వి.

1. స్తుతి వాక్యము పొగడ్త.

సీ. పాలు పంపని యాక యేలిమాటల న,మ్మలుక దీర్చెదరు.
ఉద్యో. 3-6

చ. కురుపతి నిర్జితుండగుటకుం బవనాత్మజ యేను బూcట పో,టరితన
మెల్లc జూపుము కడంగుము నీవని యేలిమాటమై,నరవర ధర్మ
సూనుcడు వినన్ విజయం బొసcగెన్ మఱందికిన్.
శల్య. 2-129 (మేలుమాట అని పాఠాం)

ఏలు దే. స. క్రి.

1. (రాజ్యాదికము) పాలించు, శాసించు.

తే. ఏలు మీలోకమెల్ల నీకేల రాధకొడు కితcడను తక్కువ కొడుకుc
గుఱ్ఱ. ఉద్యో. 4-59

ఆ. ... జనులనేలc గాని యెన్నండును, నొరులc గొల్చి తిరుగ
వెరవులేని, యట్టి నీవు. విరా. 1-97

క. ...జగమె,ల్లను నేలcగcదగు సముజ్జ్వలత యూహింపన్.
విరా. 4-258

ఆ. దీని పాలు ద్రావి మానవుల్ పదియువే,లేండ్లు జరయు రుజయు
నెఱుcగ కమర, భావమున సుఖంబు జీవింతురశె దీని, నేలcగనిన
వాcడ యెందుc బెద్ద. (స్వామ్యమున నుంచుకొను) ఆది. 4-158

2. పరిగ్రహించు, చేకొను.

తే. ఆనితంబిని మక్కువ ననcగిపెనcగి, యింపు పొంపిరి వోవ నన్నేలి
కొనcగc, దలcచి పొందిన నది జన్మ ఫలముగాదె. విరా. 2-86
(ఏలు = భర్తగాc గైకొను)

క. అని హర్షోత్కర్షంబున, మనమలరcగc బల్కి మత్స్య మనుజాధీశుం,
డనిలసుతు నేలె. (ఏలు = సేవకునిగాc గైకొను) విరా. 1-227

క. ఉత్తమ కన్యాజనులకు, నృత్తము గఱపంగ నాకు నేర్పు గలదు
త,ద్వృత్తమునకు నన్నేలుము, చిత్తమునకు నెక్కcబనులు సేసెద
నందున్. (ఏలు = సేవకునిగాc గైకొను) విరా. 1-88

చ. మనమున నూఱడిల్లు మనుమానము మానుము నన్నునేలు మే,
పనులు నుదాత్తనాగరికభంగుల నీమది కెక్కునట్లు నేర్పుచు

భయభక్తులున్ మెఱయ రూపగఁజేసెద. విరా. 1-328

(ఏలు = సేవకురాలుగాఁ గైకొను)

3. సేవచేయించుకొను, పనిగొను

ఆ. ఏను గట్టువాలు దాన నాకెవ్వరు. గడుపు కూడు వెట్టి కట్టఁజీర, యిచ్చి సాకతమున నేలుదు రట్టివా,రలకుఁ బనులుసేసి మెఁగు బద్ధి. విరా. 1-298

4. పోషించు.

తే. భార్యయను దాను బుత్రుఁ బంచికొన్న, వాఁడు పసుఁబెక్కటి నేలువాఁడు కపట, కృత్యముల యిచ్చిమిని శిల్పకృతుల బ్రదుకు వారు, పంక్తిదూషకు లంద్రుడు పౌరవేంద్ర. అను. 3-175

## ఏలుకొను దే. స. క్రి. (√ఏలు)

లోఁబఱచుకొను, వశము సేసికొను.

తే. ఇట్లు నీ వొక్క తెవె నన్న నేలుకొంటి,గాక మాటలింకేటికిఁ గమల వగన. విరా. 2-385

## ఏలుతీపు దే. వి. (√ఏలు)

పాలింపవలయునను వేరాస.

వ. అవినీతులైన నీ కొడుకులు పుడమియెల్లను దార యేలుతీపుఁ జూచెరు. ఉద్యో. 2-279

## ఏలుదెంచు దే. స. క్రి.

జయించు, అణఁచు.

సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్ళుటికెడు వాలుగు నొగల నేలుదెంచి. విరా. 2-83

## ఏలొకొ, ఏలొకో, ఏలొకోన్, ఏలొక్కొ దే. అ. (√ఏల)

ఎందులకో.

క. నన్నేఱఁగి యెఱఁగి యిట్లనఁ, జన్నె నిజిహ్వ పెక్కు శకలములై పో,కున్నది యేలకొ. కర్ణ. 3-32

చ. ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీఁ లితాంగి యందు

నా, హృదయము దద్దయుం దవిలె. ఆది. 4-30

సీ. కరచరణాద్యంగకంబు లేలొకో రత్న, భూషణ ప్రకరంబు పొందు దొఱఁగె...ఏలొకొచనుదేవు... ఏలొకో తోడు రాదు... ఏలొకో పట్టరు. విరా. 1-186

తే. ఏలొకోయిప్పుడీ విప్రునింట నార్తరవము వీతెంచె ఆది. 6-289

తే. విభుఁడ వజ్జనుల కిట్టు, లేలొకో నన్న చరితంబు లెన్న నీకు. కర్ణ. 2-111

మ. ...ఇతం డేలొక్కొ యత్యంతనిష్ఠుర శౌర్యోన్నతి నిన్నుఁ దాఁకఁ దలఁపం జోద్యంబు. ద్రోణ. 3-185

**ఏవగించు** దే. అ. క్రి.

రోఁతపడు, అసహ్యపడు.

తే. చందనార్ద్రీ కుట్టిమములఁ జరణతలము, లొందుటకు నేవగించు నయ్యువిద లిపుడు, నెత్తురుల తేవ మెక్కిన నేల బొరలుచున్న వారేమి సెప్పుదు నుడుకు పేర్మి స్త్రీ. 2-50; శాంతి. 1-363

గీ. కూడి లోనఁ దునిసిపడి యున్న క్రేవ్ వుచ్చి తోయజాతు, యేవ గింపక యుచ్ఛిష్ట మిష్ట లీలఁ, దగిలి కుడుచుచున్నంత తత్తరుఁడిఁ జూచి. ఆది. 7-256

2. రోషపడు

సీ. అయ్యలఘు భుజుఁడు, ద్రోణ భీష్ములు తనతోఁబాటి యను పలుకున కోర్వఁ డచ్యుతార్జునులు తనకు, నెక్కుడు నా విన్న నేవగించుచునుండు. కర్ణ. 2-318

3. తిరస్కరించు, త్రోసివైచు.

మత్తకోకిలము :— ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పరించి యథా విధిన్, దేవ మంత్రియపోలె ధర్మపుఁ దెల్పె నీతని బుద్ధి మీ, రేవ గింపక చేకొనుండు. సభా. 2-286

**ఏవపడు** దే. అ. క్రి.

రోతఁచెందు, అసహ్యించు.

ఆ. కిల్బిషంబు గోశకృన్మూత్రములకేవ,పడుట. అను. 3-32

క. నీవు బతిమాలి కొడుకుల, చావునకును జేటునకును జాలక యిమ్మై,
వావిడిచి యఱచినం గడు, నేవపడరె జనులు నిన్ను నేమననేర్తున్.
ఉద్యో. 2-316

**ఏవము** వి.

జుగుప్స, రోఁత.

చ. అధిపు మఱంది సింహబలుఁ డప్పకు మ్రొక్కఁగ వచ్చి...మాన
ధన విహీనతం జెనకినం గడునేవము పుట్టి యయ్యెడన్.
విరా. 2-170

విశ.

1. నీచమైనది, నికృష్టమైనది.

చ. ... పేరు కంకుఁ డే,వపుఁగొలువైన వాకు నిలువన్ మదిగొల్పదు.
విరా. 1-197

2. రోఁత గలిగించునది, అసహ్యమైనది.

క. నాయున్న కాము దలఁపవ, యీ యొడలి చీర యిట్టి యేవపుఁ
జందం, బోయన్న మదన నిష్కృతిం, జేయుననుట యెంతయును
నిషిద్ధము కాదే. విరా. 2-49; విరా 8-50

తే. ప్రయతులై పుట్టి యేనంపుఁ బనులఁ గడువుఁ, బ్రోచికొను
వా రహంకారమునకు గర్వ, మాన మద దంభనులఁ దొల్లి
మాన్యజనులఁ, బరిభవించిన తుచ్ఛులు పడ్మనయన. అను. 5-106

**ఏవల** దే. వి. క్రి. అవ్య. ఎవ్వల (ఏ + వలను)

ఏప్రక్క, ఏవైపు.

క. ... మీరలందఱు, నేవలఁ జూచిన శిఖండికెదురుం డెవుడున్.
భీష్మ. 1-81

**ఏవాఁడు** దే. సర్వ.

ఎవ్వఁడు.

క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన, నావసుధాధిపుఁడు దాని నను మోదించున్. శాంతి. 4-341

**ఏవురు** దే. సర్వ. ఏగురు

అయిదుగురు.

క. మనమొక యేవుర మీ యం,నయుం దో నరుగు దేరఁగా
నెయ్యెడ బో యిన నెఱుఁగ కుండుదురె విరా. 1-59

**ఏష్ట** సం. వి. ఋ. పుం.

యజ్ఞమునందలి యొకానొక ఋత్విక్కు స్థానము.

వ ... వగల పుత్రి శిష్య గణంబులు క్రమంబున మైత్రావరు
ణు గను...ప్రతిస్థాతయు, నేష్టయు, మన్నేతయు, సుబ్రహ్మ
ణ్యుండునుగా. సభా. 1-292

**ఏసి** దే. అవ్య.

1. వ. గను.

తే. అందు మూఁడేసి ఋతువుల కయన నామం బగు.
శాంతి. 5-41; ద్రోణ. 3-78

2. పరిమాణమును దెలుపును.

మ. తలఁపం గూడునె యింతలేసి దొర లీరైన్యంబు చుట్టంబులుం,
జెలులుం దిట్టరె ఉద్యో. 3-95

# ఐ

ఐ

ఒకానొక యక్షరము.

(తత్సమేతర పదముల యందుఁ బెక్కు తావుల 'ఐ' కారము 'అయి'
గాను 'అయి' 'ఐ' గాను వికల్పముగా మాఱును.)

ఐదు — విరా. 2-27; అయిదు-ఉద్యో. 1-877

కై కొను - విరా. 1-114; కయికొను - విరా. 2-12

పై చీర - విరా. 1-211; పయిచీర. శల్య- 2-374

ఐ అవ్య. అయి.

1 అగుధాతువు యొక్క క్త్వార్థకరూపము.

క. నిర్భర విధ్వంస దశా, విర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే. విరా 1-322

వ అర్జునుండును భీతుండై. విరా. 5-96

వ. క్రోధాయత్తచిత్తులై యున్నం గనుంగొని ఉద్యో. 4-202

2 చతుర్థీ విభక్త్యర్థమునలగు, 'కి', 'కు'-లు చివరగల పదములకు అను ప్రయుక్తమగును. (సూ. ఆ. ని)

గీ. నేను వారలందఱును మఱచునట్లు సేయుదు నరునకునై కుమార.
(నరునకునై = నరుని నిమిత్తము.) ద్రోణ. 6-260

ఆ ధాత నిన్న నేమి ధర్మంబు నడపుట,కై సృజించె దాని నాచరించి, యుండు నీవు నీకయొుపయుండవే ధాన్యనోదిత ప్రవర్తనుండవు గాక. (నడపుటకై = నడపు నిమిత్తము) శాంతి, 1-209

విరాటునకు పిల్వఁబంచె నర్తనమునకై. విరా. 1-248

ఆతనికై వగపేటికి స్త్రీ. 2-85

ఉత్తమగతికై తార చనుదేర విశసించుచు శాంతి. 1-241

3. తనంతట తాను. స్వయముగా

క. దుష్పరవశు నిను గర్కటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై, నిర్భర విధ్వంసదశా,విర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే. విరా. 1-322
(నాకై = నాయంతట నేను-స్వయముగా)

క. నేనై మేల్కొను నంతకు, భూనాయకవర్య నన్ను బోధింపకుడీ.
(నేనై = నాయంతట నేను) అను. 2-301

ఐందవము సం. విణ. (అ. ఈ. అ.)

చంద్రునకు సంబంధించినది.

ఉ. గుమ్మడిపువ్వుఁ దేనియయుఁ గూపము నైందవరేఖ కాంతియుం,
బ మ్మరయంగఁ గరమ్మెఫల శోభన సంపద. కాంతి. 5-128

**ఐందవాతపము** సం. వి. అ. పుం.

చంద్రుని కాంతి.

సీ. ... పరమ ధర్మ — అ – మన్న రేంద్రునందు వా పూర్ణతర శర,
దైంద వాతపఁబునందుఁ బ్రీతి, సమమకా సమస్త జనుల చిత్తంబు
లా,నంద రసభరంబు నొందఁ దాల్చె. ఆది. 8-82

**ఐంద్రము** సం. విణ. (అ. ఈ. అ.)

ఇంద్రునకు సంబంధించినది.

వ. నివాత కవచు లనియెడు దైతేయుల మాతవి సారథికంబగు
నైంద్రస్యందనం బెక్కి యొక్కండన మూఁడు కోట్ల నిర్జించితి.
విరా. 4-149

వి. అ. పుం.

జ్యేష్ఠానక్షత్రము

సీ. ... ఐంద్ర, మనఁ బ్రభుత్వము పెంపు. అను. 8-169

**ఐంద్రాస్త్రము** సం. వి. అ. న.

ఇంద్రుఁడు అధిదేవతగాఁగల యస్త్రము.

(అర్జునుఁడు) ఐంద్రాస్త్రంబు ప్రయోగించిన నది నానాప్రకార
క్రూర శరకలాప రూపంబునం గవిసి కౌరవసైన్యంబు నొప్పింప.
భీష్మ. 2-164

**ఐకాక** దే. అవ్య.

అయినాక, అగుట చేతఁగాని (లేకపోయినచో అని భావము)

మ. భవదాజ్ఞా దృఢ బంధ సంయమితకుంభద్వేగమై కాక నాఁ డవలీ
లన్ మనయర్జునద్విపము కౌరవ్యాంబుజ శ్రేణిఁ జిక్కువడం
జేయదె. విరా. 1-56

**ఐక్యము** సం. వి. అ. న.

ఏకమగుట, ఒక్కటి యగుట.

చ. ...నేఁ, బరువడి, దెల్పి మైక్యపరిభావ నిరూఢముగాఁగఁ జేసి

నన్ కల్కి. 2-345

తే. ఏన నీవను నైక్యంబు తెలుకవోడముఁ, గాత గమనాగమనములు
గ్రాఁగిపోవ. శాంతి. 4-248; శాంతి 5-110

**ఐతిహాసికుఁడు** సం. వి. అ. పుం.

ఇతిహాసము (పూర్వచరిత్రము) తెలిసినవాఁడు.

సీ. ఐతిహాసికు లితిహాస మనియు. ఆది. 1-81

**ఐదు** దే. సర్వ. ఔ.

1. అయిదు. నాలుగును ఒకటియును గలసిన సంఖ్య.

తే. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి
కరువు గట్టి, పోసి చేసి చైతన్య సంపుటము దిగ ఘుటించిరో
కాక యిట్టి. చేడియలు గలరె. విరా. 2-27

క. సూతుఁ బదింటను నైదిట, నాతని యంగంబు నొంచి.
విరా. 5-77

2. 'యే యజామహే'-అను నైదక్షరములు గల మంత్రము.

గీ నాలుగింటను రెండియు నాలుగింట, రెంట నైదింట మఱియును
రెంట వేల్చి, యజ్ఞశీలు రారాధించునట్టి విష్ణుఁ, డిష్టదాయి ప్రస
న్నుఁడయ్యెడును నాకు. శాంతి. 4-222

వివరమునకై చూ-నాలుగు

3. కామము, క్రోధము, భయము, నిద్ర, లోభము.

తే. అనఘ విను కామమును గ్రోధమును భయంబు, నిద్రయును
లోభమును జాల నిందితములు, యోగిజనులకుఁ గావున నుడుగ
వలయు, వీని నైదింటి నచలావధాన వృత్తి. శాంతి. 5-116

4. జ్ఞానేంద్రియములు. 1) శ్రోత్రము (చెవి) 2) త్వక్కు (చర్మము)
3) చక్షువు (కన్ను) 4. జిహ్వ (నాలుక) 5. ఘ్రాణము (ముక్కు).

తే. ఇంద్రియములతో నొక్కటి యేనిఁ బట్టు, వదక వెడలిన నాగంటిఁ
బ్రజ్ఞ గాఱు. నట్లు గావున మనసు మున్నాఁగి వినికి, యాదియగు
నైదుఁ గ్రమమున నాఁగవలయు, శాంతి. 5-119

ఐన విశ.

అనుధాతువు యొక్క భూతార్థక విశేషణము. అయిన.

వ. నిశ్శంకంబైన యంతఃకరణంబుతోడ. విరా. 1-173

వ. జీర్ణంబులైన వస్త్రంబులు విడిచి. భీష్మ. 1-196

ఆ. ఉచితమైన పాలు, పంచియిండు. ఉద్యో. 2-25

అవ్య. ప్రదు.

అగుధాతువు యొక్క చేదర్థక రూపము.

1. అయిన యెడల.

తే. ...అద్దేవి యెదురుచూచు, అలుగుఁదడవైన మగుడఁ బోనలయు ననివ. విరా. 2-120

సీ ...చక్కటితోడి కయ్యమైన, లీల మిమ్మందఱ నేల పాలుగఁ జేయవే. శల్య 2-325

2. అయినప్పటికని

తే. ...భవదీయ దేహమునకు, నింత వెలయన వచ్చునే యేరికైన. అను. 2-275

వ. తీరునకుం జొచ్చియున్నవారి నైనం గాచికొననోపు యని యూహించుచు. ద్రోణ. 4-156

క. తానైన నపుడు వక్రుం,డై నీతిపథంబు విడిచె నక్కట పతి మమ్మైనను జక్కని తెరువునఁ, బూని నడపుడనుచు నిపుడు బుద్ధులు సెప్పెన్. ఉద్యో. 1-311

(తానైన = తాను మాత్రము) (మమ్మైనను = మమ్ముమాత్రము.)

3. కాని, ఏని (వికల్పమును దెలుపున.)

ఉ. ... జనంబు లిట్టియం,దక్కట భీముఁడైన మన యర్జునుఁడైనను మాద్రి పుత్రులం, దొక్కరుఁడైన నీ పగఱ నుక్కడగింపరె యొక్క ప్రేల్మిడిన్. ఉద్యో. 1-287

ఆ. పరమ కరుణనైన బంధు భావంబున, నైన భుజబలంబు నతిశయమున, నైన నెల్లభంగి నర్జును రక్షింపఁ బోవఁదగు మహానుభావ

నీకు. ద్రోణ. 3-286

తే. అన్నమున దుగ్ధమునఁ బండ్లనైన మూలకోటిపైనను దగు
పారు నీటనైన, నిత్యమును జేయునది పితృకృత్య మోపి, వైశ్వ
దేవ మవశ్య నిర్వాహ్య మనఘ. అను. 3-337

(ఇచ్చట పూర్వపూర్వమునకు ప్రాధాన్యము గల వికల్పము.)

4 పూర్వోత్తర కార్యములకుఁ గల విరుద్ధ భావమును దెలుపును.

ఉ వారు మహాబలుల్ మఱియు వారికిఁ బ్రాపు గలండు వారలం
బోర జయింప రామియు సమృద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
ఖ్యారమణుండు సేయు నగు మన్ననలెల్లఁ దలంచి చూచినన్
భూరి వివేకియే విడిచిపోవుట ధర్మమె వీరధర్మమే. భీష్మ. 3 446

క. తనుఁ దాన చెప్పికొనఁ డొ, కృపుఁ డపియగు నైనఁ బెంద్రి పరిభవ
మునకుం గనలు గదిరి యెల్లండిని, వినుమేనేమనిన నేమి వృథవో
దధిపా ద్రోణ. 5 340

వ. ఇట్టి సంబంధ మెవ్వరికిఁ బడయనగు.

క. విను మైనను సాపత్న్యం,బను దోషము గలదు
ఆది 4-183; 189

5. ఆధిక్యమును దెలుపును.

క ఒక్కటి సురపతికైనను, బ్రక్కమ్మ నృపధర్మమూఁది మొన
తలఁ బడినన్, మిక్కిలి పేరను నిట దివి, నక్కజముగఁ బెంపుఁ
బడయనగుట నుపేంద్రా. ఉద్యో. 3-360

క. గురు పుత్రుఁడు తేజోనిధి, సురాసురులకైనఁ దేఱిచూడన రిది.
విరా. 5-3

6. హైన్యమును దెల్పును.

ఆ. మత్స్యజనపాలపుత్ర యేనట్టిదైనఁ బనుతునయ్య నిన్ను
విరా. 4-111

7. నిర్ధారణము లేమిని దెల్పును. (ఈ యర్థమున 'ఏ', ఎవఁడు ఎవరె)
మొదలగు వానితో సంబంధించి యుండును.

ఉ. నేఁడు పోరికిం, గవ్వడి రాకయుండఁ దొలఁగం గొని పోవఁగ

జాలు వారి నీ, వెవ్వరి నైనఁ బంపుము. ద్రోణ. 1-391

క. తాన సుతుఁడగుట తెలియం, గానగు మును లాత్మ వీర్యకలనం
బెచ్చో, నైనం జేయఁగ ముని భా, వానూనత ఋశ్యశృంగుఁ డా
దిగఁ గమటన్. శాంతి. 5-505

**ఐరావణము** సం. వి. అ. పుం.

ఐరావతము ఇంద్రుని యేనుఁగు.

ఉ. ... ఐ, రావణ దంతి నెక్కి యమరావతికిం జని యింద్రుఁ డా
శచీ దేవియుఁ దాను మోదమునఁ దేలె. ఉద్యో 1-205

**ఐరావతము** సం. వి. అ. పుం.

1. ఐరావణము, ఇంద్రుని యేనుఁగు.

వ. ఇంద్రుం డైరావతారూఢుం డై లీలం ద్రైలోక్యంబును జరించు
చుండె. శాంతి. 4-422

2 దిగ్గజము, తూర్పు దిక్కున నుండు ఏనుఁగు.

వ. ఐరావత సుప్రతీకంబు లను దిగ్గజంబు లయ్యగ్నిభవుమీఁదం
బఱతెంచిన. అర. 5-207

**ఐరావతవర్షము** సం. వి. అ. పుం. న.

ఉత్తర సముద్రమునకు శృంగ వంతంబునకు మధ్యగల భూభాగము.

వ ఉత్తర సముద్రంబు శృంగవంతంబు మధ్యమం బైరావత వర్షం
బన నొప్పు. భీష్మ 1-25

**ఐరావతుఁడు** సం. వి. అ. పుం.

1. తక్షకుని కొడుకును బెంచినవాఁడు, తక్షకుని తమ్ముఁడు.

వ అట్టి యెడఁ దక్షకు నపత్యంబై తత్సోదరుండగు నైరావతుండు
పెనిచి యుపలాలింప నుల్లసిల్లిన యశ్వసేనాభిధానుండగు నాగ
కుమారుండు. కర్ణ. 3-316

2. నాగరాజు.

వ. కుండలంబులు గొనిపోయిన భుజంగం బైరావతాపత్యం బనిన
విని యమ్మునిశిష్యుండు. అశ్వ. 3-106

**ఐరావతి** సం. వి. ఈ. స్త్రీ.

ఒక నది, పంజాబు నందలి రావి యనునది (సూ. ఆ. ని.)

సీ. కాళింది నర్మద ... పెన్న యైరావతి యనఁగ బ్రసిద్ధంబు లయిన నదులు. సభా. 1-71

**ఐలుఁడు** సం. వి. అ. పుం.

పురూరవుఁడు, వైవస్వత మనువు కూఁతురైన ఇలకును చంద్రపుత్రుఁడైన బుధునకును బుట్టిన వాఁడు.

ఇతని కార్గురు కొడుకులు గలరు. ఇతని వంశీయులు 'ఐలులు' అని పిలువఁబడిరి.

వ తొల్లి యైలుండను పురూరవుండు వసుధ విప్ర క్షత్రియులం దెవ్వాని ధనంబై యుండునని వాయుదేవు నడిగిన శాంతి. 2-302

**ఐలులు** సం. వి. బహు.

కౌరవులు, పాండవులు (ఇలా పుత్రుఁడైన పురూరవుని వంశమువారు. చూ ఐలుఁడు.)

క. వీ రైలులుఁ బౌరవులును, భారతులును గౌరవులును బాండవులు ననన్, వీరులయి పరఁగిరి ఆది 4-118

**ఐశ్వర్యము** సం. వి. అ. న.

1. సంపద.

తే. ఆయురైశ్వర్య కీర్తుల నపహరించు, పరసతీ సంగమము.

విరా. 2-69; శాంతి. 5-404

2. ప్రతిష్ఠ.

మ. కురు సైన్యంబుల ముట్టి గెల్చి యొలమిన్ గోవర్గముం దెచ్చెను. త్తరు బాహాబల శౌర్య సారము లుదాత్తంబుల్ గదే యొందు నెవ్వరు నెక్కాలము నిట్లు సేసిరె కులైశ్వర్యం బవార్యంబుగన్. విరా 5-247

3. శక్తి, సామర్థ్యము, పరాక్రమము.

మ ... చటులాస్మదీయ విశిఖాగ్ని జ్వాలలం దాహుతుల్, వరుసం

బెట్టుదు ధార్తరాష్ట్రతతి నైశ్వర్యం బవార్యంబుగన్.
ఉద్యో. 2-301

**ఐషికము** సం. వి. అ. న.

సంస్కృత భారతము నందలి సౌప్తిక పర్వమందలి అవాంతర పర్వము.

వ. సౌప్తిక పర్వం, బైషీకంబు - అను శతపర్వంబులు గలిగి.
ఆది. 1-32

**ఐహికము** సం. విణ. (అ. ఈ. అ.)

ఇహలోక సంబంధమైనది.

వ. ఎయ్యది యాచరించి పురుషుం డైహికాముష్మిక సుఖంబులం బొందు. శాంతి 3-42

# ఒ

ఒ అవ్య. ఓ.

1. ప్రశ్నార్థకము.

చ. (అశ్వత్థామ దుర్యోధనునితో) ... హరికల్మి సారథికి దోర్బలన
లీల నడఁగిపోరె, యచ్చలమొ ఫలంబొ యింకయిన సంధి యొ
ర్చుట మేలు వారితోన్. కర్ణ. 8-260

క. ఏవనకును నీకును బాంధవము గలదొ యతఁడు నిన్ను దయ
రక్షింపన్, సవినయ వృత్తిని బ్రతికితో, చెవులకు నింపెసఁగ నిజము
సెప్పుము నాకున్. శాంతి. 3-384

ఉ. సందియమేల సర్వగుణ సంపదఁ జూడఁగ బాహుకుండు, భూవం
దితుఁడైన నైషధుఁ డవశ్యముఁ దానగు నా మనంబు వానందముఁ
బొందుచున్నది ఘనంబుగ వాఁడిట వచ్చువాఁడొ యే నందులకేగు
దాననొ రయంబున నాతని నిశ్చయింపఁగన్.
అర. 2-20?; అర. 2-98

2 సందేహమును దెలుపును.

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచిన పద్మహితుఁడో హిమకరుఁడో శచీ, గృహమేధియొ కాక యితఁడు కేవల నరుఁడే విరా. 1-215

క తఁతండు శాలిహోత్రుఁడో, మాతలియో నలుఁడో యొరులు మానవులు జవో, పేతముగ విట్లు రథహాయ, నీతి యెఱుంగుదురె ధారుణీవలయమున్, అర. 2-171

3. సంభావన (ఊహ)ను దెలుపుము

క. నిమిషాంతరమున నిట్లు, శ్రమమున మర్త్యులకు నేఁ... సమకూరునె యుత్తముఁ డీతఁడు బ్రాహ్మణ రూపమున సురేశ్వరుఁడో హరుఁడో భానుఁడో గుహుఁడో. ఆది ?-164

4. ఆశ్చర్యమును దెలుపును.

క. తలఁకక మును సౌగంధిక, ములు గొని యిప్పుడును దర్పమున నిందుల పుష్పలుగొని మణిమత్ప్రభృతులఁ, బలువుర వధియించె నెట్టి బలియుఁడో యనుచున్. అర. 4-25

5. నిశ్చయమును దెల్పును.

ఉ. ... లఘుసారు లధీరు లసాహసుల్ నిరుత్సాహులు ద్రోహులై యెదిరి చత్తురో మందురో మానవేశ్వరా. ఆది. 8-48

(చత్తురు = చచ్చెదరు)

6. అనాదరమును దెలుపును.

ఆ. వరదుఁడైన యీశు వరమున నిది యొక్క, వదరు పుట్టె నెట్టి వరమొ యనుచు, దానిఁ బాలువైవఁ గానున్న నాశాశ, వాణి యిట్టు లనియె వసుమతీశ. అర ?-5

7. కాక్వర్థకము.

ఉ. ... లఘుసారు లధీరు లసాహసుల్ నిరుత్సాహులు ద్రోహులై యెదిరి చత్తురో మందురో మానవేశ్వరా. ఆది. 8-46

(మందురో = మనరు-బ్రదుకరు అని యర్థము)

**ఒంటమి** దే. వి. (√ఒంటు)

పగ, వైరము.

క. ఒంటమిని లేని యొంటర, మింటరములు పలుకుటుచితమే యర్థ రథుండ,టి నను నేమి తక్కువ, గంటి చెపుము దీని నీవు గన్నది గలదే. ఉద్యో 4-287

శ్లో॥ పితామహా యథేష్టం మామ్ వాక్యైరుపకృంతసి, అనాగసం సదా ద్వేషా దేవమేవ పదేపదే. సం భా. ఉద్యో. 167-11

**ఒంటరమింటరములు** దే. వి. బ.

ఎక్కువ తక్కువ మాటలు, పరుషవచనములు.

చూ. ఒంటమి. ఉద్యో. 4-287

**ఒంటి** దే. విశే. (√ఒండు)

ఒంటరి, తోడులేనివాఁడు, ఏకాకి.

చ. అసమున మీఁదెఱుంగక మహోగ్రగహ వృత్తిఁ గడంగి చెచ్చెరం, బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరపసేన యేడ యొంటి సనుటయేడ. విరా. 5-284

చ. ఇది గడు ముద్దరాలు పనులేమియుఁ జేయఁగ నేర దెంతయున్, మృదు వొక కీడుపాటునకు మేకొనఁజాల దుదాత్తచిత్త యొంటి దిరుగు దాని కోర్వదు, విరా. 1-103

**వి.**

ఏకాకిత్వము, ఒంటరితనము, తోడులేమి.

క. ఒంటి మెయిఁ దాఁక నా ముక్కంటికి వశమగునె కృష్ణ గాండీవుల కర్ణ. 2-85

వ ఎల్లవారిం గలయంగనుంగొని క్రమంబున నొంటిమెయిఁ జనుదెందని నియోగించి యతండు. విరా, 1-184

**ఒంటికంబము** వి.

అవిద్యా రూపమైన స్తంభము, అవిద్య యొక్క ఆధారము చేతనే శరీరము నిల్పుటచేత అవిద్య శరీరమను ఇంటికి ఒక్కటే స్తంభముగాఁ జెప్పఁబడినది.

క. ఏను వేదు అగుడు వాని నివ్వేదులు, పట్టఁ జదురుగలదె క్రాంతి దొలఁగి, యొంటికంబ మొప్పు నింటి వాకిళులు దొ,మ్మిదియు నెఱయ మూసి నిదురవోదు. శాంతి. 4-17

**ఒంటికిఁజూచు** దే. అ. క్రి.

వేఱొక విధమునకుఁ బూనుకొను.

క ఏచి చలంబున నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ జూడం గార్యం, బేచందమునం దెలఁగగు, నా చాలుట కోర్వవలయు నది యట్లుం డెన్. విరా. 3-110

**ఒంటివడు** దే. అ. క్రి. (√ఒండు)

ఏకాకియగు, సహాయము లేనివాఁడగు.

తే. ... అభిమన్యు వీరుని నతని ఁ ఁ ఁ, గుఱ్ఱలను గర్ణు నాఱడిఁ గోలు వోయి, యొంటి వడితి మనియుఁ గడు నుమ్మలంపు మాట లాడుదు ర్వురిజనుల్ మఱుఁగు చుండ. ఆశ్ర. 2-15

**ఒండను** దే. స. క్రి. (√ఒండు)

1. నిందించు.

ఉ. పాండవ పక్షపాతమునఁ బల్కెదు నోరికి వచ్చినట్లు ని,న్నొండన రామిఁజేసి యిది యొప్పునె విరా 4-98

2, వేఱు మాట పలుకు.

చ. .... మనం, బనవరతానురాగముగ నంగజకేళి భజింపు మింక నొం,డని యెడ నేసితేని కుసుమాస్త్రిఁడు సైపఁడు నన్నుఁ బావకా. అర. 5-201

**ఒండు** సర్వ. జా. (బహు) ఒండులు, ఒండ్లు

1. ఇతరుఁడు (ఈ మహదర్థమున బహువచనమునందే ప్రయోగములు గన్పించుచున్నవి.)

చ. విరటుఁడు దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాతికై, పురిఁగల వారివెల్లఁగొని పోయిన నొండులు లేమిఁజేసె యు,త్తరుఁ డిట వచ్చు చుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం, దొరకొనకున్న దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడగన్. విరా. 4-77

చ. ... తగ నొండులం గొలువఁగా వెర వెమ్మెయిఁగల్గు నక్కటా.
విరా. 1–108

వ. ఇట్లు సృజియించి యవ్విరించి యతని (దక్షుని) నాలోకించి ప్రజల సృజియింపుమని పంచిన నతండు పెద్దవా రొండ్లు లేరై రేనియు సృజియించెద ననిన నప్పరమేష్ఠి...పెద్ద లెవ్వరునులేరు సృజియింతువు గాక యనవుడు. సౌప్తి. 2-112; ఉద్యో. 1-278

2. ఇతరము, అన్యము.

ఉ. (కర్ణుఁడు కుంతితో) నీ పలు కెంతవోలినను నిర్ణయమిట్టిద ...ని యొండులే దీపనిమీఁది భారనంబున నీవిట వచ్చితిగాన పాండవుల్, నేపడిరేనిఁ జంప నఱసేయక చెప్పెద సవ్యసాచిపైఁ, గోపము పెద్ద వాఁడు సమకూరిన బిట్టుఱఁ జంపుదుఁ జుమీ, ఉద్యో. 4-68

క. యోగంబుఁ దపంబుఁ బరి, త్యాగంబును గాక యొండులగునె హితంబుల్, రాగము సరి దుఃఖంబును, త్యాగముఁ బోలెడి సుఖంబు నరయంగ లవే. శాంతి. 5-886

తే. ... సంశయిత సంవేదనంబు, మనసు కృత్యంబ యికార్యము నకు నొండ్లు, సొరవు. అశ్వ. 2-29; శాంతి. 6-168

క. ఈ వ్యాధి యొంటఁ దీఱదు, దివ్యౌషధ యుక్తమైన దివిజ వనంబున్, హావ్యాశన భక్షింపు మ,హోన్నాదిశమంబు దాన నగు నీకని నన్. ఆది. 8–248

ఉ. ... మీ, రొండు విధంబు సేయు టిది యుక్తమె బవ్యానియుక్తి యుండఁ న్. ఆది 2-87; ఆది. 4-95

సీ. భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి, పెట్టు నీవారాన్న పిండ తతులు – తే – గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడుచున్న యెలుకలుఁ బిల్లులు నొండు సహజవైరి వర్గంబులయు సహవాస మపుడు, సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమందె. ఆది, 4–28

(ఒండు = ఒక్కట అని యరము)

3. ఒకటి.

వ. ...అప్పరాతి వర్గంబులు దివియలు దెచ్చిన నద్దరణీవరుండు రథం

బునకై దును గరికి మూఁడును దురంగంబున కొండును నియతం
బుగాఁ బట్టించి. ద్రోణ 5-144

క. విను జీవముతో సన్నం, బననిచ్చుట యొండుదక్క సమరంబునఁ
గోరిన యది నీకొసగెద నింక నన చెడియెనె యకట యన్న
సమ్ముల కూర్మిల్. కల్యా. 2-110

4 ప్రతి వచనము

అ. ...అతఁడు వేఁడెడుఁగానకు, నేఁగుచుండి మనల నిప్పుడింత,
నూడవలదె యొండులాడక యప్పని, నలువు టొప్పు బాహుశాలి
నీకు. అ. శ. 1-111

క. అనిన విని యొండు పలుకక, దనుజాధీశ్వరుఁడు వోయె గతిగా
దశకుం, బనియె నవజ్ఞుముఖుఁడై దివి, కనిమిష నాథుండు గౌర
వాన్వయముఖ్యా శాంతి. 4-410

ఒండుమెయి, ఒండుమై దే.

వేఱు విధము, మఱి యొకరీతి

తే. వినుము నృపసత్త్వమును రజస్సును దమస్సు, ననఁగ గుణములు
మూఁడిరి గొనుచు నాత్మఁ బట్టుకొను నొండు మెయిఁదెగ నిట్టల
ముగ, నొలయు వైరాగ్యమును కొడవలిని కాని. శాంతి. 4-162

శా. దేవా నాలవజాతి వాఁడ నినునర్థిం గొల్వఁగా వచ్చితిన్, సేవా
దక్షత యొండుమై నెఱుఁగ నీ చిత్తంబునన్ మెచ్చునట్లే యొడం
గడు నేర్తు. విరా. 1-218

ఒండె అవ్య. ద్రు.

పక్షాంతరమును దెల్పును

వ. ...ఇది మనము మోహంబునం గానమి నొండె వారు లోభంబున
వచ్చుట నొండె నగు. విరా. 4-185

సీ. ...గుప్త నివాసమొండె, మాతువు మీఁదొండె మాటులేని
యరణ్య, తలమొండె మంత్ర విధానమునకు నర్హములు.
అ. శ. 1-58

వ. ఎడసేయక ద్రుపదుండు పాండవులను విడుచునట్లుగా శేషంత

మొండెవలను గల వారలం బంచి కౌంతేయ మా|దేయులను
దమలో విరక్తులగునట్లుగాఁ జేయింత మొండె నతిలలిత ప్రమదా-
జనంబులఁ బ్రత్యేకంబ యేవురకుం బ్రయోగించి ద్రౌపదివలన
విరక్తిఁబుట్టింత మొండె నేవురకు నొక్కతియ యాలగుట
కష్టంబు. ఆది 8-22

సీ. ఆయంబునందు నాల్గవ భాగమొండె మూఁడవ భాగమొండె
సందర్భమొండెఁ,గాని మిక్కిలి సేయఁగా దువ్యయంబు.
సభా. 1-46

**ఒండొంఁడ** దే. అవ్య. (ఒండు+ఒండు+అ)

1. వరుసగా, యథాక్రమముగా, క్రమక్రమముగా.

సీ. గాండీవ గుణరవం బొండొంఁడ చెలఁగంగ శరపరంపర లాకసంబు
గుప్పఁ. ఉద్యో. 2-144

తే. అర్జునుండును పర్జన్య నస్త్రవృష్టిఁ, బల్లమును మిట్టునని యేబు
పటుపరాక, యుండ నెతురు వెల్లువ లొండొంఁడ పెరిఁగె. నుబ్బి
భూత బేతాళంబు లోలలాడ, ద్రోణ. 3-108

క. పాండవుల విభవమతియా,ఖండలు విభవంబుకంటెఁ గడు మిక్కి
లిఁయై, యొండొంఁడ పెరిఁగి దిక్కులు, నిండెఁ దదీయ ప్రతాప
నిర్మల రుచితోన్. సభా. 2-104

2. తోడ్తో, వెంటనే.

సీ. వెఱవక ననుఁ జూచె వీఁడని యెవఁ గలు,పించిన నొండొంఁడ చెమట
వొడమ. విరా. 2-33

వ. ...నెత్తురొండొంఁడ పరఁగి పరశురాము శరీరంబుఁ జొకిన నతండు
మేల్కని. శాంతి. 1-22

వ. ...సముదిత సాంద్రసంరావంబు రోదసీ కుహరంబు నిండిన
నొండొంఁడ మట్టలెత్తుకొని నేలమట్టవియుచు నద్రవం బసులు
వెసం దిరిగి మున్ను విన్నచ్చుండు వచ్చిన జాడం గైకొని.
విరా. 4-265

**ఒండొంఁడు** దే. సర్వ. బొ (ఒండు+ఒండు)

అన్యోన్యము, పరస్పరము.

సీ. కవట లొండొంటితోఁ గదియుచు నెడములు, బ్రమింగి బ్రబ్బఁగ
సొంపు మిగులు దాని. విరా 1-162

సీ బహుళపదాతి దుర్భర భారమదరిన, మరగ కూర్మంబు లొండొం
టిఁ బొంద, విరా. 3-156

సీ. ధర్మ విదుండవై ధర్మార్థ కామంబు లొండొంటి బాధింపకుండ
నుచిత,కాల విభక్తముల్ గాఁ జేసి. సభా. 1-25; శాంతి. 2-314

**ఒండొక** సర్వ. (ఒండు + ఒక)

మరియొక, వేఱొక.

తే. కౌరవాన్వయ సంజాతులై గౌరవమునఁ, బెరిఁగినట్టి మీ రొండొక
నరునిఁ గొలిచి, మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి యడఁ
కువతోడన యునికి యరిది విరా, 1-118

క. మనకేటి రాజ్య మొండొక, జనపదమున నేగి భైక్ష చర్యా విధి
జీవనము నడపికొని యుండుదము. శాంతి. 1-48

క. దీపంబువలన నొండొక. దీపము పుట్టించినట్లు. ఆది. 4-89

**ఒండొకటి** సర్వ. (ఒండు + ఒకటి)

1. ఇతరము , మఱియొక్కటి.

ఉ. నెయ్యము దప్ప నొండొకటి నీ చెవిఁ సోఁకనె నాదు పల్కులం
దియ్యెడ సంజయా. ఉద్యో, 1-304

2. వేఱు విధము, విపరీత పద్ధతి.

చ. అని శిశుపాలుఁ డొండొకటి నప్రియముల్ హరిఁ బల్కుచున్నచో.
సభా. 2-68

**ఒండొకండు; ఒండొకఁడు** దే. సర్వ. (ఒండు + ఒకఁడు)

1. ఇతరుఁడు.

శా. రాధేయుండును దుస్ససేనుఁడును బోరం బ్రాపుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు నొండొకఁడు నాకుం దోడె నీ వింక నన్
బాధం బెట్టకు. ఉద్యో. 2-251

ఉ. వేర్చిన మూఁక గూడ నడపింపఁగ గోత్రుల సేయుఁ దీవ్రబాణా
ర్చుల మార్గలంబుల రయంబున నీఱుగఁ గాల్ప నాజినీ, వేర్చిన
భంగి నొకడొకఁడు నేర్చునె ద్రో. ణ 1-42

2. ఇతరము, మఱియొకటి (ఈయర్థమున ఔపవిభక్తికము)

తే. దినము వంధ్యంబు గాకుండఁ దివిరి యన్న,పానదానంబు లొదవిన
భంగిఁ జేసి, మఱి భుజించుటఁ బోలెడు మహితధర్మ, కార్య
మొండొకఁ డెందును గలదె యరయ. అను. 4-278

చ. ...ఉద్ధవుండు ద్యానలఘు తపం బొనర్చుటకు నై విపినంబున కేఁగు
వాఁడుగాఁ, బలికిన దాని కొండొకఁడుఁ బల్కఁడ కృష్ణుఁడు,
కాల వేదితన్, మౌస. 1-38

వ. అవ్వనిత యవ్వనం బెట్టిదని యడిగిన నమహాత్ముద్విజుం డిట్లనియె.

ఉ. అంతకుఁ బిన్నలున్ పెదక నంతకుఁ బెద్దలు లేవు దుఃఖ మ,త్యంత
ముఁజేయ సౌఖ్యమెసలార నొనర్పఁగ నొండొకంటి యం,దంతటి
నేర్పు లేదు. ఆశ్వ. 2-54, 55

ఒండొకరుఁడు దే. సర్వ. (ఒండు + ఒకరుఁడు)

మఱియొకఁడు.

ఉ. ...మత్స్యభూమిభృ, ద్గేహమునందుఁ బేడియనఁ గీడ్పడి యుండెనొ
కాక యీ కురు,వ్యూహముతోడి కయ్యమున కొండొకరుం డిటు
లొంటి వచ్చునే. విరా. 4-76

ఉ. ...వీరలకాక వీరితో, నొండొకరుండు మార్కొనఁగ నోపునె.
భీష్మ. 2-47

(భూరిశ్రవుఁ డర్జునునితో)

ఉ. నీ దెసఁ జూడ నొండొకరునిం దగ మార్కొని పోరుచుండఁ బెం,
పేద వినీచకర్మమున కియ్యకొనం దగునే భవాదృశుండు.
ద్రోణ. 4-263

ఒండొరుఁడు దే. సర్వ. (ఒండు + ఒరుఁడు)

అన్యోన్యము, పరస్పరము

(ప్రథమైక వచనాంతముగకు మాత్రము ప్రయోగము కానంబడదు)

ఉ. ఒండొరు మీఱు కోర్కి మెయి నొక్కట బాసలవారు నొచ్చినన్.
విరా. 3-166

ఉ. ఒండొరు మీఁద సాయకము లొక్క మొగిం బఱఁగింతు రేపుమై,
నొండొరు బాణముల్ నఱికి యుర్విపయిన్ నెఱయింతు రుగ్రులై
యొండొరు మేనులన్ శరము లుచ్చచనన్ నిగిడింతు రిట్టు,లుద్దం
డతఁ బోరి రాఱనిమదంబుల నొండొరు మీఱు నాసలన్.
ద్రోణ. 4-218

వ. ...అమ్మహా వీరులు దలపడువారై వీరోద్రేకంబునం జేసి యతి
లోకంబగు నవష్టంభంబున విజృంభించి యొండొరుల నవలోకించి రట్టి
యెడ. శల్య. 2-188

వ. అని యిట్లు గంగావసువు లొండొరులు సమయంబు సేసికొని చనిరి.
ఆది. 4-188

క. ఒండొరులకు రక్షకులై యుండుదురు. శాంతి, 2-200

వ. ఉబ్బునందలపడిన బెబ్బులుల కరణి నొండొరుల మేనులు నెత్తుట
జొత్తిల్లం జేసి. ద్రోణ. 3-268

ఒండొరువుఁడు దే. సర్వ.

ఒండొరుఁడు.

తే. భూరేణువు కతన రాత్రిగాక మున్న యొండొరువులఁ గానరైరి
విరా. 3-190

చ. అరదము మీఁదఁ మున్ బొలుచునాతఁడొ యిప్పటి యాతఁడో
దివాకరుఁడను సందియంబు భుజగంబుల చిత్తములందుఁ బుట్టి
యొండొరువులతోడ వారు కడు నొయ్యనఁ బల్కఁగ.
శాంతి. 6-608

క, అనిమిషవరుఁ డివ్విధమున, జనియింపఁగ జేసెఁ బగయ సంగతులై
వారును దెగి యొండొరువులతో,నని బెట్టుగఁ జేసి చచ్చిరందఱు
నధిపా. ఆను. 1-298

క. ఇరువురు నొండొరువులఁ గడు, సురుచిరముగఁ జూచి వాఁడి
చూడ్కులు దనకున్, శరములుగాఁ గొనియేసెను, మరుఁడయ్యిరు
వుర మనోభిమాన చ్యుతిగాన్. ఆది. 4-146

ఒందించు దే. స. క్రి. ఒందఁజేయు

1 కలిగించు.

క. తానును గాంధారియునెద్దానిం గార్యంబుగాఁగఁ దలఁచి పనిచి నన్, దానికిఁ గాదనవలదు, పూని యనుష్ఠింత మదియ పొగడొం దించున్. సౌప్తి. 1-48

2. పొందించు,

సీ. ...వసంతంబు ఖానుని చాడ్పునఁ దగియెడు పాటితో ధరణి ప్రజల,నుచిత వర్తనముల నొందించునది యిది, రాజ ధర్మములకు రాజసుమ్మి. శాంతి. 2-178

క. ఇందుల తాత్పర్యము నీ,డెందము నొందించి యతి దృఢీకృత శీలా, స్పందితుఁడవగుము తిరమై, యిందిర నీకడవసించు నిభపురనాథా శాంతి. 517

వ. నీవ యేల వినాశంబు నొందించికొనియెదవు- అను. 1-97

ఒందు దే. అ. క్రి.

కలుగు, ఏర్పడు.

క. వేగిన గౌరవ సేనలు, వేగమ కై సేసి యనికి వెడలెంది ద్రోణ,ద్యోగత భీష్మని మున్నిడి, సాగరములు మేరదప్పు చందం బొందన్. భీష్మ. 2-274

చ, అనుడు విషణ్ణమైన హృదయంబున గారవమొందఁ. విరా. 1—243; అను. 1-25

వ. అవిలఘు బప్పురిఁ బౌరచిత్తముల కళ్యాణంద మొందఁగ నం,దిని యన్నేటితరంగలం బెసఁగుచున్. ఆది. 8-79

శ్లో. నదీ చ నందినీ నామ సా పురీ ముపగూహతే

అను మూలమునుబట్టి "నందిని యన్నేటి తరంగల" అను పాఠమే యుక్తముగా నున్నది, "ఆర్థిని మిన్నేటి" అను పాఠాంతరము పొసఁగదు.

"విలసత్కూల ఘనవల్లి, యన్నిష్టసఖ నూఁది యున్నదాని. ఆది. 8-140

"వృత్రుఁడన్నసుర గర్వించి" అర. 8-8 వలెనే ఇచ్చట 'అన్నెటి తరంగల' గ్రహించునది.

2. ఒప్పు (ఈ యర్థమున గొన్నిపట్ల వాక్యాలంకారముగా నుపయోగింపఁబడును)

సీ. ...అయ్యెయి బంధుల నందు నిందు, నందును నిలుచున ట్లొందఁగ నియమించి...(వాక్యాలంకారము) మౌస. 198

సీ. అందు ఋచీకున కొందంగ జమదగ్నియను మునిపుట్టె. ఆది. 3-70

ఉ. ...వారలఁ జంపి తెచ్చి నా, కొందఁగ వండిపెట్టుము రసోత్కట మానవ మాంసఖండముల్. ఆది. 6-186

స. క్రి.

1. పడయు, పొందు.

క. మన్నన కుబ్జక యవమతి, దన్నొందిన స్రుక్కుఁబడక ధరణీశు కడన్, మున్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్. విరా. 1-138

క. ఘృత మర్చిస్సంపదయయి, ఘృతార్చి రభిధాన మొందె. శాంతి. 6-435; శాంతి. 5-607; స్వర్గ. 39

2. తాఁకు, అంటు, స్పృశించు.

తే. పద్మాక్షుఁ డవ్విరూపాక్షునకు ధరాతలము జానుపాణి శిరంబు లొంద, మ్రొక్కి నిలుచుండి. ద్రోణ. 5-406

క. పద్మపత్రంబు నీరంబొందని యట్లు. అర. 1-24

3. జనించు.

ఆ. సకల జీవరాశి సుకృత దుష్కృత ఫల,మెఱిఁగి నడపుకున్న యిట్టి ధర్ముఁ, డొంద శూద్రయోనియందు మాండవ్యుచే, శప్తుఁడై యదేల సంభవించె. ఆది 4-260 (చూ. 258)

శ్లో. కిం కృతం కర్మధర్మేణ యేన శాపము పేయివాన్,
కస్య శాపాచ్చ బ్రహ్మర్షేః శూద్రయోనావజాయత.
సం.భా. ఆది. 107-1

(రతియందు) కలియు. కూడు.

సీ. ఏనవ నాఁడొంద నింతియు షష్ఠాహ్నమునఁ బొంద మగవాఁడుఁ బుట్టు. అను. 4-126

వ. ...అట్లొందిన యయ్యిరుపురకునుం బ్రభవించిన సౌరభేయీ కులంబాకమలాసను నిర్దేశించినట్టిదై సురాసుర ప్రముఖ నిఖిల జనంబులకు నమస్కార్యంబును సపర్యాభాజనంబును నయి రాజిల్లు. అను. 3-51

5, చేరు.

క. తనుఁ గాచి వెనుకవచ్చిన, దనుజ మహాబలము తనదు తను వొందిన న్నాతనిచే విదిల్చి రభసంబునఁ దన్మందిరము ద్రుపద పుత్రిక వెడలెన్. విరా. 2-126

6. ఊను, పూను.

ఉ. ...మహాకవిత్వ దీక్షా విధినొంది పద్యమున గద్యములన్ రచియించెదం గృతుల్. విరా. 1-30

ఒక సర్వ. (సం. ఏకః)

(వృత్తియందుఁ బ్రత్యయము లోపించిన రూపము)

1. ఏకార్థము.

చ. వెలచితి రేని నిల్వఁడొక వీరున కొక్కఁడ చాలు. విరా. 4-201

క. ఉడిగి మడుగవలసె నిప్పు డొక సాత్యకిచేన్. ద్రో. 4-89

చ. నుతజల పూరితంబులగు నూతులు నూటికంటె సూనృత, వ్రతయొకబావి మేలు. ఆది. 4-93

2. ఒకానొక.

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియు దా నరదంబులతోడఁ గ్రోశమాత్ర మెుక చోటి కల్గఁ జని. విరా. 1-68

క, విలువిద్య నొరులు నీకగ్గలముగ రేకుండ నిమ్మఁ గఱపుదు ననిమున్, పలికితి రొకా కాదీ, త్రిలోకములు కధికుఁ జూచితిమి యొకయొఱుకున్, ఆది. 5-289

3. సామాన్యము, సాధారణము.

ఉ. ...ఆ,ఖండలుఁ డన్న గద్దియ సగంబుననుండె మహానుభావుఁ డీ,శం డొక మర్త్యుఁ జేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁడొకో విరా 1-85

క. నరుఁ డొక రథికుని యనుమతిఁ, జొరఁ దలఁచునె మనుజసేన సుర, బలమైన,న్దెరలిచికొని నిచ్చల విడి, నరుగుం దన వలచినెడకు నదియట్లుండెన్. ద్రోణ. 4-147

ఆ. యోగబలములేని యొక భంగి యోగి బల్, ద్రోపులేని మీను నేవు లేని, మృగములయు నవియుఁ దెగిపోవ నుఋకంగ,లేని యట్లు భవములోన నడఁగు శాంతి. 5-578

4. అన్యము. వేఱైనది.

ఉ. ఏ నిటులంటినా వలవ దింకను నీవును రాజుఁ దమ్ములుం, గా నుచితంబు సూచి మన కార్యము మీసుజనత్వముం జెడం,గా నొక భంగి సేయక తగుం గురువర్గముతోడి సంధి మీ,కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్. ఉద్యో.3-105

(ఒకభంగి = కాని విధము, భిన్నమైన పద్ధతి)

గీ. ...భీముఁడెచట నున్నాఁడు నాయొడలెట్లు ప్రాణ, సహితమై యుండు నతఁడొక చందమైన, నేమిగతిఁ బోదు నక్కట యెఱుఁగఁ జెపుమ. (ఒక చందమైన = మరణి చిన) భీష్మ 2-265

5. అనిర్వాచ్యము, ఇంతయని వివరించి చెప్పుటకు వీలులేనిది

తే. అనిన విని కిన్కఁబూనిన యలఁతినగవు, చెలువు మొగమున కొక క్రొత్తపోలు పొనర్పఁ, బుండరీకాక్షుఁడను పెల్లఁ బోయి యప్పు, డరుణ కమలాక్షుఁడగుచు మురాంతకుండు. ఉద్యో. 3-364

6. తెగలు తెగలుగా విభజించునప్పుడు మొత్తమునకు వాడఁబడునది.

క మన మొక యేపుర మీ యం,గనయుం దో నరుగుదేరఁగా నెయ్యొడఁ బో,యిన సెఱుఁగకుండుదురె. విరా. 1-59

7. కొంచెము, అల్పార్థము.

చ. ఇది కడుముద్దరాలు పనులేమియుఁ జేయఁగనేర దెంతయున్.
మృదు వొక కీడుపాటునకు మేకొనఁజాలదు  విరా. 1-108

చ. ...అక్కట యింతకుముంద రేమియున్, మనల నెఱుంగఁ డవ్వి
భుని మాటునఁ బూనిక దీర్చికొంటి మా,కనికొక యెగ్గుసేతఁ యుచి
తంబె  విరా. 5-313

8. కొన్నిపట్ల వాక్యాలంకారముగా నుపయుక్తము.

చ. వలపదు రోయఁ బాండవుల వారొక యూఱటలేని త్రిమ్మరటన్,
బలమఱి వన్యసత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియు,న్మ్రల
వదె.  విరా. 3-95

క. వెలివిరిసి వచ్చు జలనిధి, పొలుపునఁ దోఁతెంచు ధర్మపుత్రుని బలు
గో,త్రల నిలువరింప నీవొక, చెలియలి కట్టవయి మమ్ముఁ జేకొను
మిచటన్.  భీష్మ. 3-241

ఒకండు; ఒకడు సర్వ. ఒక్కఁడు (ఇది అమహదర్థకమున ఔప
విభక్తికము)

1. ఒకటి.

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టులనియె నీవత్సర, మొకఁడు నెట్టులయిన
నుడిగిమడిగి, సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి
పిదప వెగడవలయు.  విరా. 1—148

తే. అతఁడు నీ ఱొమ్ము ద్రొక్కిన యపు డొకండుఁ, జేయఁజాలవ
యగ్గురు సాయకములఁ, బాండవానీకములు విచ్చి పాఱ నెన్ని,
యెడల మార్కొంటి వాతని నెఱుఁగ వెట్లు.  ద్రోణ. 5-389

తే. అందు మూఁడేసి ఋతువుల కయన నామ,కంబులగు నుత్తరాఖ్య
మొకండు దక్షి,ణాభిధాన మొక్కటియు గుణాభిరామ, యవి
యహస్సును రాత్రియు ననఁగఁ బరఁగు.  శాంతి. 5-41

గీ. ఒకటనైనను వారియం దొకరిలోని, చిదురపాలును బోండు.

చ. ఒకటను మేలుసేయని సుయోధనుఁడు.  స్వర్గ. 25

(ఒకటను = ఒక విషయమందైనను)

2. అన్యుఁడు, ఇతరుఁడు.

ఉ. ...వ,న్మీఱఁగ బానసీని నొకనిం బురిఁగానని యట్లుగాఁగ మేన్,
గాఱియ వెట్టియైన నొడికంబుగ వండుదు నెల్లగూరలున్.

విరా. 1-77

3. ఒకానొక పురుషుఁడు, అల్పుఁడు.

సీ. ...ఎందు నుతికెక్కి —తే— యున్న గంధర్వు లేవురు నన్ను
నిట్టు లొకఁడు పఱుపంగ నూరక యునికి సూడ, నచ్చెరువుగాదె
యెవ్వరి యాండ్రురింకఁ, బరిభవంబునఁ బొందక బ్రదుకువారు.

విరా. 2-140

ఉ. ...ఇట్టి ననుఁ బంకజనాభ యొకండు రాజసూ,యావభృథంబు
నందు శుచియై పెనుపొందిన వేణి వట్టె యీ,యేవురుఁ జూడఁగా
సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. ఉద్యో. 3-110

4. ఒక పురుషుఁడు.

(అర్జునుఁ డుత్తరునితోఁ గర్ణుని జూపి)

క. వీఁడొకఁడు కురుబలంబున, వాఁడి మగండనఁగఁ జాలువాఁ డిబ్బం
గిఁ, బోడిమి సెడియెను ద్రోణుం, వేడిమి యిట మనకు మునుము
విక్రమమునకున్. విరా. 5-110

5. ఏకీభూతుఁడు, కలిసినవాఁడు.

ఉ. ఏ మును పాండునందనులు నేక కులంబునఁ బుట్టి యొక్కచో, నే
మొకఁడై నఁజేసి గెడనెడ్డు చరించిన యట్టి వార ము,ద్దామ బలంబు
శౌర్యమును దర్పము వారిక కల్గి వారసం,గ్రామమునన్ జయింతు
రనఁగా నొక నిశ్చయమెట్లు గల్గెడున్. ఉద్యో. 2-239

6. ఒక వ్యక్తి (ఎంతటి గొప్పవాఁడైనను లేక ఎప్పుఁడైనను అను
భావము సూచించును)

ఉ. వారిని వారి వారి నిటువర్ణన చేసెదుగాని మమ్ము మా,వారిఁ
దలంప విప్పుడమి వారికిఁ బాయను మాకు నంతయుం. జేరను
మున్ సృజించె విధిసిద్ధము దీని నొకండు మాన్పఁగా, నేరఁ డకార
ణంబ మది నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్. ఉద్యో 2-240

7. కీడు, హాని.

క. అది యొకఁడుఁ జేయఁజాలక, విదళితశైలమగు తనదు విలసన మచటం, గుడియుట దనకుం దెలిసిన, మదమతి గిరిభేది కడకు మగుడం జనియెన్. అను. 1-258

**ఒక కాలము వి.**

ఏ కాలమందును, ఎప్పుడును.

(ఇది ఈ యర్థమందు సముచ్చయము గలిగి వ్యతిరేకార్థకముతోఁ గూడి యుండును.)

చ. ...నరేంద్ర యప్డు సంగరమతి ఘోరమయ్యె నొకకాలము నట్టిది సూడ మెయ్యెడన్. ద్రోణ. 3-117

శ్లో. కదాచిన్నాస్మాభిర్దృష్టం తాదృఙ్న చ శ్రుతమ్. సం. భా. ద్రోణ. 95-4

**ఒక కొండ వి.**

మిక్కిలి గొప్ప పదార్థము (అలంకారికము)

చ. కుడువఁగఁ గట్టబంధులకుఁ గోటి విధంబులఁ బెట్ట జన్మము,ల్నడు ప ననేక ధర్మవిధులం బొగడొందఁగఁ జాలు నట్టియొ,క్కుడు సిరి యిచ్చి పేర్మి నొకకొండగ మన్నిన నీవు సావఁగా, నొడ లిటు లో మిఱిం గురుకులోత్తము యేనొక పేవకుండనే. సౌప్తి. 1-224

**ఒకటు; ఒక్కటు అవ్య. ద్రు.**

ఏక కాలమున, ఒక్కమాఱుగా.

క. ఒంటిమెయి నుండఁగా ముక్కంటికి నాకచ్ఛపంబు గొరుం బట్టం, గంట యరిది యొక్కొకటన, రెంటిం బొరువంగవలయు రేవెర వారన్, అను. 1-223

**ఒకటి సర్వ. ఒకటి (సం. ఏకః)**

1. ఏకము, ఏకత్వ సంఖ్యాకము.

తే. మణిగణోజ్జ్వలమైన విమానమొకటి, యంబరంబునఁ గాంచి. శివప్ర. 2-268

క. .. ఇతిహాసమొకటి సెప్పెద నధిపా. శాంతి. 3-470

2 ఒక సంగతి, ఒక విషయము.

ఆ. ఏను బుట్టి వేయు నిన్నూఱు మున్నూఱు, గలవు వత్సరములు గాన నెందు, బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధుని, జచ్చిపోయి మగిడి వచ్చువాని.

క ఒకటి గలదు వత్తురు వేఁఱొక గర్భంబునకు మృతులు. శాంతి. 3-375, 376

ఆ. ఒకటి దెసను దృష్ణ యొలయదు గావున. శాంతి. 1-127

చ. కడు పనిబిడ్డ వీఁడొకటి గాదవునా నెఱుంగఁడు. విరా. 2-218

క. తన మదిఁగదిరిన తమకం బున జిడిముడి పడుచు ద్రుపద పుత్రిక పై నూనిన వేడ్క దిగువ నొకటియుఁ, గనుఁగొన విన లేక మదన కంపితుఁ డగుచున్. విరా. 2-243

(ఒకటి = ఒక వస్తువు, ఒక విషయము)

3. అన్యము, భిన్నము, వేఱైనది.

క. వేఱుగఁ గనినం బ్రకృతికిఁ, జాఱవిడిచి నట్లు తనదు సుజ్ఞానము న్వక్కాఱు విడిచి తన కంచెను, మీఱ నొకటి లేమిఁ గాన్పు మెయి కొన వలయున్. అను. 4-207

వ. మిత్రుని కోరిన యది యిచ్చుచుండి దానికి మాఱుగా నొకటి పుచ్చుకొనుట పురుషార్థంబు తెరువే. సౌప్తి. 2-48

4. ఒక పని.

చ. ...యొంటి దిరుగు దానికోర్వ దొకటిం దనుదా సవరించు చొప్పెఱుంగదు తగనొండొరులం గొలువఁగా వెరవెమ్మెయిఁ గల్గు నక్కటా విరా. 1-108

5 బుద్ధి

తే ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి నాల్గింటిఁ గడు వశ్యములుగఁ జేసి, యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. ఉద్యో. 2-87

ఒకటిన్ = బుద్ధిని; కొని = గ్రహించి, పూని; రెటిన్ = పుణ్యము పాపము అనువాని రెండిఁటిని, నిశ్చలయుక్తిన్ చేరి = అచంచలముగా

బుద్ధియందు నిలుచు నటులఁజేసి అనఁగా ఏది పుణ్యము ఏది పాపము అను విషయము నెల్లప్పుడు బుద్ధియందు విచారణలో నుంచి; మూఁటిన్ = శత్రువులు, మిత్రులు, బాంధవులు అను మువ్వురను; నాల్గింటిన్ = సామము, దానము, భేదము, దండము అను నాలుగు ఉపాయములను; కడువశ్యములుగన్ + చేసి = తనకు మిక్కిలి స్వాధీనములో నుండునట్లు చేసి అనగా శత్రుమిత్ర బాంధవులు తనకెప్పుడు మిక్కిలి లోఁబడియుండు వారుగను సామభేద దండోపాయములను బాగుగా నెఱిఁగి వాని వానిని ఆయా సమయములందు ఉపయోగింపవలసినంత వఱకు ఏమఱక ఉపయోగించి; ఏఁటిని గెల్చి = పంచ జ్ఞానేంద్రియములను (1. త్వక్కు, 2. చక్షువు, 3. శ్రోత్రము, 4 జిహ్వా, 5. ఘ్రాణము) జయించి; ఆఱింటిన్ + ఎఱిఁగి = సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము అను నాఱు విషయముల యందు సంపూర్ణ జ్ఞానము గలిగి యాయా సందర్భముల యందు వానివాని బ్రయోగించుచు. ఏడు + విడిచి = సప్తవ్యసనములను. 1) ద్యూతము, 2) వేఁట, 3) స్త్రీ, 4) మద్యపానము, 5) అర్థదూషణము, 6) వాక్పారుష్యము, 7) దండపారుష్యము అను వానిని పరిత్యజించి; వర్తించువాఁడు = ప్రవర్తించు వాఁడు; వివేకధనుఁడు = విజ్ఞానమను ధనము గలవాఁడు.

6. హాని, కీడు, ఉపాయము.

క. హితుఁడగు మంత్రిం గుటిలుల, యతి కపటోపాయములకు నగపడి చెఱుపన్, మఱిఁ దంఁతురె పతి సుపరీక్షితంబు గావింప కొకటి సేయం దగునే. శాంతి. 3–73

వ. కురుబలంబున కొకటి పుట్టినం బ్రసిద్ధులరు గావున నది మీ తలన నిలుచు నట్లగుటంజేసి. విరా. 4–224

ఆ. వాసనాత్మజుండు వసుధేశ నందను, ముట్టకొనిన నొకటి పుట్టె నేని, మన ప్రయోజనంబు మఱియేమి పసులవి, యేటికొందు ధనము లెల్ల నేల. విరా. 4–261

7. మేలు, ఉపకారము.

చ. అన విని నన్నుఁగాంచితి ప్రయత్నమునన్ వినిపింపు మీవు వచ్చిన

పని వాకు నీ కొకటి సేసితినే యిటు వృథమూల వ్యాసుని క్రియ
లేచిపోక తగు చొప్పగునే థవదీయసాంఛ నెప్పిన నది యేను
దీర్తు మఱి పెంపెసఁగం జను థూసురోత్తమా. శాంతి. 6-613

8. ఒక విధము.

క. అనవుడు భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లను నీవునుం గొడుకు
నేమే నిచ్చిన నొకటి యీఁగి లేకున్నను వేఱొక్కటి దలంచు వా
కేళవుఁడున్. ఉద్యో. 3-165

9. ఒకానొకటి.

క. ఒకనాఁడు గోవొకటి లేఁగకుఁ జన్నిచ్చుచును దానిఁ గనుఁగొని
నీ విం కకటా యెక్కడఁ జేరెద, వకృపులు వచ్చెదరు చంప నని
పల్కుటయున్. అను. 8-85

క. శకట పథంబునఁ గిటం, బొకటి వెసం బాఱఁ గాంచె యోగీం
ద్రుఁడు జంతుకలాప మానస దశాప్రకార సంవేది బాదరాయ
ణుఁ డధిపా. అను. 4-316

క. ...ఐనను, విననది కథయొకటి నీకు వినిపింతుఁ దగన్.
అను. 2-181

ఒకటియగు; ఒక్కటియగు అ. క్రి.

1. అన్యథా యగు, వేఱొక విధముగా నగు.

క. అతఁడొకటి యైన నేనే, గతిఁబోదుం జెపుమ యెల్లకార్యంబులలో,
నతనికిఁ దోడ్పడఁ బోవుట, యతిముఖ్యము దానిఁజేయు మనఘ
విచారా. (ఒకటియగు = మరణించు అనిభావము) ద్రోణ. 3-287

2. ఏకమగు.

వ. శాంతిప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మనుట
యెడఁగూర్చి రమ్ము. ఉద్యో. 1-272

వ. మీరును వారును నొక్కటియై యున్న మీ దిక్కు దేవతలకుం
దేఱి చూడరాదు. ఉద్యో. 2-49

ఒకత వి.

ఒకతె.

క. నీ వొకతవేలఁ బదివేవురనే వలచి పట్ట వెరకిన నడ్డంబై వచ్చి
వలదు నా నిం,దేవాఁడు మగండు. విరా. 2-256

క. పని పంపఁగాని యొకతకుఁ, బనిసేయ నెఱుంగ నన్నుఁ బనిగొను
నెడఁ బాం,డుని యగ్రమహిషి గొంకుచుఁ, బనిగఱపెడు చందము
నన పనుచు లెఱుఁగవే. విరా. 2-219

**ఒకతల; ఒక్కతల వి.**

1. ఒకవైపు, ఒక పక్షము.

క. ఆ యిరువురు నొకతలయై, యాయోధమునకు నడచు నట్టిద
యేనిన్, వేయేల మనక కాదెదు,రై యేత్తైఱఁ దాఁక హారున
కైనను వశమే. ఉద్యో. 2-151

2. ఒక ఎత్తు.

క. ఇది యెల్లను నొకతల యీ, పదుమూఁడేఁడులును నాకు బావ
కొడుకుచే, నదయమగు కూడు గుడుచుట, యది యొకతల
యయ్యెనేమి యనఁగల దనఘా. ఉద్యో. 3-192

సీ. ఇది యెల్ల నొకతల యేపు మీఱఁగ నన్నుఁ జెనకుట యొకతల
నెప్పనేల. అర. 7-61

3. ఒక మొత్తము, ఒక గుంపు

వ. ...అయ్యెడకు వచ్చు కౌంతేయులతో వీరెల్ల నొక్క తలగా
వెడలి వేడుక జూడం జనుదేర. కల్యా. 2-352; కల్యా. 1-100

**ఒకనాఁడు; ఒక్కనాఁడు వి.**

1. ఎప్పుడైన ఒకప్పుడు.

క. ఒకనాఁడేనుము నాపద,లకు విడుమరఁగాంచి విపులం బుట్టలఁ
బెట్టుకొని సుఖముండఁ బడయుదు,మొకో యిప్పాటెందుఁ గందె
యొరు లెవ్వరికిన్. విరా. 1-49

2. ఒకానొక దినము.

సీ. అరయంగఁ దప్పులేదంటి నీవలనఁ గీ,డొక నాఁడుచేసియు నొక్క
నాఁడు సేయవె. ఉద్యో. 3-366

